# చతుర ప్రపంచం

## బుద్ధిజీవులకోసం సాగుతున్న అన్వేషణ

గ్రహాంతర వాసులకు సంబంధించిన సినిమాలేవైనా విడుదలైతే మనం ఎంతో ఆసక్తిగా చూస్తాం. విశ్వాంతాలూకూ రహస్యాన్ని తెలుసుకోవాలన్న జిజ్ఞాసే ఇందుకు కారణంగా చెప్పచ్చు. విశ్వంలో మనతో పాటు లక్షల, కోట్ల నక్షత్రాలు, గ్రహాలు, గెలాక్సీలు ఉన్నాయి. మరి వాటిలో కూడా జీవులున్నారా? ఉంటే ఎలా ఉంటారు? ఏం తింటారు? లాంటి ప్రశ్నలకు జవాబులు తెలుసుకోవాలన్నదే గ్రహాంతర జీవుల అన్వేషణకు నాందిగా చెప్పొచ్చు. అప్పుడప్పుడు కనిపించే ఫ్లయింగ్ సాసర్లకూ, గ్రహాంతర జీవులకూ ఏదైనా సంబంధం ఉందా అనే అంశం మీద 'నాసా' లో పరిశోధనలు జరుగుతున్నాయి. కొంతమంది గ్రహాంతర జీవుల వాహనాలే ఈ ఫ్లయింగ్ సాసర్లని చెబుతున్నారు






కాలిఫోర్నియా యూనివర్శిటీలో స్పేస్ సైన్స్ లేబరేటరీలో గత నలభై ఏళ్లుగా పరిశోధనలు చేస్తున్నారు ఆస్ట్రోఫిజిస్ట్ డాన్‌వర్తిమర్. ఈయన రేడియో టెలిస్కోపుల ద్వారా ఏలియన్స్ నుంచి సంకేతాలేమైనా వస్తాయేమోనని అన్వేషిస్తున్నారు. ఏలియన్స్ మనకు నిరంతరం సంకేతాలని పంపుతున్నారు. కానీ మనమే అర్థం చేసుకోలేకపోతున్నామని డాన్‌వర్తిమర్ అభిప్రాయం. విశ్వంలోంచి కుప్పలు తెప్పలుగా వచ్చి పడే ఈ రేడియో ట్రాన్స్‌మిషన్ డేటాను అధ్యయనం చేయటం చాలా కష్టమైనా నలభై ఏళ్లుగా విసుగు, విరామం లేకుండా పరిశోధనలకే తన జీవితాన్ని అంకితం చేశారు డాన్.

నిజానికి 1820 వ సంవత్సరం నుంచే



గ్రహాంతర జీవుల గురించి తెలుసుకునే ప్రయత్నాలు మొదలయ్యాయి. ఈ అనంత విశ్వంలో కనీసం పదివేల నాగరికతలు కొనసాగుతున్నాయన్నది ఖగోళ శాస్త్రజ్ఞుల పరిశోధన. ఇతర సౌరమండలాల్లోని గ్రహాల్లో కూడా నాగరికతలు ఉండవచ్చని శాస్త్రవేత్తలు అభిప్రాయపడుతున్నారు.

51 దేశాల్లో దాదాపు తొమ్మిదివందల మంది చిన్నచిన్న రేడియో టెలిస్కోప్‌లతో బుద్ధిజీవుల కోసం అన్వేషణ కొనసాగిస్తూనే ఉన్నారు. వీరిలో కెంట్ కుల్లర్స్ అనే ఓ అంధుడు కూడా ఉండటమే విశేషం. ఫ్రాంక్ డేక్ అనే ఖగోళ శాస్త్రవేత్త మొదటిసారి ఏలియన్స్ తాలూకు రేడియో సిగ్నల్స్‌ని కనుగొనేందుకు ఎనభైఐదు అడుగుల వెడల్పు గల టెలిస్కోప్‌ను పశ్చిమ వర్జీనియా ప్రాంతంలో ఉంచాడు. దీని ద్వారా టౌసెటీ, ఎసిసిలన్ ఎరిడాన్ అనే రెండు నక్షత్రాలను విస్తృతంగా పరిశీలించాడు.

2005 నాటికి 20 మిలియన్ డాలర్ల ఖర్చుతో ఓ హెక్టారంత వైశాల్యం వున్న రేడియో టెలిస్కోపును రూపొందించేందుకు ప్రయత్నాలు సాగుతున్నాయి. ఇది ఒకేసారి వందలాది నక్షత్రాలను సర్వే చేయగలదన్నది ఓ అంచనా. ఆ తర్వాత భవిష్యత్తులో ఓ చదరపు కిలో మీటరంత వైశాల్యం వున్న రేడియో టెలిస్కోపును రూపొందించేందుకు కృషి జరుగుతోంది. చంద్రునికి ఆవలివైపు గనక ఓ రేడియో టెలిస్కోపు ఏర్పాటు చేయగలిగితే మరింత విస్తృతంగా బుద్ధిజీవుల కోసం అన్వేషించవచ్చనే ఆలోచన కూడా ఉంది.

'బుద్ధిజీవులు నిస్సందేహంగా వున్నాయి. అయితే అవి మనకంటే అన్నివిధాల ఎంతో ప్రగతిని సాధించాయి. మనం వారికన్నా ఎన్నో కాంతి సంవత్సరాలు వెనుకబడి ఉండటం వల్ల వీటితో సంబంధాలు ఏర్పరుచుకోలేకపోతున్నామనే డాన్ వర్తిమర్ మాటల్లో నిజం ఎంతో పరిశోధనలు ఫలిస్తే గాని చెప్పలేం.

నిజంగా గ్రహాంతర వాసులతో స్నేహ బాంధవ్యాలు ఏర్పరుచుకోగలిగితే అన్న ఆలోచనే అపురూపంగా ఉంది కదూ!

---

## మిల్స్ అండ్ బూన్ నవలల సృష్టికర్త?

ప్రపంచవ్యాప్తంగా అత్యంత ప్రజాదరణ పొందిన నవలలేమిటని అడిగితే టక్కుమని మిల్స్ అండ్ బూన్ నవలల పేరు చెప్పేస్తాం. అసలింతకీ ఈ నవలలకు ఇంతటి ఆదరణ ఎందుకొచ్చిందీ అన్న సందేహం కలిగితే మాత్రం వివరాల్లోకి వెళ్ళకతప్పదు.

ప్రతి రెండు సెకన్లకూ ఓ నవల చొప్పున అమ్ముడవుతూ చరిత్ర సృష్టిస్తున్న మిల్స్ అండ్ బూన్ నవలల సృష్టికర్త గెరాల్డ్ మిల్స్. 1908లో ఆయన ఈ పబ్లికేషన్స్‌ను స్థాపిస్తే 1920 నాటికల్లా ఛార్లెస్‌బూన్ దాన్నో కొలిక్కి తెచ్చాడు. వీరిద్దరి పేర్ల మీదుగా మిల్స్ అండ్ బూన్ నవలలు విడుదల కావడం మొదలుపెట్టాయి.

అయితే అంత ఆషామాషీగా ఇవేమీ సక్సెస్‌కాలేదు. దీనివెనుక ఎంతో అధ్యయనం, పరిశీలన ఉన్నాయి. పాఠకుల నాడి తెలుసుకుని అందులోనూ మహిళా పాఠకుల అభిరుచిమేరకే ఈ నవలలు మార్కెట్‌లో విడుదలవుతుంటాయి. మన టీవీ సీరియల్స్‌లానే ఈ నవలలకు కూడా మహిళలే మహారాజు పోషకులు. ఎందుకంటే ప్రతి పదిమంది స్త్రీలలో నలుగురు స్త్రీలు మిల్స్ అండ్ బూన్ నవలలు చదవడం ద్వారా మానసిక సంతృప్తిని పొందుతున్నారని మార్కెట్ సర్వే తెలియచేస్తోంది.

రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత ఛార్లెస్




బూన్ కొడుకు అలెన్‌బూన్ మిల్స్ అండ్ బూన్ పబ్లికేషన్స్ ఎడిటోరియల్ బాధ్యతలు చేపట్టాడు. మా పాఠకులకు రొమాన్స్ కావాలి తప్ప సీరియస్ విషయాలు చదవడానికి ఇష్టపడరు. అందుకే మా నాన్న మేధోపరమైన పుస్తకాలు కన్నా వినోదాన్ని అందించే పుస్తకాలు ప్రచురించాలని అనుకున్నారు అంటాడతను.

అతని మాటల్లో ఎంతో నిజం ఉంది. ఈ నవలల్లో కథనాయకులు చాలా రొమాంటిగ్గా ఉంటారు. ఇక హీరోహీరోయిన్ల మధ్య పరిచయం, తత్ఫలితంగా దారితీసే పరిస్థితులన్నీ పాఠకులను గిలిగింతలు పెట్టిస్తాయి. అలా రొమాంటిక్ ఫిక్షన్ రాయగలిగిన రచయితలకు ఈ సంస్థ పెద్దపీటే వేస్తుంది.

ఈ నవలలు రాసే రచయితలకు సంస్థ కొన్ని గైడ్‌లైన్స్ రూపొందించింది. ఆ ప్రకారమే వాళ్ళు నవలలు రాయాలి. హీరోహీరోయిన్ల ఎత్తు, కళ్ళు, జుట్టురంగు, వారి ఆర్థిక పరిస్థితి ఇలా ఎన్నో అంశాలకు సంబంధించి మార్గదర్శకతసూత్రాలు రూపొందిస్తుందీ సంస్థ. ఉదాహరణకు డాక్టర్-నర్సుల మధ్య శృంగారం గురించి రాస్తూ మధ్యలో వ్యాధులు, ఆస్పత్రి, రోగుల గురించిన మాటలు దొర్లితే ఆ నవలను ప్రచురణకు అర్హమైనదిగా భావించరు. రచయిత మళ్ళీ ఆయా చాప్టర్లు తిరగరాయాల్సి వుంటుంది. ఇలా తిరస్కరించిన సందర్భాలు కూడా ఉన్నాయి. మా నవలలు చదివే అమ్మాయిలు కుర్రాళ్ళ గురించి రాస్తే చదువుతారుగానీ వాళ్ళకి వ్యాధులతో పనిలేదన్నది పబ్లిషర్ల అభిప్రాయం.




ప్రపంచవ్యాప్తంగా పాపులర్ అయిన ఈ నవలలను ఐర్లాండ్‌లో కొన్నేళ్ళు నిషేధించడంతో పబ్లిషర్లు వారి నవలల్లో శృంగారం మోతాదు తగ్గించాల్సి వచ్చింది.

ఆ నవలల్లో ఏముందని ఎంత తేలిగ్గా తీసిపారేసినా మిల్స్ అండ్ బూన్ నవలలు లక్షలాది కాపీలు అమ్ముడవుతూనే వున్నాయి. టీనేజర్లు, వాటిని చదివి తమకంటూ ఓ కలల సామ్రాజ్యాన్ని సృష్టించుకుంటూనే ఉన్నారు.



# చతుర

సంపుటి: 24 సంచిక: 6 జూలై 2001

282 వ సంచిక

"డాడీ! మీరు మారలేరు. నేనూ మారలేను. మీరు పెట్టే అవినీతి కూడు తినలేను. నేను తిన్నదంతా అన్యాయార్జితమైనదని తెలిసినప్పటినుంచీ నామీద నాకే అసహ్యమేస్తోంది. అన్నప్రాశననుండీ తిన్నదంతా కక్కెయ్యా లనిపిస్తోంది. ఇంక నేనీ ఇంట్లో వుండలేను. మీ నీడ కూడా భరించలేను..." అంటూ కట్టుబట్టలతో విసవిసా బయటకొచ్చేసిన ఆ యువకుడు ఆ తర్వాత ఏం చేశాడు? చిన్నతనం నుంచీ అన్యాయాన్ని సహించలేని వాడుగా ఎదిగిన ఆ యువకుడు తన జీవితంలో సాధించిన ఘనకార్యాలేమిటి? అవినీతి ఊబిలో కూరుకుపోయిన తన తండ్రికి అతడు విధించిన విచిత్రమైన శిక్ష ఎలాంటిది? అవినీతిలో మునిగిపోయున్న నేటి సమాజానికి సాక్షర రూపం

సింహప్రసాద్ నవల

# తమసోమా...!

ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

సబ్ రిజిస్ట్రార్ ఆఫీసుకు వెళ్ళేసరికి గదులు ఊడుస్తున్నారు.

అప్రయత్నంగా వాచీవంక చూశాను. పది న్నర.

అసహనంగా వెళ్ళి ఆ పక్కనే వున్న చింత చెట్టు మొదట్లో కూలబడ్డాను.

ప్రభుత్వాఫీసుల్ని రోజూ చిమ్మితే చాలదు. వాటిల్లో పనిచేసే ఉద్యోగుల్ని ఉతికి ఆరవెయ్యాలి. అప్పుడే అన్నీ సక్ర మంగా నడుస్తాయి. లేకపోతే మరీ ఇంత అలసత్వమా. టైముకి ఆఫీస్ తెరవడం కూడా తెలీదా!

మెదడులో ఏదో మథన.

ఉద్యోగులు ఒక్కొక్కరూ వస్తున్నారు.

పేపర్ విశేషాలూ, డి.ఎ. ముచ్చట్లూ, సినిమా ఊసులూ, కిళ్ళీ ఉమ్ములూ, సిగ రెట్ పొగలూ...

ఒకరి దగ్గరికెళ్ళి విష్ చేశాను. అతడి పేరు శేషావతారం అని వారి మాటల్లో తెలి సింది. దగ్గరదగ్గర యాభై ఏళ్ళుంటాయి.

ఏవిటన్నట్టు చూశాడు.

"ఈ.సీ. కోసం వచ్చానండి..."

"ఆహా... వస్తే? స్వాగతం దొరా, సుస్వా గతం అంటూ పాడాలా? " అన్నాడతను.

"పాడితే చాలా! పూర్ణకుంభమూ, వేద మంత్రాలూ కూడా కావాలా? " అన్నాడతడి పక్కతను.

వారి ధోరణికి విస్తుబోయాను. ఈసీ కావాలన్నానంతే. ఆ మాత్రానికే వాళ్ళలా వ్యంగ్యాస్త్రాన్ని విసరడం... జీర్ణించుకోవడా నికి రెండు నిమిషాలు పట్టింది.

"సిటీనుంచి వచ్చాను. మళ్ళీ ఈవెనింగ్ ట్రైన్‌కి వెళ్ళాలండి"

"వెళ్ళవోయ్. మేమేం నిన్ను పట్టుకుని ఆపటంలేదుకదా. మేమింకా సీటెక్కలేదు బాబూ! ఓపికుంటే అంతదాకా ఆగు. లేక పోతే ఏ నాన్‌స్టాప్ బస్సో పట్టుకుని చెక్కెయ్" అగ్గిపుల్లతో పళ్ళు కెలుక్కుంటూ





అన్నాడు.

చిర్రెత్తుకొచ్చింది. అవసరం నాది గనుక నిగ్రహించుకున్నాను.

ఎదురుగా వున్న పాకహోటల్లో కెళ్తోంటే నా వెనకాల నవ్వులు...

ఛా! ఏవిటీ మనుషులు. ఉద్యోగస్తులయ్యే సరికి తామేదో జనానికన్నా అతీతులమను కుంటారో ఏమో! లేక జనం పిపీలికాల్లా కన్పిస్తారో!

టీ చప్పరిస్తున్నానన్నమాటేగానీ మెదడు ఉడికిపోతోంది. ఏదో చేసెయ్యాలి వీట న్నిటినీ అమాంతం మార్చేసెయ్యాలి అన్నం తగా ఆవేశపడ్డాను.

జనం రాసాగారు. కొందరు చెట్లకింద చాపలూ, జంబుఖానాలూ పరుచుకుని కూర్చున్నారు. వారిముందు చిన్నపెట్టెలూ ఏవో పేపర్ల కట్టలూనూ.

మళ్ళీ ఆఫీసులో కెళ్ళాను.

ఒకపక్క కంప్యూటర్లున్నాయి. వాటిని చూడగానే నా పని తేలికైపోయినట్లన్పించి నిట్టూర్చాను.

ఫరవాలేదు. ప్రభుత్వం సిటీలో కూర్చుని హైటెక్ కబుర్లు చెప్పడమేకాదు ఇలాంటి చిన్న టౌన్లలోని ఆఫీసుల్ని కూడా కంప్యూట రైజ్డ్ చేసిందన్నమాట. జనానికి ఆధునిక సాంకేతిక విజ్ఞాన ఫలాన్ని అందిస్తున్నందు కెంతో ఆనందం కలిగింది. థాంక్స్ టు చంద్రబాబునాయుడు.

ఇంతక్రితం నేను విష్ చేసిన శేషావ తారం సబ్ రిజిస్ట్రార్ ముందు అతి విన యంగా నిలబడి ఏదో చెబుతున్నాడు.

మరొకతని దగ్గరికెళ్ళి విష్ చేశాను.

"ఈసీ కావాలండీ"

"బయట లేఖకులుంటారు. వాళ్ళతో చెప్పు"

అయోమయంగా చూస్తూనే తలాడించి బయటికొచ్చాను.

పెదవి కొరుక్కుంటూ అటూఇటూ చూసి ఒక చెట్టుకింద పెట్టె, పేపర్ల దొంతర్లతో కూర్చున్నతని దగ్గరికెళ్ళాను.

సన్నగా పొడుగ్గా రివటలా వున్నాడతడు. కళ్ళద్దాలపై నుంచి నావంక చూస్తూ "పనేంటి? అగ్రిమెంటా రిజిస్ట్రేషనా? " అన డిగాడు.

"మాకు ఈ పక్కనే వున్న పల్లెలో కొంచెం పొలం వుందండీ. దానికి ఈసీ కావాలి. ఆఫీసులో అడిగితే లేఖకుల్ని కలుసుకోమని చెప్పారు"

"నువ్వేం చదువుతున్నావు? "

"ఎం.సి.ఎ."

"అదీ అలా చెప్పు. పుస్తకాలు చదివితే జ్ఞానం మాత్రమే వస్తుంది. ఈ ప్రపంచంలో బతకాలంటే జ్ఞానం ఒక్కటే సరిపోదు. మనుషుల్ని చదవాలి. వాళ్ళ మనస్తత్వాల్ని తెలుసుకోవాలి. అలాగే ఆఫీసుల్లో పనవ్వాలంటే అక్కడి పద్ధతులూ, ఫార్మాలటీస్ తెలుసుకోవాలి. కుర్రాడివి. పైకి రావాల్సినవాడివి గనుక చెబుతున్నాను. ఇకపోతే నాపేరు ఏకాంబరేశ్వరరావు. లేఖక్ని. అంటే దస్తావేజులూ గట్రా రాసే రాయసగాడ్నన్నమాట. సర్సరే... గాని పొలం వివరాలు తెచ్చేవా? "

జేబులోంచి పేపర్ తీస్తూ, "మీరూ ఈ ఆఫీసులోనే పనిచేస్తారాండీ" అన్నాను.

"నువ్వెక్కడి పిల్లకాకివోయ్. నేనా ఆఫీసులో పని చేసేవాడ్నయితే ఇలా చెట్టుకింద చెమటల్లు కక్కుతూ ఎందుక్కూర్చుంటానూ. హాయిగా ఫాన్‌కింద బల్లమీద కాళ్ళెట్టుకుని మరీ కూర్చునేవాడ్ని. ఆఫీసులోపల కూర్చున్నవాళ్ళే ఉద్యోగులు. పూర్వజన్మలో దేవతలన్నమాట. మేం అప్పుడు వాళ్ళ సేవకులం. ఇప్పుడు బ్రోకర్లం. అదీ సంగతి... ఒక పెద్ద గాంధీగార్ని కొట్టు..."

"పెద్ద గాంధీగార్నా? "

"అదేనయ్యా వందనోటు ఇవ్వు..."

"వందెందుకండి? ఇరవయ్యో, ముప్ఫయ్యో తీసుకుంటారని డాడీ చెప్పారు"

"చూడు డాడీ కూచీ. డాడీ చెప్పినట్టూ మమ్మీ చెప్పినట్టూ లోకం వుండదు. లోకం ఎలా వుందో ఎలా వుండాలంటుందో అలా వుంటేనే మనం ముందుకెళ్ళగలం. లేకపోతే వెనక్కినక్కే! నువ్వెళ్ళి మళ్ళీ మీ నాన్నకి చెప్పకోవాలి గనుక వివరాలు చెబుతాను అవసరమైతే రాసుకో. ఇదుగో ఇది అప్లికేషన్. దీని ఖరీదు అయిదు రూపాయలు..."

"ఇది అయిదు రూపాయలా? ఆఫీసులో ఊరికే ఇవ్వరా? "

"ఇవ్వరు. ఇప్పటికే ప్రభుత్వం దివాలా తీసేసిందని ప్రతిపక్షం పేపర్లనిండా గోల చేస్తోందికదా. చదవలేదా? అదిగో ఆ బెంచ్ చూశావా? నీలాంటి వాళ్ళొచ్చి కూర్చోడానికి వేసిందది. ఇంకొన్నాళ్ళు పోతే దానిమీద కూర్చోడానిక్కూడా ఫీజు కట్టాలి. ఎంచేతో తెలుసా? "

తల అడ్డంగా ఊపాను.

"దాన్ని కూడా ప్రపంచ బ్యాంకుకి తాకట్టు పెట్టేశారోయ్"

భళ్ళున నవ్వి అన్నాడు.

"అప్లికేషన్‌కి అయిదు రూపాయలని చెప్పానుకదా. ఈసీ కోసం అఫీషియల్ ఫీజు నలభై రెండు రూపాయలు. అనఫీషియల్ ఫీజు నలభై రెండు రూపాయలు. ఆపైది నా కష్టానికి నువ్వివ్వాల్సిన కూలి. లెక్క సరిపోయిందా? "

"అనఫీషియల్ ఫీజేవిటండీ? "

సృష్టిలోని ఆశ్చర్యమంతా ఆయన కళ్ళల్లోనే తిష్టవేసింది.

"నాకు తెలీకడుగుతానూ నువ్వేదైనా గ్రహంనుండి ఊడిపడ్డావేంటోయ్"

"ఊహూ..."

"మరేవిటి కుర్రాడా. కొన్నికొన్ని పనులు జరగాలంటే కొంతకొంత ముట్టచెప్పక తప్పదు. దానికి బహుమానం, ప్రసాదం, నజరానా, తాంబూలం, ఆమ్యామ్యా ఫార్మాలిటీ, అనఫీషియల్ ఫీజు వగైరా ఏ పేరైనా పెట్టుకో. లేదా పచ్చిగా లంచం అనుకో. ఆ పదార్థం పడందే ఏ ఈసీ జరగదు, ఏ ఫైలూ కదల్దన్నది యదార్థం. వూ...

త్వరగా కొట్టుమరి..."

"లంచం ఇవ్వను"

నోరు తెరిచాడాయన. తలూపుతూ చిన్నగా నవ్వి అన్నాడు. "సరే. అలాగే కానియ్. యువరక్తంకదా. అలాగే అన్పిస్తుంది మరి. ఒక పని చెయ్యి. నేను అప్లికేషన్ పూర్తిచేసిస్తాను. నువ్వెళ్ళి అదిగో ఆ కిటికీ దగ్గర కట్టేసెయ్. తైలం లేకుండా నేను లోపలికి వెళ్ళేననుకో. నన్ను మూడు కాళ్ళ జంతువులా చూస్తారంతా"

"నే వెళ్ళి కడతాన్లెండి. అవసరమైతే సబ్ రిజిస్ట్రార్ని కలుస్తాను"

"మరింకేం సబ్ రిజిస్ట్రార్ వున్నారు. ఆ పైన డిప్యూటీ రిజిస్ట్రార్ వున్నారు. ఆ పైపైన డిస్ట్రిక్ట్ రిజిస్ట్రార్ వున్నారు. ఆయన పైన ఇంకెందరో వున్నారు. వారిలో ఎవర్ని కలిసినా సరే నీ ఇష్టం. ఇదిగో అప్లికేషన్. నాకు పదిహేనివ్వు చాలు. కూల్డబ్బు లంతే... నాలుగుముక్కలు గీకి బతికేవాడ్ని. కదా..."

మరి రెట్టించకుండా వెళ్ళి అప్లికేషన్ కౌంటర్లో ఇచ్చి ఫీజు కట్టాను.

అతడు నా వంక ఎగాదిగా చూసి "రేపురా" అన్నాడు.

"కంప్యూటరైజ్డ్ కదండీ. ఇవ్వాళవ్వదా?"

"అర్జంటైతే అతగాడ్ని కలువు..."

రాగానే విష్ చేసిన శేషావతారాన్ని చూపించాడు.

అతడంటే ఒక రకమైన ఏహ్యాభావం ఏర్పడి వుండడంతో అయిష్టంగానే వెళ్ళాను.

అతడి టేబుల్ ఎదురుగా నిలబడినా అయిదు నిమిషాల వరకూ నా వంక చూళ్ళేదు.

అతడు తలెత్తగానే విష్ చేశాను.

"ఏవిటీ?"

"ఈసీకి అప్లై చేశాను. ఈవెనింగ్ ట్రైన్‌కె ళ్ళిపోవాలి. ఈసీ త్వరగా ఇమ్మని రిక్వెస్ట్ చేద్దామనొచ్చాను"





"గంట పడుతుంది"

"అలాగేనండీ"

"యాభై అవుతుంది"

"ఫీజు కట్టానండి"

"కట్టావులే. అదిగాక మరో యాభై అని చెప్పాను"

"ప్రభుత్వ రసీదిస్తానంటే ఇస్తాను"

అతడు అమాంతం ఉగ్రుడైపోయాడు.

"వీరయ్యా. ఏం చేస్తున్నావక్కడ. ఇతగాడ్ని లోపలికెందుకు రానిచ్చావు. పంపించెయ్. వెళ్ళవయ్యా వెళ్ళు. మమ్మల్ని పనిచేసుకోనియ్యి. అడ్డమైనవాడూ రావడం తామేదో ధర్మరాజైనట్టు మాట్లాడ్డం ఓ ఫ్యాషనైపోయింది"

"అదికాదండీ..."

"బయటికెళ్ళు ముందు. ఇలా ఆఫీసులోకొచ్చి మాట్లాడకూడదు. వెళ్ళు.. వెళ్ళు... వీరయ్యా..."

వీరయ్య అనే ప్యూను పరుగునొచ్చి నన్నో రకంగా బయటికి గెంటేశాడు.

చాలా అవమానంగా అన్పించింది. కాస్సేపాగి ప్యూను మాటల్ని లెక్కచెయ్యకుండా తిన్నగా సబ్‌రిజిస్ట్రార్ దగ్గరకి దూసుకెళ్ళాను.

గబగబా సంగతంతా చెప్పేశాను. డబ్బు అడిగిన సంగతి కూడా చెప్పాను.

"మూడింటికి రా ఇస్తాను"

థాంక్స్ చెప్పి వచ్చేశాను.

"ఎప్పుడిస్తానన్నారోయ్" ఏకాంబరేశ్వర్రావు అడిగాడు.

"సబ్ రిజిస్ట్రార్ని కలిశాను. మూడింటికి స్తానన్నారు"

"వెరీ గుడ్. మూడింటికొచ్చి తపస్సు చెయ్యి" అంటూ అదోలా నవ్వాడు.

ఉడుకుమోత్తనం లెమ్మనుకున్నాను. భోంచేసి ఊళ్ళోని ఓ దేవాలయాన్ని దర్శించి సరిగ్గా మూడింటికి ఆఫీసుకెళ్ళాను.

రష్ పెరిగింది. ఎటుచూసినా జనమే. లావాదేవీలే. లేఖకులు మరీ బిజీగా వున్నారు. లోపలికెళ్ళి ఎవర్తోనో మాట్లాడి

బయటకొచ్చి పార్టీల్తో చెబుతూ హడావిడి పడుతున్నారు.

ప్యూన్‌తో చెప్పాను. తయారయ్యిందేమో కనుక్కుంటానన్నాడు.

కాస్సేపయ్యాక మళ్ళీ అడిగాను. "మొగుడు విసుక్కుంటున్నాడయ్యా ఏవన్నా వేంటీ? " అడిగాడు.

"నేనేమీ అన్లేదే"

"ఏమో మరి కాకమీదున్నాడు గురుడు"

"నాలుగున్నర ట్రైన్‌కెళ్ళాలి. కొంచెం త్వరగా ఇప్పించి పుణ్యం కట్టుకో"

"లాభంలేదు. వాళ్ళెవళ్ళకైనా చెప్పకపోయావా గంటలో తెచ్చిద్దురు" లేఖకుల్ని చూపిస్తూ అనేసి లోపలికెళ్ళిపోయాడు.

టైం చూశాను. నాలుగ్గంటలయింది. ట్రైన్‌కింక అరగంటే వ్యవధి వుంది. దానితర్వాత మరి ట్రైన్లు లేవు. బస్సు చుట్టుతిరిగి ఏ అర్ధరాత్రివేళకో సిటీ చేరుస్తుంది.

మరేమీ ఆలోచించకుండా సబ్‌రిజిస్ట్రార్ దగ్గరికెళ్ళాను.

నన్ను చూస్తూనే "ఇతగాడి పనేమయ్యిందీ? " అనడిగారాయన.

"ఖాళీ అప్లికేషన్ నా ముఖాన పడేశాడు సార్"

శేషావతారం మాటలకి "పూర్తిచేసే ఇచ్చాన్సార్" అన్నాను కంగారుగా.

"అదికాదులే ఇలాటి పనులకి పెద్దవాళ్ళు రావాలిగానీ కుర్రాడివి నువ్వొస్తే నీకేం తెలుస్తాయి చెప్పు"

"దీనికోసమే సిటీనుంచొచ్చాన్సార్. ఫోర్ థర్టీ ట్రైన్‌కెళ్ళిపోవాలి. ప్లీజ్ సర్..."

"తొందర పడితే పనవ్వదు. ఇంకో అవర్ వెయిట్ చెయ్యి... అయితే ఇస్తాడు"

ఇక వెళ్ళొచ్చున్నట్టు చూసి తన పనిలో పడిపోయాడాయన.

నీరసంగా బయటికొస్తూ శేషావతారం వంక చూశాను. ఎంతో బిజీగా వున్నట్టు నటిస్తున్నాడు. ఇప్పుడేంటి చెయ్యడం?

ఇంకో ఇరవై నిమిషాల్లో ట్రైన్ వెళ్ళిపోతుంది. ఇప్పుడెళ్తే సరిగ్గా టైంకి అందుకోవచ్చు లేదా ఈ రాత్రికిక్కడే ఉండి రేపు ఈసీ తీసుకెళ్ళొచ్చు కానీ హోటల్‌కీ, భోజనానికీ చాలా ఖర్చవుతుంది. ఇంకోరోజు కాలేజీ పోతుంది.

పోనీ ఇప్పుడెళ్ళి రేపు మళ్ళీ వస్తే?

ఇంకో గంటసేపుండగలిగితే పనవ్వొచ్చుగానీ లాడ్జింగ్‌కీ, బోర్డింగ్‌కీ ఖర్చు పైగా అతగాడి వాలకం చూస్తే ఇవాళ పని చేసిపెట్టేట్లుగా లేదు. సో... ఇటీజ్ బెటర్ టు స్టార్ట్.

స్టేషన్‌కెళ్ళడానికి పావుగంట పడుతుంది.

ఇంక అక్షరాలా ట్రైన్ కదల్డానికి పదిహేను నిమిషాలే వుంది.

టెన్షన్తో ఊగిపోతూ ఆటో ఎక్కి "స్టేషన్‌కి పోనియ్" అన్నాను.



ఆటోలోంచి జంప్‌చేసి స్టేషన్లోకి దూసుకుపోయాను.

టిక్కెట్ కౌంటర్ దగ్గర జనం గుంపుగా మూగి తోసుకుంటున్నారు.

"క్యూలో నిల్చుందాం"

నా మాటలెవరూ విన్పించుకోలేదు. ట్రెయిన్‌కి టైమైపోతుండడంతో నేనూ వారి వెనకే నిలబడక తప్పలేదు.



టిక్కెట్ తీసుకుని ప్లాట్‌ఫాం మీదకి పరుగెత్తాను.

ఏ ట్రెయినూ లేదు.

"హైద్రాబాద్ ట్రైన్ వెళ్ళిపోలేదుకదా?" ఒకర్నడిగాను.

"ఇంకా రాలేదు"

నిట్టూర్చి ఒగురుస్తూ సిమెంటు బెంచీ మీద కూర్చున్నాను.

మరి పది నిమిషాలు గడిచాయి. ట్రైన్ రాలేదు అరగంట గడిచింది. ట్రైన్ రాలేదు.

అరె... ట్రైన్ కేమయ్యింది. ఇంతాలస్యమవుతుందని ముందే తెలిసి వుంటే సబ్‌రిజిస్ట్రార్ ఆఫీస్‌లో మరో ప్రయత్నం చేసేవాడ్ని. పని అయినా అయ్యేది. ఎంతో డబ్బూ, సమయమూ కలిసొచ్చేవి.

పెదవి కొరుక్కుంటూ చుట్టూ చూశాను.

ఎవరి కబుర్లలో వాళ్ళున్నారు.

"ట్రైన్ లేటాండీ?" ఒకతన్నడిగాను.

"రెండు గంటలు లేటు. అయినా టైము కొస్తే ఆశ్చర్యపడాలిగానీ లేటయితే కాదు. లేటుగా రావడం రైళ్ళ జన్మహక్కు" అన్నాడొకతను సీరియస్‌గా.

మిగతావాళ్ళు నవ్వారు.

"ఎందుకు లేటయ్యిందంటారు?"

"సీత కష్టాలు సీతవీ, పీత కష్టాలు పీతవీనూ. అలాగే రైల్వేవారి కష్టాలు రైల్వేవారివి" అన్నారింకొకరు. బహుశా మేస్టారయ్యుంటారు.

"అలా మాట్లాడతారేవిటి మాష్టారూ. మన ప్రయాణ సౌకర్యార్థం ప్రభుత్వంవారు ఏర్పాటుచేసిన రైళ్ళు ఇంతాలస్యంగా రావడం ఏమీ బాగోలేదు"

"నీకూ నాకు బాగోదయ్యా. కానీ రైల్వేవారికేం ఇబ్బందులూ, ఇబ్బందికర పరిస్థితులూ వున్నాయో ఎవరికి తెలుసు. ఎవరి కష్టాలు వారివని ముందే చెప్పానుకదా. వాజ్‌పేయికి మిత్రపక్షాల కష్టం, మమతా బెనర్జీకి బెంగాల్ అసెంబ్లీ ఎన్నికల కష్టం, చంద్రబాబుకి కరెంటు కష్టం, సోనియాకి బోఫోర్స్ కష్టం..."

"పోలిటిక్స్ అలా వుంచండి. రైల్వేలో ఎందరు ఉద్యోగులూ, అధికార్లూ ఎన్ని వనరులూ వున్నాయో అందరికీ తెలిసిందేకదా. అయినా టైంకి రైళ్లని నడపడంలేదంటే ఏమనుకోవాలి? ఇప్పుడు మన ట్రైన్ చూడండి. రెండు గంటలులేటు. ఆ ట్రైన్ కోసం కనీసం యాభైమందిమి వెయిట్ చేస్తున్నాం. అంటే వందగంటలు వేస్టయ్యాయన్నమాట. అలాగే ట్రైన్లో ఎందరుంటే అన్ని రెండుగంటల చొప్పున వారి కాలం వృధా అయిందన్నమాట. ఆ లెక్కన లెక్క వేస్తే దేశంలో రోజుకి ఎన్ని లక్షల మేన్ అవర్స్ వేస్టవుతున్నాయో చూడండి" అన్నాను కించిత్తు ఆవేశంగానే.

ఇంకో అతను ముందుకొచ్చి నా భుజం చరిచాడు. "కుర్రాడివైనా బాగా చెప్పావు. అవున్నిజమే. ఈ వెయిటింగ్‌వల్ల విలువైన కాలం చాలా నష్టపోతున్నాం. నీకుతెలుసో లేదోగానీ ఎమర్జన్సీ టైంలో రైళ్ళు, ఫైళ్ళూ కూడా సక్రమంగా నడిచాయంటే నమ్ము"

"కరక్టుగా చెప్పారు. పైన మొట్టేవాడుంటేగానీ మనవాళ్ళు పనిచెయ్యరండీ. నన్నడిగితే మన దేశానికి మిలటరీ రూల్ బెస్ట్" అన్నారు మాష్టారు.

"స్వేచ్ఛ విలువ తెలిసిన మీరు కూడా అలా మాట్లాడతారేవిటి మాష్టారూ" నొచ్చుకుంటూ అన్నాను.

"కాకి పిల్లవి. ఉండేలు దెబ్బ నీకు తెలీదు. నా వయస్సు యాభై ఎనిమిది. తెల్సిందా? ఊహ తెలిసినప్పట్నుంచీ చూస్తున్నాగా. మా చిన్నప్పటి విలువలూ, ప్రమాణాలూ ఇప్పుడులేవు. అంతకంతకీ అన్నిటా పతనమే. నీతిలో, విలువల్లో, అనుబంధాల్లో, క్రమశిక్షణలో అన్నిటా దిగజారుడు తనమే కన్పిస్తోందంటే నమ్ము"

"అందుకే దీన్ని కలికాలమన్నారు. భగవంతుడు కల్కి అవతారం ఎత్తి వస్తేగానీ





ప్రపంచం బాగుపడదు" తేల్చి చెబుతున్నట్టుగా అన్నాడు ఇంకో ఆయన.

"బోర్డుమీదేదో రాస్తున్నాడు. లేటు పెరిగిందో, తరిగిందో!"

మాష్టారి మాటలకి నోటీసు బోర్డు వంక చూశామంతా.

నాలుగ్గంటలు లేటు అని మార్చాడు.

"చచ్చాం... రాత్రి భోజనం మూట గట్టుకురావాల్సిందేమో" అని ఒకరంటే, "హైదరాబాదెళ్ళేసరికి రాత్రి పదకొండవడం ఖాయం. అక్కడ్నుంచి పడుతూ లేస్తూ వనస్థలిపురం ఎలా వెళ్ళేదిరా దేవుడా. ఆటోవాళ్ళు నిలువు దోపిడీ చేసేస్తారు" అన్నారింకొకరు.

"కంప్లైంట్ చేద్దామా?"

నామాటలకంతా వింతగా చూశారు.

"రోజూ చచ్చేవాడికి ఏడ్చేవాడెవడూ?" అన్నారొకరు నవ్వుతూ.

"ఏ పుట్టలో ఏముందో ఎవరికి తెలుసు. అంతా కలిసి కంప్లయింటిస్తే యాక్షన్ తీసుకుంటారేమో" అంది ఒకతని భార్య. "పెళ్ళి ముహూర్తానికెలాగూ అందుకోలేం. కనీసం అప్పగింతల టైముకన్నా వెళ్తామన్న ఆశ కన్పించట్లేదు" అందామె వెంటనే.

"అడిగి చూస్తానుండండి"

ఎంక్వైరీ కౌంటర్లో కెళ్ళి "ట్రైన్ ఇంత లేటవ్వడానికి కారణం ఏమిటండీ?" అనడిగాను.

"పతా నహీ"

"స్టార్టింగ్‌లోనే లేటయ్యిందంటారా?"

"అవేమీ తెలీదు. ఇఫ్ యూ వాంట్ డీటెయిల్స్ గో అండ్ సీ ఎస్సెమ్"

మరోమాట కవకాశం ఇవ్వకుండా ఫోన్ అందుకున్నాడు.

స్టేషన్ మాష్టారు రూంవైపెళ్తోంటే "బాగా లేటయ్యింది సార్. ఎందుకింత లేటయ్యింది సార్?"

"మధ్యలో లోడింగుందో లేక వి.ఐ.పి.లొచ్చారో మరి. సెవన్ థర్టీ అయిపోయింది కదా. ఇంకో గంటలో వచ్చేస్తుందిలే"

"కంప్లయింట్ రిజిస్టర్ వుందా సార్. రాస్తాను..."

నవ్వేడతడు. "కంప్లయింటు బుక్కు కండక్టరు వద్ద కలదు అని ఆర్టీసీ బస్సుల్లో రాస్తారు. వాళ్ళ దగ్గరుంటే తీసుకుని రాయి"

"ట్రైన్ లేట్ గురించి రాద్దామని సార్..."

"నా పదిహేనేళ్ళ సర్వీసులో కంప్లయింట్ ఇద్దామని వచ్చిన ఏకైక వ్యక్తివి నువ్వే"

"ఐ వాంట్ టు గివ్ కంప్లయింట్"

అతడు సీరియస్‌గా చూసి "అవన్నీ ఎస్సెమ్ డ్యూటీలోకొస్తాయి. ధైర్యం వుంటే వెళ్ళి ఆయన్ని కలవండి" అన్నాడు.

తిన్నగా ఎస్సెమ్ దగ్గరకెళ్ళి విష్ చేసి ట్రెయిన్ లేటవడం దగ్గర్నుంచి ఆగిపోయిన పనులవరకూ సమస్తమూ ఏకరువు పెట్టాను.

అసలాయనే భూమిని తన భుజాలమీద మోస్తున్నట్టుగా ఉన్నాడు. అయినా ఎంతో ఓపికగా విన్నాడాయన.

ఒక తెల్ల కాగితం ముందు పెట్టాడు.

పరపరా రాసేసి ఇచ్చాను.

"పైకి పంపిస్తాన్లే"

తృప్తి నిండిన మనసుతో వచ్చి నేను చేసిన ఘనకార్యం గురించి అందరికీ చెప్పాను.

"మంచిపని చేశావబ్బాయ్. ఈ పెద్దవాళ్ళకన్నా నువ్వే నయం." అంది పెళ్ళికెడుతున్నావిడ.

"ఆ స్టేషన్ మాస్టారు నువ్విలా తిరగ్గానే దాన్ని బుట్ట దాఖలు చేసి ఉంటాడు. కావలిస్తే పందెం వేస్తాను" అన్నారొకరు.

"పోనీలెద్దూ. కుర్రాడ్ని కాసేపు గొప్పగా ఫీలవనీ" అన్నారు మరొకరు.

"నువ్వేం ఇదవకు. నువ్వు చేసింది మంచి పనే" అన్నారు మాస్టారు. "'నీ ప్రయత్నం నువ్వు చెయ్యి. ఫలితం సంగతి నా కొదిలెయ్యి.' అన్నాడు కృష్ణపరమాత్మ గీతలో" అని కూడా అన్నారు.

ఇంతలో ట్రెయినొస్తున్నట్లు ప్రకటన

చేశారు. లగేజీలు తీసుకుని ప్లాట్‌ఫాం పొడుగుతా పరిచినట్టుగా నిలబడ్డారంతా. నేను కూడా కొంచెం ముందుకెళ్లి నిలబడ్డాను.

ఎట్టకేలకు మమ్మల్ని మా గమ్యం చేర్చేందుకు సర్కారువారి పొగబండి వచ్చి ఆగింది.

దిగేవాళ్లని దిగనివ్వకుండా త్రోసుకుంటూ ఎక్కసాగారంతా. క్యూ పద్ధతి పాటిస్తే బాగుండేదనిపించింది. కానీ ప్రతివారి ఆత్రమూ సీటుగురించే. చాలినన్ని జనరలు బోగీలు లేవాయె.

అదృష్ట వశాత్తూ నాక్కూడా సీటు లభించింది. ఒక బల్ల మీద ఆరుగురం ఇరుక్కుని కూర్చున్నాం.

లింకు ట్రెయిన్ తప్పి పోతుందని ఒకరు బాధపడుతుంటే రైల్వేశాఖని తిడుతూ కూర్చున్నారింకొకరు.

"అబ్బే! లాభంలేదండీ. ప్రభుత్వం అన్న మాటలకి అర్థం అలసత్వం, అసమర్థత, నిర్లక్ష్యం అని మారిపోయింది. అన్నీ ప్రయివేటైజ్ చేసేస్తే తప్ప ఏమీ బాగుపడదు." అని వ్యాఖ్యానించారింకొకరు.

"ప్రయివేటైజ్ చేస్తే బాగానే ఉండొచ్చు గానీ ఫేర్ వాయగొడ్తారు. ట్రాన్స్‌కో కథ లానే అవుతుంది. అయినా అమెరికాలోలా అన్నీ ప్రయివేటైజ్ చెయ్యడానికే ప్రభుత్వాలు కంకణం కట్టుకున్నాయి లెండి. వరల్డ్‌బ్యాంక్, ఐఎమ్మెఫ్ చెప్పేదదేగా. ఆఖరికి దేశంలో ప్రభుత్వరంగమూ ఉండదు, దేశీయ వస్తువూ ఉండదు. అన్నీ అంతా విదేశీ ఉత్పత్తులే, మన నెత్తిన చెంగే" ఇంకొకరన్నారు.

ఆయన వంక ఆసక్తిగా చూశాను. ఆయన మాటలు వేడిగా, వాడిగా ఉండడం వల్ల కాబోలు ఎవరూ రియాక్టవలేదు. ఆయన వ్యక్త పరచిన అభిప్రాయం గురించే ఆలోచిస్తూ ఉండిపోయాను.

అంత రష్‌లోనూ తోసుకుంటూ వేరుశనక్కాయలూ, సమోసాలూ, కాఫీ, టీ లు అమ్మేస్తున్నారు.

మా ఎదుటి బెర్తుమీద ఒక భర్తా, లావుపాటి భార్యా, ముగ్గురు పిల్లలూ కూర్చున్నారు. రైలెక్కినప్పట్నుంచీ గమనిస్తున్నాను. అమ్మొచ్చిన తినుబండారాలన్నీ కొంటూనే వున్నారు. నములుతూనే ఉన్నారు.

మళ్ళీ పది రూపాయల వేరుశనక్కాయలు కొన్నారు.

సీటుకేసి రపీమని కొట్టి తింటూ శనక్కాయ తొక్కల్ని లోపలే నిర్లక్ష్యంగా పడెయ్యసాగారు.

"తొక్కల్ని బయట పడెయ్యండి. ఇదంతా అసహ్యంగా మారిపోతోంది" అన్నాను.

అతడు నావంక గుర్రుగా చూసి ఒక్క క్షణం ఆపి మళ్ళీ తన నములుడు కార్యక్రమం కొనసాగించాడు. అతగాడి భార్య మరోపక్కకి తిరిగి తినసాగింది. పిల్లల్లో ఒకరు మాత్రం చెత్త బయట వెయ్యసాగారు.

కాస్సేపు చూసి మళ్ళీ అన్నాను "ఈ రైళ్ళు మనవేనండీ. వాటిని శుభ్రంగా వుంచాలి గానీ ఇలా చెత్త చేస్తే ఎలా చెప్పండి"

"రైలు మనదేకదా. ఏం ఫర్లేదు"

అతడి సమాధానానికి విస్తుబోతూ అన్నాను, "పోనీ చెత్తనంతా ఒక కాగితంలో వేసి బయట పారెయ్యొచ్చు కదండీ"

"రైల్లో క్లీన్ అండ్ గ్రీన్ ప్రోగ్రాం కాంట్రాక్టు నీకిచ్చారా? "

"అది కాదండీ..."

నేనేదో చెప్పబోతే, "ఆ కుర్రాడితో మీకెందుకూ. వూరుకోండి" అందావిడ. అతడు మౌనియైపోయాడు.

వాళ్ళకి అటూ ఇటూ నాకు అటూఇటూ పైనా పదిమంది దాకా వున్నారు. వయసులో నాకన్నా పెద్దవాళ్ళే అంతా. వాళ్ళల్లో ఎవరైనా నన్ను బలపరుస్తూ వారికి నచ్చచెబుతారని ఆశగా చూశాను. అంతా ముఖాలు తిప్పుకుని అక్కడేమీ జరగడం





లేదనట్లుగానే వుండిపోయారు.

మొగుడూపెళ్ళాం, పిల్లలూ పోటీపడి మరీ శనక్కాయలు తిని తొక్కల్ని రాసులుగా పోశారు.

వాళ్ళా కార్యక్రమం ముగించి మంచినీళ్ళు తాగారు.

"కాయలు బాగున్నాయండీ..." అందావిడ.

"బాగా వేగాయిలే. అందుకే కమ్మగా ఉన్నాయి"

శనక్కాయలవాడు మళ్ళీ వస్తే బావుణ్ణు మళ్ళీ కొనుక్కొందుం అన్నట్లుగా వున్నాయి వారి చూపులు.

నా బేగ్‌లోంచి న్యూస్ పేపర్ని బయటికి తీశాను. ఒక పేపర్ని మడిచి దాని సాయంతో శనక్కాయల చెత్తనంతా మరో పేపర్లోకి ఎక్కించి బయటపడేశాను.

ఆ భార్యాభర్తల ముఖాల్లో కత్తివేటుకి నెత్తురు చుక్కలేదు.

చేతులు కడుక్కొచ్చి కూర్చుంటుంటే పై బెర్తుమీద కూర్చున్న ముసలాయన నావంక మెచ్చుకోలుగా చూశాడు.

"ఈ రోజుల్లో ఉపన్యాసాలివ్వని వాళ్ళంటూ ఒక్కరూలేరు. ఆచరణలో పెట్టే వారు మాత్రం కాగడా పెట్టి వెదికినా కన్పించరు. అలాంటిది మరొకరు వేసిన చెత్తని నువ్వు ఎత్తిపారెయ్యడం చిన్న విషయం కాదు. నీకు తెలుసో లేదో గానీ గాంధీగారు ఆశ్రమంలోని పాయిఖానా దొడ్లు సైతం కడిగేవారనుకో. ఇంతకీ నీ పేరేమిట బ్బాయ్"

"గాంధీ"

★ ★ ★

"గాంధీ... గాంధీ..." గదిలోంచి పిలిచారు డాడీ.

"వస్తున్నా డాడీ... ఏం డాడీ? "

విదేశీ సెంటుని స్ప్రే చేసుకుంటూ అన్నారు. "ఈసీ తెచ్చేవా? బ్యాంకులో ఇవ్వాలి. పొలం తణఖా పెట్టి లోన్ తీసుకోవడం కాదుగానీ ఈసీ ఈసీ అని పీకేస్తున్నారు"

"మనకి అప్పులెందుకంటే వినరు" అంది అమ్మ వాచీ, ఉంగరాలని డాడీకందిస్తూ.

"అప్పుల్లేవనుకో అదెలా కొన్నారు ఇదెలా వచ్చింది అంటూ ఇనకమ్ టాక్స్ వాళ్ళు జుట్టు పట్టుకుంటారే పిచ్చిదానా. ఏరా అలా నిలబడ్డావు ఈసీ తెచ్చేవా లేదా? "

"ఇవాళ ఇస్తానన్నారు"

"ఆ మాత్రం మేనేజ్ చెయ్యలేకపోయావా? నీ ఎం. సి. ఏ. చదువు ఇంకెందుకు పనికొస్తుందిరా? " నిరసనగా అన్నారు.

"పాపం వాడ్నేమీ అనకండి. రైలు ఆలస్యమయిందిట. రాత్రి పన్నెండున్నరకి వచ్చాడు. ఇదిగో ఇప్పుడు మళ్ళీ వెళ్ళడానికి రెడీ అవుతున్నాడు" అంటూ వెనకేసుకొచ్చిందమ్మ.

ఏమాట కామాటే చెప్పుకోవాలి. నామీద ఈగని కూడా వాలనివ్వదు అమ్మ. డాడీకేమో అన్నయ్యంటే ఎంతో ఇష్టం. తననే ఎప్పుడూ పొగుడుతూ వుంటారు.

"నువ్విలా వెనకేసుకు రాబట్టే వాడిలా ఎందుకూ పనికిరాకుండా పోతున్నాడు. రిజిస్ట్రార్ ఆఫీస్‌నుంచి ఈసీ కూడా తేలేకపోయాడు చూడు"

"అదికాదు డాడీ..."

"మరేంటి డాడీ? "

"వాళ్ళు యాభై రూపాయలిమ్మన్నారు"

"యాభై కాకపోతే వాళ్ళ ముఖాన వంద కొట్టకపోయావా. మనకి పనవ్వడం ముఖ్యంరా. మళ్ళీ ఆ ఊరికెళ్ళి తెచ్చుకోవాలంటే వందరూపాయలు ఖర్చవుతుంది. ఒక రోజు టైం వేస్ట్. ఇదేదో వాళ్ళకి నిన్ననే పడేసి ఈసీ తేవడం తెలివైనవాడు చేసేపని"

"లంచంగా ఇమ్మన్నారు. అందుకని..."

"ఓహో... తమరి సత్యవ్రతానికి ఆటంకం వచ్చిందన్నమాట. విన్నావుటే నీ సుపుత్రుడి మాటలు. ఎవడో పది రూపాయలు లంచం అడిగాడని ఖాళీ చేతుల్తో తిరిగొచ్చాడు

చూడు. ఇది నీ తప్పుకాదురా. ఇదిగో వీళ్ళ నాన్న చేశాడు. అక్టోబరు రెండున పుట్టావని గాంధీ అని పేరు పెట్టాలని పట్టుబట్టి మరీ తన పంతం నెగ్గించుకున్నాడా ముసలా యన. ఆ పేరు పెట్టడంవల్లే నువ్విలా తయారయ్యావు"

"మధ్యన మా నాన్నని అంటారేమిటీ? "

"పేరు పెట్టినాయన్ని గాకపోతే ఇంకెవర్ని నిందించమంటావే? "

నాలో రోషం పెల్లుబికింది.

"ఆ పేరు పెట్టినందునే నేను సత్యమా ర్గాన్ని నడుస్తూ ఆ పేరుని తలచి గర్విస్తు న్నాను. అంతేకాదు జన్మజన్మలకీ ఆ పేరు కావాలని కోరుకుంటున్నాను"

గిరుక్కున వెనుదిరిగాడు.

"అలాగే గర్వపడు. ఆఖరికి హరిశ్చంద్రు డిలా అష్టకష్టాలూ పడుదువుగాని"

"ఛా... అవేం మాటలండీ. కన్నతండ్రి అనాల్సిన మాటలేనా అవి? "

"నా సంగతి వదలవోయ్. నీ ముద్దుల చిన్నకొడుకు ఎందుకూ పనికిరాకుండా పోతున్నాడు. చెప్పిన చిన్నపని కూడా చేసు కురాలేకపోయాడు. ఆనంద్‌ని చూసైనా బుద్ధి తెచ్చుకోమను. బాగుపడతాడు"

విసవిసా బయటికెళ్ళిపోయాడు డాడీ.

గుమ్మంలోకెళ్ళి డాడీ కారు వెళ్ళేవరకూ వుండి వచ్చింది అమ్మ.

"డాడీ మాటలు పట్టించుకోకురా గాంధీ. ఆయన మాట పెళుసుగానీ మనసు మెత్తనే"

నేను మాట్లాడలేదు.

డాడీ గురించి నాకు బాగా తెలుసు. ఆయన డిప్యూటీ కమర్షియల్ టాక్స్ ఆఫీ సరు. ఇంట్లో కూడా అధికారిలానే ప్రవర్తి స్తారు. హోదా మెయిన్‌టైన్ చెయ్యాలనీ గొప్పగా బతకాలనీ బంధుమిత్రుల్లో ప్రశం సింపబడాలనీ చూస్తారు. మేం కూడా గొప్పగా ఫోజులు కొడుతుండాలని ఆశిస్తారా యన.

అమ్మకి ఆడంబరాలు కిట్టవు. నిండుకుం డలా వుంటుంది. అన్నయ్య ఆనంద్ మాత్రం అన్నింటా డాడీకి సరిపోతాడు. ఏడేళ్లనుండి సి.ఏతో కుస్తీపడుతున్నాడు. చదువుకన్నా తిరుగుళ్లూ స్నేహాలు ఎక్కువ.

నాది నేల మీద నడిచే తత్వం. అందు కనే డాడీకి నేనూ నా పద్ధతీ నచ్చవు.

ఇంకో సంగతేమిటంటే డాడీకి విదేశీ వస్తు వ్యామోహం అత్యధికం. బ్లేడు దగ్గర్నుంచి విసీఆర్ వరకూ సమస్తమూ విదేశీవే ఉప యోగిస్తారు. దేశీయ ఉత్పత్తులంటే ఆయ నకి ఎలర్జీ!

"అలా వున్నావేంరా! డాడీ మాటలకి బాధ పడుతున్నావుట్రా కన్నా" పమిట చెంగుతో నా మొహం తుడుస్తూ అంది అమ్మ.

"అబ్బే డాడీ పద్ధతి నాకు తెలుసుగదా మమ్మీ"

"అన్నీ తెలిసిన వాడివి పదోపరకో పడేసి ఆయన చెప్పిన పని పూర్తి చేసుకురాకపో యావుట్రా"

"చచ్చినా సరే నేను లంచం ఇవ్వను. లంచం పుచ్చుకునే వాళ్లన్నా ఇచ్చేవాళ్లన్నా నాకసహ్యం. ఐ హేట్ దెమ్. దేశాన్ని పట్టి పీడిస్తున్న మహమ్మారి లంచం. జాతి మూలుగుల్ని పీల్చి పిప్పి చేస్తున్న అవినీతిని నా శాయశక్తులా ఎదిరిస్తాను. నా గొంతులో ఊపిరున్నంతవరకూ ఖండిస్తూనే వుంటాను" నాకు తెలీకుండానే ఆవేశప డ్డాను.

అమ్మ నా వంక చిత్రంగా, భయంగా చూసింది. అంతులేని నీరసం ఆవ హించినట్టుగా సోఫాలో కూలబడిపో యింది.

"అలా అయిపోయావేంటి మమ్మీ"

"ఆహా ఏం లేదురా! ఏదో భయమేసింది"

"భయమా? ఎందుకు? "

"ఏం లేదులే గాని మళ్లీ నువ్వు ఊరికెళ్లా లట్రా గాంధీ"

"వెళ్లక తప్పదు! త్వరగా భోజనం వడ్డిస్తే లెవెనోక్లాక్ ట్రెయిన్‌కెళ్తాను"





"కాళ్లు కడుక్కురా వడ్డిస్తాను"

భోంచేస్తోంటే స్టైలుగా మోటారు బైక్ కీస్ తిప్పుతూ వచ్చాడు అన్నయ్య ఆనంద్.

"వాహ్! ఇంకా ఇంట్లోనే వున్నావేం బ్రదర్. నువ్వెళ్లకపోతే కాలేజీ ఏడ్చిపోదూ? "

నేను జవాబివ్వకపోయేసరికి "అలా డల్‌గా వున్నావేంరా. నిన్న వెళ్లిన పనవ్వ లేదా? " అనడిగాడు.

"లేదు"

"అవ్వదని నాకు ముందే తెలుసు. అక్క డెవరితోనో పితకలాటకానికి దిగి వుంటావు. చూడు బ్రదర్ నీటిలోని చేప ఎన్ని నీళ్లుతా గిందో ఎవరికీ తెలీదు. ఆఫీసులోని ఉద్యోగులూ అంతే. ఎంత మేస్తున్నారో ఏం మేస్తున్నారో పైవాళ్లకి తెలీదు. కానీ మనకి తెలుసు, మనకి తెలుసని వాళ్లకి తెలుసు. అందుకని గుట్టు చప్పుడు కాకుండా బల్ల కింది వ్యవహారం సెటిల్ చేసుకుంటే మనకి హాయి. వాళ్లకి హేపీ"

"గాంధీని చూస్తే మీకందరికీ ఉపన్యాసా లివ్వాలన్పిస్తుందేమిట్రా" కల్పించుకుంది అమ్మ.

"అందరికీ అంటే డాడీ కూడా ఓ క్లాసు పీకారన్నమాట. అయినా మనవాడు మారడులే"

"మారాల్సింది వాడు కాదు మీరు. నీతిగా, నిజాయితీగా, మంచిగా, మనిషిగా వుండాల నుకోవడం పెద్ద నేరమన్నట్టు మాట్లాడతా రేంట్రా" కించిత్తు బాధగానే అంది.

అప్పుడు వణికిన ఆమె స్వరానికి కదలిపోయాను.

అమ్మకి నేనంటే ఎంత ప్రేమ! నా పద్ధతులంటే ఎంత అభిమానం. చాలు ఈ మాత్రపు ప్రోత్సాహం చాలు.

"నలుగుర్లో నారాయణ, కులంతో గోవింద అన్నారు మమ్మీ. నలుగురు నడిచిన దారిలోనే మనమూ నడిస్తే సేఫ్. కొత్తదారి తొక్కితే ముళ్లూరాళ్లూ తప్పవు. ఉలిపికట్టెలా వేరేదారి పట్టడం బ్రదర్‌కి మంచిది కాదు. ప్రపంచంలో అత్యధికంగా అవినీతి గల దేశాల్లో మనది పదహారో స్థానమట. కనీసం అందులోనైనా ఫస్టొస్తే బావుండనుకుంటున్నాం మా ఫ్రెండ్సంతా. వీడిలాంటివాళ్లుంటే ఒలింపిక్స్‌లో కాంస్యపతకం లాంటిదే ఇందులోనూ దక్కుతుంది తప్ప బంగారాన్ని కళ్లజూడం"

ఎకసెక్కంగా నవ్వుతూ తన రూంలోకెళ్లిపోయాడు.

"వాడి నాలికే వంకర. అబ్బకి తగ్గ కొడుకు. వాడి మాటలేం పట్టించుకోకురా గాంధీ. ఎవరేమన్నా ఏమనుకున్నా నమ్మిన ఆశయాన్ని వదలొద్దు. సత్యం కోసం హరిశ్చంద్రుడు అష్టకష్టాలు పడ్డాడు. ఆలుబిడ్డల్ని అమ్ముకుని కాటికాపరయ్యాడు. అయినా సత్య సంధత వదల్లేదు గనుకే మహానుభావుడయ్యాడు. అందుకనే మనం రోజూ తలచుకుంటున్నాం"

"మమ్మీ"

"అవున్రా, అసత్యం తాత్కాలికంగా గెలవవచ్చు కానీ అంతిమ విజయం సత్యానిదే. సత్యమేవజయతే అన్నార్రా పెద్దలు" నా తల నిమురుతూ అంది అమ్మ.

"నీ కడుపున పుట్టడం నా అదృష్టం మమ్మీ"

"నేను మీ అమ్మనే కాదురా, స్వాతంత్ర్య సమరయోధుడైన సుబ్బారాయుడి కూతుర్ని కూడానూ"

"నాకు తెలుసమ్మా! తాతయ్యని చూసి చాన్నాళ్లయింది. ఈ శలవుల్లో వెళ్లాలి" భోజనం ముగించి లేస్తూ అన్నాను.

రైలు కదలడానికింకా వ్యవధి వుంది.

ప్లాట్‌ఫాం మీద బుక్‌స్టాల్లో కొత్త పుస్తకాలు తిరగేస్తోంటే "హాయ్ గాంధీ!" అంటూ వచ్చింది సహజ.

"కాలేజీకెళ్లలేదా? "

"ఆ సంగతి నేన్నిన్ను అడగాలి. నువ్వు కాలేజీ ఎగ్గొట్టడం నిజంగా ఎయిత్ వండరే"

"డాడీ ఒక పని చెప్పేరు. అందుకని...

నువ్వు ఊరికెళ్తున్నావా? "

"లేదు మా పేరెంట్స్ వచ్చారు. సెండాఫ్ ఇద్దామని వచ్చాను"

ఇంతలో ఆమె తల్లిదండ్రులు మా దగ్గరి కొచ్చారు. సహజ నన్ను తాకుతూ నిలబడి నా చేతిని తన చేతుల్లోకి తీసుకుని మాట్లాడుతోంది. అది నచ్చక కాబోలు వారి మొహాలు అప్రసన్నంగా మారాయి

కొంచెం ఎడంగా జరిగాను.

"మమ్మీ! గాంధీ అని చెప్పేనే అతనే ఇతను. ఇంటెలిజెంట్ స్టూడెంట్. వీళ్ల నాన్నగారు పెద్ద ఆఫీసరు. వీళ్ల ఇల్లు ఎంత బావుంటుందో చెప్పలేను. గాంధీని మా కాలేజీలో అంతా హీరోగానే కాదు రోల్ మోడల్‌గా చూస్తారు డాడీ! ఇలాటి వాళ్లు ఇంకొకరుండరంటే నమ్ము"

సహజ వాక్ప్రవాహానికి అడ్డొస్తూ "నమస్తేండీ" అన్నాను.

"మంచిదిబాబూ! మా సహజెప్పుడూ నీ గురించే చెబుతుంటుంది. మీ ఇద్దరూ మంచి స్నేహితులటకదా" అన్నాడాయన.

"మీరేవిట్లబ్బాయ్" ఆరా తీస్తూ అందామె తల్లి.

"ఎవరైతేనేమే! మంచివాళ్లా చెడ్డవాళ్లా అన్నది ముఖ్యంగాని కులగోత్రాలు కాదు"

ఆయనేదో సర్దిచెప్పబోయాడుగాని ఆమె విన్పించుకోలేదు.

"అబ్బాయ్... మీరేమిట్లూ"

చటుక్కున అందుకుంది సహజ. "మన వాళ్లేనమ్మా! నాకన్నా మూడ్నెల్లు పెద్ద. చదువులో తను ఫస్ట్ అయితే నేను సెకండ్ కదా గాంధీ"

ఎంబ్రాస్సింగా ఫీలవుతూ "అబద్ధాలొద్దు. సహజ క్లాస్ సెకండ్ రాదుగాని బాగానే చదువుతుంది" అన్నాను.

సహజ మోము ఎరుపు రంగు అద్దుకుందో క్షణం.

"పెళ్లి చేసుకుని అత్తారింటికెళ్లే పిల్ల. దాని చదువు ఎలా వుంటే ఏంట్లేగాని నీ సంగతేవిటి. చదువయ్యాక అమెరికా వెళ్తావా? " సహజ తండ్రి అడిగారు.

"అమెరికా ఎందుకండీ? "

"ఎందుకేవిటీ. డాలర్ల పంటకోసుకోడానికి" నవ్వేడు.

"నాకలాటి ప్లానేమీ లేదండీ. ఐలవ్‌మై కంట్రీ ఐ లవ్‌మై పీపుల్"

"నేను చెప్పేనుకదా డాడీ! గాంధీ ఐడియలిస్టు. ఉడుకు రక్తంకదా! చెబితే అర్థం చేసుకుంటాళ్లే. మహా జీనియస్. తర్వాత చెబుతాన్లేగాని పదండి మీ ట్రెయిన్‌కి టైమవుతోంది"

ఆమె మాటల్లో ఏదో దాస్తున్న భావం కన్పించి ఆమె వంక చురుగ్గా చూశాను. చూపులు తిప్పేసుకుందామె.

"వస్తానబ్బాయ్! మంచిరోజు చూసుకునొచ్చి మీ నాన్నగారితో మాట్లాడతాన్లే. ఒక్క మాట. మంచి భవిష్యత్తు కావాలంటే అమెరికా వెళ్లక తప్పదు.. ఆలోచించు.. "

ఇంతలో మా ట్రెయిన్ కదులుతున్నట్టు ఎనౌన్స్‌మెంట్ వినిపించింది.

ట్రెయినెక్కి కూర్చుని సహజ గురించే ఆలోచిస్తూ ఉండిపోయాను.

సహజ!

పేరుకు తగ్గట్టు ఎంతో సహజంగా ఉంటుంది. యౌవనశోభతో మెరిసిపోతూ ఉంటుంది. ఎప్పుడూ మోడ్రన్ డ్రెస్సులే ధరిస్తుంది. అయినా ఎబ్బెట్టుగా అనిపించదు. సహజంగా ఇమిడిపోయినట్టుంటాయి. ఆమె సౌందర్యాన్ని రెట్టింపుచేసి కుర్రాళ్ల మనసుల్ని చెదరగొట్టేలా ఉంటాయి.

ఎం.సి.ఏ ఫస్టియర్‌లో పరిచయమయ్యింది. అప్పట్లో ఆమె తనతో అంతగా మాట్లాడేదికాదు. కొందరు స్నేహితులతో కలిసి నామీద చిన్నచిన్న కామెంట్లు కూడా విసిరేది. తర్వాతర్వాత ఏమైందోగానీ నామీద ఆసక్తి పెంచుకుంది.

సెకండియర్‌లోకొచ్చేసరికి మా ఇద్దరి





మధ్యా చక్కని స్నేహం అల్లుకుంది. అది కేవలం స్నేహమేనా అని ప్రశ్నిస్తే కాదని చెప్పాలి.

ఒకరంటే ఒకరికి ఇష్టం. అభిమానం. ఒకరిసన్నిధిలో ఒకరం గంటల తరబడి గడపాలన్న కోరిక.

ఆనందాన్ని, విచారాన్ని ఒకర్తో ఒకరు పంచుకోవాలన్న ఆరాటం. ఆశ. జీవనయానమంతా ఒకరి చేతులొకరు పట్టుకుని కలసి నడవాలన్న ప్రగాఢమైన కోరిక ఇద్దరిలోనూ ఉంది.

దీన్నే ప్రేమంటారేమో!

చిన్నగా నవ్వుకున్నాను.

"అంకుల్! ఎందుకు నవ్వుతున్నారు?" నా పక్కనే కూర్చున్న చిన్నపాప అడిగింది.

ముద్దొస్తున్న ఆ చిన్నపాప బుగ్గలు నిమిరి "ఏదో గుర్తొచ్చింది పాపా!" అన్నాను.

"ఏం గుర్తొచ్చిందీ?"

"తప్పు. అలా అడగకూడదు" పాప తల్లి వారించింది.

"తప్పా అంకుల్?"

"తప్పుకాదుగానీ కొన్ని కొన్ని అడగకూడదు. కొన్ని అడిగినా చెప్పలేనివి ఉంటాయి గదా! నువ్వేం చదువుతున్నావు పాపా?"

"థర్డ్‌క్లాస్. ఫస్ట్‌ర్యాంక్ నాదే అంకుల్!"

"వెరీగుడ్! పెద్దయ్యాక ఏమవుతావు?"

"డాక్టరునవుతానంకుల్" ఠకీమని చెప్పింది.

"ఓ... వెరీగుడ్! ఐలైక్‌యూ పాపా!"

"నా పేరు పాపకాదంకుల్. శ్రేష్ఠ"

"నైస్‌నేమ్. డాక్టరెందుకవ్వాలనుకుంటున్నావు శ్రేష్ఠా?"

"బోల్డుమందికి జ్వరాలొస్తాయి కదా అంకుల్! వాళ్లందరికీ మందులిచ్చి తగ్గించేస్తాను. బోల్డుమంది దగ్గర డబ్బులుండవు కదా అంకుల్. వాళ్లు ఆస్పత్రికి వెళ్లలేరు కదా. వాళ్లందరికీ మందులిస్తాను. మదర్ థెరిస్సా అంత గొప్పదాన్నవుతాను"

"నిన్నెలా అభినందించాలో తెలియడం లేదు శ్రేష్ఠా! ప్రపంచ మానవాళి సాగిలబడి మొక్కాల్సిన మమతల కోవెల, దయామూర్తి మదర్ థెరిస్సా. నీలాంటి ఎందరికో స్ఫూర్తి అవుతోందంటే ఆమె వెలిగించిన చైతన్య దీపపు కాంతి అందరి మనసుల్లోనూ ప్రసరిస్తోందన్నమాట"

తినుబండారాలమ్మేవాడొస్తే చాక్‌లైట్ బార్ కొని శ్రేష్ఠకిచ్చాను.

"వద్దంకుల్"

నువ్వు డాక్టరవుతావన్నందుకు కాదు. పేదసాదలకు సేవ చేస్తానన్నందుకీ బుల్లి గిఫ్ట్ ఇస్తున్నాను. తీసుకో శ్రేష్ఠా! ఫైవ్‌స్టార్ హాస్పిటల్స్‌లో వైద్యం చేస్తున్నది డాక్టర్స్ కాదు. బిజినెస్ మెన్. అవసరమున్నా లేకపోయినా స్కానింగులూ, ఈసీజీలు తీయిస్తున్నారు. సీటీ స్కాన్ ఓ ఆస్పత్రిలో ఎనిమిదొందలకు చేస్తే ఇతర ఆస్పత్రుల్లో వెయ్యినుంచి పద్దెనిమిదివందలు గుంజుతున్నారు. ఎంచేతనంటే సీటీస్కాన్, ఎమ్మారై టెస్ట్ వగైరాల చార్జీల్లో కొంత భాగం 'కిక్‌బాక్'గా డాక్టర్లకి ముడుతున్నాయి. అంతేకాదు, ఒక డాక్టర్ మరో డాక్టర్‌కి ఆసుపత్రి కేసుల్ని రిఫర్ చేసినందుకు పది నుంచి నలభై శాతం కమీషన్ ముట్టచెబుతున్నారు. ఇవి కల్పిత మాటలు కాదు పచ్చి నిజాలు. ఇలాంటి అవాంఛనీయ పరిస్థితుల్ని ఎదుర్కొంటామనీ కేరళలోలాగా కన్సర్టెడ్ కేంపెయిన్లు నిర్వహిస్తామనీ ప్రైవేటు హాస్పిటల్స్ అండ్ నర్సింగ్ హోమ్స్ అసోసియేషన్ సెక్రటరీ ఒక పత్రికకిచ్చిన ఇంటర్వ్యూలో చెప్పేరు"

శ్రేష్ఠకి నా మాటలు అర్థమయ్యాయో లేదోగానీ ఇంతింత కళ్ళతో చిత్రంగా చూస్తూ వింది.

అంతేకాదు, క్షణాల్లో నా దోస్తుగా మారిపోయింది.

★ ★ ★

"మళ్ళీ రాక తప్పలేదన్నమాట" నన్ను

చూస్తూనే అన్నాడు ఏకాంబరేశ్వర్రావు.

జవాబుగా నవ్వి తలాడించాను.

"రాత్రి ఇక్కడే వున్నావా హైదరాబాదెళ్ళి పోయావా? "

"వెళ్ళి వచ్చాను"

"నామాట విని వుంటే అవస్థ తప్పేది కదా! నువ్వెక్కడో సత్తెకాలపు మనిషిలా వున్నావు తప్ప ఈకాలం వాడిలాలేవు"

ఆఫీసులోకెళ్ళబోతుంటే ప్యూను అడ్డగించాడు.

"అయ్యగారు కోప్పడతారు. రిజిస్ట్రేషను జరుగుతోంది"

"నా ఈసీ తయారయ్యిందేమో కనుక్కో"

"కనుక్కుంటాన్లేగానీ అలా కూర్చో"

బెంచీమీద కూలబడ్డాను. బేచ్‌లు బేచ్‌లుగా లేఖకుల వెంట లోపలికెళ్తున్నారు. పనిపూర్తిచేసుకుని వస్తున్నారు. నేను మాత్రం వేసిన చోటనే వుండిపోయే గొంగళిగా వుండిపోయాను.

సబ్‌రిజిస్ట్రార్ని కలుద్దామని లోపలికెళ్లబోతోంటే ఆయన్తో సహా అంతా బయటికి వచ్చారు. లంచ్‌టైం కాబోలు, శేషావతారం దగ్గరికెళ్లి "సార్ నా పని" అనడిగాను.

"అవుతుందిలే పని ఒత్తిడి ఎక్కువగా వుంది. నేనేం చెయ్యను చెప్పు" తనదేం తప్పులేదన్నట్టుగా అన్నాడు.

"నిన్నట్నుంచి తిరుగుతున్నాను"

"నా పెళ్లానికి నేను తిండి పెట్టడం దేశాన్ని ఉద్ధరించడానికని చెబితే నువ్వు నమ్ముతావా? నీ పనికోసం నువ్వు తిరుగుతూ తిరుగుతున్నాను తిరుగుతున్నానంటావేంటీ భలేవాడివేనే"

అతడెళ్లిపోయాడు. నిస్సహాయంగా విలబడి పోయాను.

"శేషావతారం మొండివాడయ్యా! చేతిలో తైలం పడందే తలపైకెత్తి చూడని రకం. అతడితో ఎందుకు పెట్టుకుంటావుగానీ పదో పాతికో చదివించుకో పనైపోద్ది" మరో గుమాస్తా నా చెవిలో చెప్పి వెళ్లిపోయాడు.

"సారీ నేనివ్వను. రూల్సు ప్రకారం పని ఎప్పటికైతే అప్పుడే అవ్వనీండి"

"అయితే నీ ఖర్మ. నీకంత సరదాగా ఉంటే మా ఆఫీసు చుట్టూ ప్రదక్షిణాలు చెయ్యి ఎవరొద్దన్నారూ"

పెదవి కొరుక్కుంటూ వచ్చి ఏకాంబరేశ్వ్రావు పక్కనున్న స్టూలు మీద చతికిలబడ్డాను.

అతడికేదో బేరం తగిలినట్లుంది బిజీగా వున్నాడు.

వారినే గమనిస్తూ కుర్చున్నాను.

"ఇవి చేతులు కావు కాళ్లనుకోండి సావీ!" ఏకాంబరేశ్వరరావు చేతులు పట్టుకుంటూ అన్నాడో పల్లెటూరతను.

"లక్ష్మయ్యా! నీకింకెలా చెప్పాలో నాకు అర్థం కావట్లేదు"

"తమరే పెద్దమనసు చేసుకుని నా పని చక్కబెట్టాలి"

"పెద్ద మనసు చేసుకోవాల్సింది నేను కాదు ఆఫీసరుగారు. ఆయన రూపాయి కాగితాలని తప్ప మనుషుల్ని నమ్మడు. మరంచేత అతడికివ్వాల్సింది తాంబూలంలో పెట్టి ఇవ్వక తప్పదు"

"అయిదొందలిత్తానంటున్నాగా దీంతో పని జరిపించెయ్యండి. పేదముండావాడ్ని. మీ పేరు చెప్పుకుని దీపం పెట్టుకుంటాను"

"నీకూ నీ దీపానికీ ఓ నమస్కారం. పది హేనొందలకి అర్ధణా తక్కువైనా రిజిస్ట్రేషను జరగదుగాక జరగదంతే"

"అడిగి చూడండి సావీ"

"భలేవాడివి. నీ గురించి ఆయన్తో గొడవ పడమంటావేంది. దేవుడితో గొడవపడి పూజారి బతగ్గలడేమోగాని మేం బతకలేం"

"నాదగ్గరలేవు సావీ..." కళ్లనీళ్లు పెట్టుకున్నాడు లక్ష్మయ్య.

"ఉన్నప్పుడేరా అప్పుడే చేయిస్తాను. ఇవిగో నీ దస్తావేజులు. వెళ్లిరా"

స్టాంపు పేపర్లివ్వబోతే పుచ్చుకోలేదు లక్ష్మయ్య.

"రిజిస్ట్రీ అవ్వకపోతే పిల్ల పెళ్లి ఆగిపోద్ది సావీ"

ఆ మాటలకి నిటారుగా అయ్యాను.

"దానికి నేనేం చెయ్యను చెప్పు లక్ష్మయ్యా! ఈ ఆఫీసుకొచ్చేవాళ్లు రెండు రకాలు. అప్పుల పాలయ్యో మరోదారి లేకో పొలమో ఇల్లో మరోటో అమ్ముకునే వాళ్లూ, వాటిని కొనుక్కునే వాళ్లూనూ. డబ్బున్న వాళ్లే కొనుక్కుంటారు గనుక తన మామూలు విషయంలో వీసమంత కూడా రాజీపడరు ఆఫీసరుగారు"

"నేను కొనుక్కోడం లేదుకదా సావీ. నాకున్నదాన్లో ఇంత భూవిని కూతురి పెళ్లికి కట్నంగా ఇస్తున్నాను"

"అయినా అతగాడు దిగిరాడయ్యా మగడా!"

"ఇదిగో చూడండి. ఇయ్యే వున్నాయి. దారి ఖర్చులకని వుంచుకున్నాను. ఇయ్యన్నీ తీసుకుని నా పని చేసి పెట్టి పుణ్యం కట్టుకో సావీ"

జేబులోనూ బొడ్డుచెంగునా వున్న చిల్లర నోట్లన్నీ ఏకాంబరేశ్వరరావు చేతిలో పోశాడు లక్ష్మయ్య.

వాటిని లెక్క పెట్టి పెదవి విరిచేశాడు.

"ఆరు వందల ఇరవై రెండున్నాయి. ఏమీ లాభంలేదు"

"మీ కాళ్లకి మొక్కుతాను. నన్ను ఒడ్డున పడెయ్యి సావీ" అతడి కాళ్లు పట్టేసుకున్నాడు లక్ష్మయ్య. మరి చూస్తుండలేకపోయాను.

"లక్ష్మయ్యా! నువ్వలా కాళ్లావేళ్లాపడాల్సిన పనిలేదు. ప్రభుత్వానికి కట్టాల్సిన ఫీజు కడి తేచాలు. పైన ఒక్కపైసా కూడా ఇవ్వక్కర్లేదు. నీ పనయ్యేట్లు నేను చూస్తాగా"

నావంక ఆశగా చూశాడు లక్ష్మయ్య.

వ్యంగ్యంగా నవ్వేడు ఏకాంబరేశ్వర్రావు "ఉట్టికెగరలేనమ్మ స్వర్గానికెగరడమంటే ఇదే నోయ్"

"నేనెలా ఎగుర్తానో మీరే చూద్దురుగాని కాని ముందా పేపర్లు తీసుకుని ఆఫీసులో సబ్మిట్ చేయండి"

"బరువు పెట్టందే వీటివంక చూడరు మరి"

"మీరివ్వండి చెబుతా"

"ఆ బాబేదో చేస్తానంటున్నారుకదా సావీ! చెయ్యనివ్వండి"

"సరేనోయ్ నీ ఇష్టం. ఆనక కథ అడ్డం తిరిగితే నా పూచీ ఏమీ లేదు. ముందే చెప్పేస్తున్నాను"

"అలాగేనండి. ఆ బాబేదో మంత్రం వేసేట్టే వున్నాడు"

దస్తావేజులు తీసుకుని ఆఫీసులోకెళ్లాడు ఏకాంబరేశ్వర్రావు.

మరేమీ ఆలస్యం చెయ్యకుండా ప్యూను వీరయ్య దగ్గరికెళ్లాను.

తల గోక్కుంటూ నావంక చూసి నవ్వేడు. నేనేదో ఇవ్వడానికొచ్చాననుకున్న ట్టున్నాడు పాపం.

"ఈ ఊళ్లో ఏసీబీ వాళ్లబ్రాంచి ఎక్కడుంది వీరయ్యా"

"ఏసీబీ ఆఫీసా? "

"ఏసీబీ అంటే తెలీదా. లంచగొండుల్ని పట్టుకునే యాంటీ కరప్షన్ బ్యూరో పేర్వారం రాములుగారు తెలుసా? "

"ఊహూ" చెమటలుకక్కుతూ అన్నాడు.

"హైదరాబాదులో వుంటారు. ఏసీబీ అధి నేతగా ఆయనొచ్చేక లంచగొండి చేపల్ని వలవేసి చకచకా పట్టేస్తున్నారు"

ఆఫీసులోంచి ఒక గుమాస్తా దూసుకొ చ్చాడు. లంచ్ టైంలో శేషావతారానికేదో చదివించమని నాకు సలహా ఇచ్చిందతనే.

"ఒరే వీరయ్యా! నీకు బుద్ధిలేదు. ఆఫీసు కొచ్చిన వాళ్లని కూర్చోమని కూడా చెప్ప వేంరా! కూర్చోండి సార్! మీ పనేవిట న్నారూ? ఈసీ కావాలన్నారుకదా? " ఎంతో వినయంగా అడిగాడు.

నా మాటలు విన్నాడని అర్థమైపోయింది.

చిన్నగా నవ్వేను. "అంతేకాదు. ఇతగాడి రిజిస్ట్రేషన్ పని కూడా వుంది. రా



లక్ష్మయ్యా? "

లక్ష్మయ్య పరుగునొచ్చాడు.

"నీ దస్తావేజులెవరు రాశారు? సాక్షులొచ్చారా"

"ఏకాంబరేశ్వర్రావుగారు రాశారు"

"అతడి పనీ మీ పనీ అన్ని పన్లూచేసి పెడతాంగా. అసలు మేమున్నదే అందుక్కదా! కూర్చోండి"

లక్ష్మయ్యని తోడ్కొని హడావిడిగా లోపలికెళ్లాడు.

లోపలంతా పిన్‌డ్రాప్ సైలెన్స్

మరి అయిదు నిమిషాల్లో ఈసీ తెచ్చి నా చేతిలో పెట్టాడు.

"లక్ష్మయ్య పని కూడా పూర్తైపోయింది"

"మిగతా వాళ్లవి"

"అందరివీ చేస్తాంకదా! జరిగిందంతా మీరిక్కడే మర్చిపోవాలి"

"ఇంకెవరి విషయంలోనూ అలా జరగదని హామీ ఇస్తే అలాగే మరచిపోతాను"

లెంపలేసుకుంటూ "మాకు బుద్ధొచ్చింది లెండి" అన్నాడు.

"మీకొక్కరికే వస్తే చాలదుకదా"

"అందరికీ వచ్చింది. అందరి తరఫునా లెంపలేసుకున్నాను. మళ్లీ వేసుకోనా? "

"వద్దులెండి"

అతడెళ్లిపోయాడు.

లక్ష్మయ్య వచ్చి చేతులు జోడించాడు.

"దేవుళ్లా వచ్చావు బాబూ"

"ఈ ఉద్యోగులూ అధికారులూ అంతా వున్నది మన పని చెయ్యడానికే! వాళ్లకిచ్చే జీతాల సొమ్ము పన్నుల రూపేణా మనం చెల్లించిన డబ్బుల్లోదే. వాళ్లు మనకి కృతజ్ఞులుగా వుండాలప్పుడు. మనం వాళ్ల అడుగులకి మడుగులొత్తి తీర్థప్రసాదాలివ్వక్కర్లేదు. మేం లంచం ఇవ్వమని అంతా తెగేసి చెబితే ప్రతి ఆఫీసులోనూ నీకెదురైన దృశ్యమే ఎదురవుతుంది"

"నూరేళ్లు చల్లగా బతుకుబాబూ" అంటూ దీవించాడు ఆనంద బాష్పాలురాలుస్తూ.

సాక్షాత్తూ ఆ భగవంతుడే దిగి వచ్చి దీవించినట్లు అనుభూతిపొందాను.

ఏకాంబరేశ్వర్రావొచ్చి నన్నో పక్కకి తీసుకెళ్లి "మరి నిన్నట్నుంచీ చెప్పేవు కాదేమోయ్. పేర్వారం రాములుగారు మీ బంధువటకదా" అనడిగాడు.

"ఎవరు చెప్పేరు? "

"లోపల చెవులు కొరుక్కుంటూ భయంతో వణికి చస్తున్నారు"

"నాకేకాదు అందరికీ బంధువాయన. వెధవ్వేషాలెయ్యకుండా జాగ్రత్తగా వుండమనండి" మిర్రి చూస్తుండిపోయాడు.

నవ్వుకుంటూ వెనుదిరగబోయిన వాడినల్లా గోడకి అంటించిన నోటీసులోని పేర్లు చూసి షాక్ తిన్నాను.

ఆనంద్, సులోచనలు రిజిస్ట్రార్ ఆఫీసులో వివాహం చేసుకోబోతున్నారనీ ఎవర్కైనా అభ్యంతరాలుంటే తెలియజేయవచ్చనీ ఆ నోటీసులో పేర్కొన్నారు.

డేట్ చూశాను.

ఇవాళే!

ఆనంద్ అంటే!

నా ఊహకి సడన్ బ్రేకు వేస్తూ వచ్చి ఆగింది మారుతీజెన్.

అది మా కారే. బ్రదర్ ఉపయోగిస్తాడు. అంటే బ్రదర్ పెళ్లా? ఇంట్లో చెప్పకుండా ఎవరికీ తెలీకుండా ఈ ఊళ్లో అంత రహస్యంగా చేసుకోవాల్సిన అగత్యమేమిటి?

అయోమయావస్థలో కొట్టుకుంటోంటే కారు దిగారు అన్నయ్యా ఆ అమ్మాయీ, నలుగురు ఫ్రెండ్సూ.

వారి చేతుల్లో పూలదండలు స్వీట్ పాకెట్లూ వున్నాయి.

కొత్తదుస్తుల్లో మెరిసిపోతూ ఆనందోత్సాహాలతో ఊగిపోతున్నారు అన్నయ్యా, ఆ అమ్మాయీ!

సడన్‌గా నన్ను చూశాడు అన్నయ్య. దెయ్యాన్ని చూసినట్టు బెదిరిపోయాడు.

గబగబా ముందుకొచ్చి "నువ్వెందుకొచ్చా





వురా? డాడీ పంపేరా? షిట్. డాడీకెలా తెలిసిందిరా? " అనడిగాడు రహస్యంగా.

"నువ్వు పెళ్లి చేసుకుంటున్నావా? "

"అదో పెద్ద కథ. తర్వాత చెబుతానుగాని ఇప్పుడిక్కడేం రాద్ధాంతం చెయ్యకురా. ప్లీజ్ గాంధీ వెళ్లిపోరా"

"అదికాదన్నయ్యా! ఇంత రహస్యంగా మేరేజ్ చేసుకోవాల్సిన ఖర్మేమిటి? ఆ అమ్మాయెవరు? ఈ ఊళ్లో ఎందుకు చేసుకుంటున్నారు? "

"సులోచన నేటివ్ ప్లేస్ ఇదేలే! మిగతా డీటెయిల్స్ తర్వాత చెబుతాను. ప్లీజ్ ఏమీ చూడలేదనుకుని కామ్‌గా వెళ్లిపోరా"

"నీ పెళ్లి నేను కూడా చూడకూడదా? "

"అహ... అదికాదు... మరేవిటంటే" మాటలకోసం తడుముకొంటోంటే సులోచనా మిగతా వాళ్లూ సమీపించారు.

"అతడ్తో సీక్రెట్లు మాట్లాడేస్తున్నావేంటి గురూ! అతడెవరూ" ఒకరన్నారు.

"ఈ ఊళ్లోనూ నువ్వెరిగిన వాళ్లున్నారన్న మాట" నవ్వేరింకొకరు.

"ఇతడెవరు ఆనంద్" అడిగింది సులోచన.

గొప్ప ఎంబ్రాస్సింగా ఫీలవుతూ "మా బ్రదర్... తమ్ముడు. మీట్ మై బ్రదర్ గాంధీ... ఈ అమ్మాయి సులోచనరా" అన్నాడు అన్నయ్య.

"ఓహ్, వెరీగుడ్. మీ ఇంట్లో నిన్ను అర్థం చేసుకునేది ఇతడొక్కడేనన్నమాట" అందామె.

"యస్సెస్" పొడిగా నవ్వేడు ధారలుగా కారిపోతున్న చెమటని కర్చీఫ్‌తో అద్దుకుంటూ.

"అన్న పెళ్లికి తమ్ముడు సాక్షి సంతకం చేస్తాడన్నమాట. గ్రేట్ థింగ్"

ఒకరి మాటలకి "నేను పెళ్లికి రాలేదు. వేరే పని మీద వచ్చాను" అన్నాను సూటిగా.

"వేరే పనా? "

నా చుట్టూ చేయి వేసి తనకి గట్టిగా హత్తుకుంటూ "రా గాంధీ! మైడియరెస్ట్ బ్రదర్. నువ్వంటే నాకెంతో ఇష్టంరా. నా పెళ్లికి వచ్చినందుకు చాలా చాలా హేపీగా వుందిరా" అంటూనే ఆఫీసులోకి నడిపించుకెళ్లాడు అన్నయ్య.

నేనెక్కువగా మాట్లాడకుండా అన్నయ్య నాటకమాడుతున్నాడని అర్థమైంది. ఎంతా లోచించినా కారణం బోధపళ్లేదు.

ఫలానా సులోచనని పెళ్లి చేసుకుంటానంటే అభ్యంతర పెట్టేవాళ్లెవరూ లేరు మా ఇంట్లో. డాడీ కట్న కానుకలు ఆశించే మనిషే కాదు, అమ్మ అయితే మంచీ మమతాగల లక్షణమైన అమ్మాయి అయితే చాలు లక్షలుండక్కర్లేదని ముందే చెప్పేస్తుంది.

మరటువంటప్పుడు దొంగచాటుగా పెళ్లాడాల్సిన అగత్యం ఏముంది?

అన్నయ్యవంక అనుమానంగా చూశాను.

"తర్వాత చెబుతానుగా పరువు కాపాడరా ప్లీజ్‌రా" అన్నాడు చెవిలో ఆల్మోస్ట్ ఏడుపు స్వరంతో.

నన్ను గుర్తు పట్టినందున ఆర్బాటం చేశాడు సబ్ రిజిస్ట్రార్. అందరికన్నా నాకెక్కువ గౌరవ మర్యాద లివ్వడం చూసి అన్నయ్య సైతం విస్తుబోయాడు.

అన్నయ్యా సులోచనా సంతకాలు పెట్టేక మిగతా ఫ్రెండ్స్ సాక్షి సంతకాలు చేశారు.

"మీ బ్రదర్ని కూడా చెయ్యమను ఆనంద్" అంది సులోచన.

"గాంధీ సంతకం చేస్తావా? పోనీలే చిన్నవాడివికదా వద్దులే" అన్నాడు అన్నయ్య.

"నేను మేజర్ని" అంటూ సాక్షి సంతకం చేశాను.

ఎంచేతో నా చేయి వణికింది.

దొంగ పెళ్లికి నేను సాక్షినా? మనసు పొరల్లో ఏదో ఫీలింగు!

ఛా ఇంత పబ్లిగ్గా రిజిస్ట్రార్ ఆఫీసులో పెళ్లి చేసుకుంటోంటే దీన్ని దొంగ పెళ్లి

అనడం అన్యాయం అని సరిపెట్టుకున్నాను.

నా చేష్టకి పరమానంద పడిపోయాడు అన్నయ్య. నా చేతిని తన చేతుల్లోకి తీసుకుని ఆప్యాయంగా నొక్కాడు.

"నీ గురించేదో అనుకున్నానుగాని నువ్వు గ్రేట్‌రా" అని కూడా అన్నాడు.

"నీ భార్యతో గుసగుసలాడకుండా నీ బ్రదర్తో గుసగుసలేవిట్రా" పూలదండలం దిస్తూ అన్నాడో ఫ్రెండ్, అంతా నవ్వేరు.

పూల దండలు మార్చుకోగానే తప్పట్లు కొట్టారంతా.

"మంగళసూత్రధారణ వుంటే అది కూడా ఇక్కడే చేసెయ్యొచ్చు"

సబ్‌రిజిస్ట్రార్ మాటలకి హేండ్‌బాగ్ లోంచి సూత్రం గుచ్చిన పసుపుతాడు తీసిచ్చింది సులోచన.

అది అన్నయ్య ఊహించని పరిణామమేమో మరి కొంచెంగా తడబడ్డాడు.

సూత్రధారణ, తప్పట్లు, అభినందనలు ముగిశాయి.

"నౌ యుఆర్ వైఫ్ అండ్ హజ్బెండ్. ఈ క్షణంనుంచీ మీరిద్దరూ భార్యాభర్తలు. ఐ విష్యూ ఏ హేపీ మేరీడ్‌లైఫ్..." అభినందించాడు సబ్ రిజిస్ట్రార్.

అందరికీ స్వీట్స్ పంచేక బయటికొచ్చాం.

అన్నయ్య చేతిని గట్టిగా పట్టుకుంది సులోచన. పెన్నిధి దొరికినట్టుగా పొంగిపోతోందామె. ఎంచేతో అన్నయ్యలో కొత్త పెళ్లికొడుకులో వుండే మహదానందం, తృప్తి లేవు.

అమ్మా నాన్నలకి చెప్పకుండా వాళ్లు లేకుండా పెళ్లి చేసుకున్నానని ఫీలవుతున్నాడేమో!

అసలెందుకింతగా తొందరపడ్డాడో!

"నేను తర్వాతొస్తాన్రా. ఇంట్లో ఏమీ చెప్పకు" మెల్లగా అన్నాడు అన్నయ్య.

ఏమన్నట్లు ఆశ్చర్యంగా చూశాను.

"గ్రౌండు ప్రిపేర్ చేసుకున్నాక మెల్లగా చెబుతాన్లే... ఓకేనా"

నేనేమీ బదులివ్వలేదు.

"పార్టీకి టైమవుతోంది రారా" అంటూ ఫ్రెండ్స్ తొందరపెట్టడంతో వెళ్ళి కారెక్కాడు.

"మీ బ్రదర్ని కూడా పార్టీకి రమ్మనండి" సులోచన అంది.

"వాడికి డాడీ ఏదో పని చెప్పార్ట. అయినా మా వాడికి ఇలాంటి పార్టీలంటే ఇష్టం వుండవు. హీ ఈజె స్పెసిమాన్"

కారు కదుల్తుంటే అన్నయ్య మాటలు దాన్ని ఫాలో అయిన నవ్వులూ నా చెవిన బడ్డాయి.



"అలా వున్నావేరా గాంధీ. ఇవాళా పన వ్వలేదా? " ఇంట్లో అడుగు పెడుతుంటే అడిగింది అమ్మ.

"పని పూర్తయింది. ఇదిగో ఈసీ" అందిస్తూ అన్నాను.

"మరలా వున్నావేంరా. ప్రయాణం చేసొచ్చినందుకా? "

"అన్నయ్య వచ్చాడా మమ్మీ"

"ఊహూ... రాలేదురా. నాలుగురోజుల దాకా రానన్నాడుగా"

"నిజమా? "

"అంత ఆశ్చర్యపోతున్నావేంట్రా. ఏదో





ఊళ్ళో ఆడిటింగ్ ఉందిట. వాళ్ళ బాస్‌తో వెళ్తున్నానన్నాడు. అవునూ, ఎన్నడూలేంది వాడి గురించి నువ్వు ఆరా తీస్తున్నా వేంట్రా? "

"అదికాదు మమ్మీ. మరేమో..."

"ఏం జరిగిందిరా? " కలవరపడుతూ అడిగింది.

"అన్నయ్య... పెళ్ళి చేసుకున్నాడు"

స్టన్నయ్యింది అమ్మ. చిత్రంగా చూసింది.

"అన్నయ్య పెళ్ళి చేసుకోవడమేంట్రా? నీకేమైనా మతిపోయిందా? "

"మతి పోయినట్లే వుంది. ఇవాళ్టి మధ్యాహ్నం రిజిస్ట్రార్ ఆఫీసులో సులోచనని పెళ్ళి చేసుకున్నాడు. అప్పుడు నేను అక్కడే వుండడంతో సాక్షి సంతకం చెయ్యక తప్ప లేదు కూడానూ"

మొదలు తెగిన వృక్షంలా కూలబడింది అమ్మ.

ఆమె కళ్ళల్లో కన్నీటి కుండలు భళ్ళున పగిలాయి. నోట్లో పవిట చెంగు కుక్కుకుని దుఃఖాన్ని నిగ్రహించుకో యత్నిస్తోంది.

"ఊరుకో మమ్మీ..." అమ్మని ఎలా ఓదార్చాలో తెలీలేదు.

దుఃఖం ఉధృతి తగ్గాక అంది, "ఆనంద్ ఇలాంటి పని చేస్తాడని కలలో కూడా ఊహించలేదురా"

"నా ఊహకీ అందటంలేదు. కనీసం నీక్కూడా చెప్పలేదంటే ఎందుకు దాచాడో అర్థంకావట్లేదు. అక్కడికీ ఈ చాటుమాటు పెళ్ళేవిటని అడిగాను. అదో పెద్ద కథ అనీ తర్వాత చెబుతాననీ అన్నాడు"

"ఆ పిల్ల ఎవరో ఏమిటో... వంశం, ప్రతిష్ఠా ఎలాటివో? "

"బాగానే వుంది. తెలివైందాన్లానే వుంది"

"ఆమె తరపు వాళ్ళైనా పెళ్ళికొచ్చారా? "

"రాలేదు మమ్మీ. ఫ్రెండ్సే వచ్చారు"

ఒక్క క్షణానంతరం అంది, "ఈ సంగతి మీ డాడీకి తెలిస్తే ఇల్లు పీకి పందిరేస్తారు. వాడ్నీ, నన్నూ కూడా నోటికొచ్చినట్లు తిట్టి పోస్తారు"

"నిన్నెందుకంటారమ్మా. ఇందులో నీ తప్పేముందనీ? "

"నా పెంపకం లోపమంటారు. నీ గురించి నన్ను కాకిలా పొడవరూ. అలాగే"

"డాడీకి అన్నయ్య పద్ధతులు బాగా నచ్చుతాయి. ఏమీ అనర్లే"

"ఆయన పద్ధతి నీకు తెలీదురా నాన్నా. ముప్పై ఏళ్లనుంచి కాపురం చేస్తున్నదాన్ని. ఆయనేంటో ఎంతగా మారేరో నాకు తెలీదూ. ఆయన పట్టిన కుందేటికి మూడే కాళ్ళు. నువ్వు నాకో మాటివ్వాల్రా గాంధీ"

"ఏంటమ్మా? "

"ఈ సంగతి మీ డాడీకి చెప్పనని నా చేతిలో చెయ్యి వెయ్యి"

"మమ్మీ"

"ఆనంద్ వచ్చాక విషయాలన్నీ తెలుసుకున్నాక ఆయనకి చెబుదాం. అప్పుడైతే ఆయనకి నచ్చచెప్పడం తేలికవుతుంది. లేకపోతే నానా రభసా చేసేస్తారు" భయపడిపోయింది.

"రోగం రట్టు సంసారం గుట్టు అన్నారు. ఇంట్లో గుట్టు వుండాల్సిందే గానీ ఇంట్లోవాళ్ల మధ్యే గుట్టు వుండకూడదు. ఒక్కోసారి అది అనేక అపార్థాలకి, విపరీతాలకీ దారితీస్తుంది. బాగా ఆలోచించు మమ్మీ"

నా మాటలకి నెత్తిన చెయ్యి పెట్టుకుని సన్నగా ఏడిచింది అమ్మ. ఆమెనలా చూసేసరికి ఎంతో బాధ కలిగింది.

కానీ తప్పదు. సత్యం చేదే కాదు బాధాకరం కూడా!

★ ★ ★

కాలేజీ పూలతోటలా వుంది.

గేటు పక్కనున్న గోడమీద తిష్టవేశారో పదిమంది స్టూడెంట్స్.

వాళ్ళవంక జాలిగా చూస్తూ, "ఎన్నాళ్ళీ కంచి గరుడ సేవ చెప్పండి? పోటీ ప్రపంచంలో నెగ్గుకు రావడానికి నాలెడ్జి పెంచుకోక ఈ టైం వేస్టు పనులెందుకురా"

అన్నాను మురారి నుద్దేశించి.

"హేపీగా జాలీగా గడపాల్సిన వయస్సులో వేదాంతపు కబుర్లు చెబుతావేం గురూ" అని కరుణానందం అంటే "స్టూడెంట్ లైఫ్ మళ్ళీ రాదోయ్ గాంధీ. ఎంజాయ్ అండ్ ఎంజాయ్ అన్నారు పిల్లలు" అన్నాడు షాజహాన్.

"నాల్రోజులు మాతో కలిసి తిరుగు ఇందులో ఎంత మజా వుందో నీకే తెలుస్తుంది" అన్నాడు మురారి.

"గాళ్స్‌కి నిక్‌నేమ్స్ పెట్టి ఏడిపించడం రకరకాల కామెంట్స్‌తో అల్లరిచెయ్యడం వెరీ బాడ్. కొంతమంది కుర్రాళ్ళు పుట్టుకతోనే కోతులు అన్నాడు ఓ కవి. మనం అలా అయిపోకూడదురా. రాబోవు యుగం దూతలం అని సగర్వంగా చెప్పుకునేలా ఎదగాలి"

నా మాటలు పూర్తి కాకుండానే తప్పట్లు కొట్టేశారు మురారి ఫ్రెండ్స్.

"మీ ఉపన్యాసం చాలా బావుంది. మీకు చాలా థాంక్స్. ఇక వచ్చి కూర్చుంటారా సార్" అన్నాడు కుమార్ నాటకీయంగా.

"నువ్వు మమ్మల్ని అపార్థం చేసుకుంటున్నావు గురూ. గాళ్స్‌ని మేం ఏడిపించట్లేదు వాళ్ళే మమ్మల్ని ఏడిపిస్తున్నారు కావలిస్తే నీ సహజ మీద ఒట్టు" మురారి అన్నాడు.

"నువ్వు రెండ్రోజులు రాకపోయేసరికి సహజ పిచ్చెక్కినట్టు తిరుగుతూ నీ పేరు రామకోటిలా రాసేస్తోంది బాసూ" అన్నాడింకొకడు.

"ప్రవరాఖ్యుడితో కబుర్లేశారేంటీ" అంటూ వచ్చింది శిరీష. ఆమె వెంట ఓ నలుగురమ్మాయిలు వున్నారు.

"నీలాంటి అప్సరసలు ప్రత్యక్షమవ్వలేదు మరి ఏం చేస్తాం చెప్పు. అయినా ఈ ప్రవరాఖ్యుడికి సహజ బుక్కైపోయింది. మేమే అనాథల్లా వుండిపోయాం. కరుణించ కూడదూ"

షర్ట్ సర్దుకుంటూ అన్నాడు మురారి.

"మీ రెందుకు పనికొస్తారో తెలీకుండా ఏం కరుణిస్తాం" శిరీష పక్కనే వున్న రామేశ్వరి అంది.

"ఇన్సల్ట్! రామేశ్వరి చాలా డామేజింగా మాట్లాడుతోంది" గిలగిల్లాడాడు మురారి.

"ఓకే... ఓకే... రిలాక్స్. నేనో ప్రశ్న అడుగుతాను. జవాబు చెప్పు చూద్దాం"

శిరీష మాటలకి, "కౌన్ బనేగా కరోర్‌పతి" అన్నాడు వెంటనే పాపారావు.

"ఏం శిరీషా. కరక్ట్ సమాధానం చెప్పినవాడ్ని పెళ్ళాడేస్తావా? " మురారి అడిగాడు ఆశగా.

"ముందు సమాధానం. తర్వాత బహుమతి సంగతి చెబుతాను"

"ఇదన్యాయం" అన్నాడు షాజహాన్.

"శిరీషముందు హాట్‌సీట్ మీద కూర్చునే కన్నా అమితాబ్‌ముందు కూర్చుంటే కనీసం పదివేలైనా వస్తాయి" కరుణానందం అన్నాడు.

అవేమీ పట్టించుకోకుండా, "నేను రెడీ శిరీషా. నీ సవాల్‌ని సంధించు" అన్నాడు మురారి.

ఆసక్తికరమైన మలుపు తిరిగినందున వారి సంభాషణ వింటూ నిలబడ్డాను.

"బాల్యం యౌవనం వృద్ధాప్యం. ఈ మూడింట్లోనూ కన్పించే సామాన్య లక్షణం ఏమిటీ? " అడిగింది శిరీష.

"ఆడవాళ్ళలోనే కదా? "

"కాదు. మగవాళ్ళలో"

"చచ్చాం. ఛాయిస్ చెప్పు"

"మల్టిపుల్ ఛాయిస్ లేదు"

"కనీసం లైఫ్‌లైన్ వుందా అదీ లేదా" పాపారావు అడిగాడు.

"నీ నుదుటి లైన్ తప్ప మరేలైనూ లేదు"

మురారి సీరియస్‌గా ఆలోచిస్తోంటే అతడ్నే చూస్తూ చిన్నగా నవ్వాను.

"ఊరికే బుర్ర బద్దలు కొట్టుకోకు బాసూ. ఆ బుర్రలో ఏమీలేదని మాకు తెలుసుగా"

షాజహాన్ మాటలకి మురారి కొట్టబోతే

అందకుండా పారిపోయాడతడు. ఇంతలో కాలేజీ బెల్ మోగింది.

"ఓడిపోయినట్లేనా లేక రేపటిదాకా టైం కావాల్రా? "

"ఒన్ మినిట్. ఒరే గాంధీ నువ్వే ఆదు కోవాల్రా? "

"లైఫ్ లైన్ లేదు మురారీ" రామేశ్వరి అంది.

"ఓకే. చెప్పనియ్యి చూద్దాం. గాంధీ కూడా చెప్పలేడని పందెం" అని శిరీష అన్నదో లేదో, "గాంధీ మీన్స్ సక్సెస్, నాట్ లెస్‌దెన్ సక్సెస్" అంటూ ఊడిపడింది సహజ.

ఈల వేశారెవరో.

"నౌ... ద కాంపిటీషన్ ఈజ్ బిట్వీన్ శిరీషా అండ్ సహజ" బిగ్గరగా అన్నాడు కరుణానందం.

"కమాన్ గాంధీ! శిరీషకి బుద్ధి వచ్చేలా చెప్పు"

"లీవిట్ సహజా. బెల్ కొట్టారు. క్లాసు కెళ్దాం పద" అనవసర పంతాలు పెరగడం ఇష్టంలేక అన్నాను.

కానీ సహజ ఊరుకోలేదు.

ముక్కుపుటాలదుర్తోంటే అంది, "నిన్నెవ రైనా తక్కువగా అంచనా వేసినా తక్కువ చేసి మాట్లాడినా నేను భరించలేను. చెప్పు గాంధీ"

"మీనమేషాలు లెక్కపెడతావేం గాంధీ. తెలిస్తే చెప్పుచూద్దాం" తలెగరేస్తూ అంది శిరీష.

"త్వరగా చెప్పి మన మగాళ్ళ పరువు కాపాడు గురూ. లేకపోతే రేపట్నుంచి వీళ్ళు కంటబడితేచాలు పక్కకి జారుకోవాల్సి వస్తుందిరా దేవుడా" అన్నాడు మురారి ఏడు పుముఖం పెట్టి.

"మగాడు బాల్యంలో బామ్మచెప్పే పిట్టక థలు వింటాడు. యవ్వనంలో భామ చెప్పే పిల్లకథలు వింటాడు. వృద్ధాప్యంలో దాసు చెప్పే హరికథలు వింటాడు"

"ఓ గ్రేట్!"

పొగడ్తలూ ఈలలూ అభినందనలూ!

సహజ నన్ను కావలించుకున్నంత పని చేసి మరీ ముద్దుపెట్టుకుంది.

"యూ ఆర్ గ్రేట్" మొహం ఎర్రబడ్డా కళ్ళల్లో ఆరాధన కదుల్తోంటే మనస్ఫూర్తిగా అభినందించింది శిరీష.

మురారి తదితరులంతా "ఉయార్ గ్రేట్ ఉయార్ గ్రేట్" అంటూ డాన్స్ చేస్తుంటే "క్లాసులు మొదలవుతున్నాయి రండి" అంటూ కాలేజీలోకి నడిచాను.

సహజ నావెంట వచ్చింది.

"రాత్రి పదింటిదాకా చదువుతున్నాను గాంధీ. ఎలాగైనా ఫస్ట్ క్లాసులో పాసవ్వా లని నా ప్రయత్నం. హాస్టల్ రూంలో కంప్యూటర్ వుంటే ఎక్కువ ప్రాక్టీస్ చేసుకో వచ్చుకదా. అందుకని మా డాడీని కంప్యూ టర్ కొనమంటున్నాను. మీ ఇంట్లో రెండు కంప్యూటర్లు వుండివుంటాయికదూ" అంది నడుస్తూ.

"లేవు"

"లేవా? మీకింకా కంప్యూటర్లూ, ఇంట ర్నెట్ కనెక్షనూ వుండుంటాయనుకున్నానే. బంగారు చెంచా నోట్లో పెట్టుకుని పుట్టినవా డివి. నీకు అడ్డేవిటి గాంధీ"

"అడ్డు అని కాదు అవసరం లేకపో యింది. కాలేజీ లాబ్‌లో ఎక్కువ టైం స్పెండ్ చేస్తున్నాగా"

"ఒక మాటడుగుతాను. నువ్వేమీ అనుకో వుకదా"

"అనుకోన్లే గానీ అడుగు"

"మీ అన్నయ్య మారుతీ జెన్లో తిరుగుతు న్నాడు. నువ్వేమో ఇంకా పాతహీరో హోండా దగ్గరే వున్నావు. నీక్కూడా కారు కొనమని అడగొచ్చుకదా డియర్"

"నేల విడిచి సాము చెయ్యకూడదు సహజా. నా చదువుకీ తాహతుకీ టూ వీలర్ చాలు"

"అదికాదు..."

"ఇంకేం చెప్పొద్దు. కలలు కందాం. కలలు కన్న మనకి ఆ కలల్ని నిజం చేసుకోగల సత్తా కూడా వుంటుంది. ఆ సత్తాని ఉపయోగించుకుని కలలు కల్లలు కావని రుజువు చేద్దాం"

"నాకేమీ అర్థంకాలేదు"

"మొదట డేర్ టు డ్రీమ్..." నవ్వుతూ క్లాసులోకి నడిచాను.

ఒక క్లాస్‌మేట్‌కి ఏదో లెసన్ అర్థం కాలేదంటే చెబుతూ కూర్చున్నాను. మరికొందరు మూగి వినసాగారు.

లెక్చరర్ వచ్చిన సంగతి కూడా మేం గమనించలేదు.

"వెరీగుడ్ మిస్టర్ గాంధీ. అరటిపండు ఒలిచి నోట్లో పెట్టినట్లు చెప్పావు. కంగ్రాట్స్" అభినందించారు లెక్చరర్ సోమనాథం.

సడన్‌గా కొందరు స్టూడెంట్స్ క్లాసులోకి దూసుకొచ్చారు.

"ఉయార్ ఆన్ స్ట్రైక్..."

"కాలేజి, క్లాసులు బహిష్కరించండి" అని అరుస్తున్నారు.

★ ★ ★

యూనివర్శిటీ కేంపస్‌లో ఆర్టీసీ బస్సు ఓ స్టూడెంట్ మోటారు బైక్‌ని డాష్ ఇచ్చింది. అతడు కింద పడడంతో కొన్నిదెబ్బలు తగిలాయి.

అది చూసిన విద్యార్థులంతా బలవంతాన బస్సునాపి డ్రైవర్ని కిందికి లాగి చితకబాదారు.

విషయం తెలిసి ఆర్టీసీ డ్రైవర్లంతా ఆకస్మిక సమ్మెకి తలపడ్డారు. ఎక్కడి బస్సులక్కడే ఆపేశారు.

సిటీలోని ట్రాఫిక్ స్తంభించిపోయింది. జనం ఆఫీసులకీ, ఇళ్ళకీ చేరడానికి నానా అవస్థా పడుతున్నారు.

డ్రైవర్ని అమానుషంగా కొట్టిన విద్యార్థుల్ని అరెస్టు చేయాలని ఆర్టీసీ ఉద్యోగుల డిమాండ్.

విద్యార్థి బైక్‌ని గుద్ది యాక్సిడెంట్ పాలు చేసిన డ్రైవర్ని సస్పెండ్ చేయాలని విద్యార్థుల డిమాండ్.

ఒక చిన్న సంఘటన, శాంతియుతంగా పరిష్కరించుకోవాల్సిన ఘటన అదుపుతప్పింది. ఆవేశకావేషాల అగ్నికి ఆజ్యం పోశాయి రాజకీయపక్షాలు. అదనుకోసం చూసే సంఘవ్యతిరేక శక్తులు రంగప్రవేశం చేశాయి.

ఫలితంగా ఎన్నో బస్సులు విధ్వంసానికి గురయ్యాయి.

ఎందరో విద్యార్థులు లాఠీ దెబ్బలు తిన్నారు. పోలీసు కాల్పుల్లో ఒకరు మరణించారు. పాతికమంది అరెస్టయ్యారు.

అప్పటిగ్గానీ వాతావరణం చల్లబడలేదు. సద్దుమణగలేదు.

పరిస్థితి అదుపు తప్పకుండా చూడాలని ఎంతగానో ప్రయత్నించాను. విద్యార్థి నాయకులకి నచ్చచెప్పాలని చూశాను. కానీ ఎవరూ పట్టించుకోలేదు. పైగా నన్ను పౌరుషహీనుడిగా, పిరికివాడిగా చిత్రీకరించారు.

పోలీసు కాల్పుల్లో చనిపోయిన యాదగిరి శవాన్ని పోస్టుమార్టం పూర్తయ్యాక వాళ్ళింటికి తీసుకెళ్ళాం. నాతోబాటు కొందరు స్టూడెంట్లూ, స్టూడెంట్ లీడర్లూ కూడా వచ్చారు.

ఇంటిముందు మినీ ట్రక్ ఆగేసరికి ఏవిటోననుకుంటూ లోపల్నుంచొచ్చారు ఒక ముసలావిడా, ఒకమ్మాయీ. బహుశా యాదగిరి తల్లీచెల్లీ కావచ్చు

"ఏవైంది మల్లా..."

ఆ తల్లిచూపులు ట్రక్కులోంచి దింపుతోన్న శవంమీద పడ్డాయి.

దుఃఖోద్వేగంతో ఊగిపోయింది.

"నా బిడ్డకేటైంది. యాదగిరీ... ఈ రక్తమేందిరా... ఏటయ్యింది బాబూ. నా బిడ్డ ఉలకడేంటి. యాదగిరీ... యాదగిరీ... ఓలమ్మో నా బిడ్డని సంపేసినార్రో. యాదగిరీ... యాదగిరీ. సదూకొత్తానే అమ్మా, పెద్ద ఉజ్జోగం చేసి పువ్వుల్లో పెట్టి సూత్తానే





అమ్మా అనెళ్ళిపోడివి పీనుగై వచ్చినావేం దిరా... నిన్నే నమ్ముకుని బతుకుతున్నాం. మాం ఇంకెట్ల సచ్చేదిరా యాదగిరీ... నన్నె వరు సూత్తార్రా... ఈ పోరి పెళ్లెట్లవుత దిరా... యాదగిరీ...యాదగిరీ... గింత న్యాయం సేసినావేందిరా..."

ఆకాశం బద్దలైనట్లు ఆమె కన్నీరు కట్టలు తెంచుకుంది.

తల్లీకూతుళ్ళ ఏడుపు ఆ ప్రాంతాన్ని కుది పేస్తోంటే ప్రతి గుండె తలుపునీ తట్టి ఇలా ఎందుకు జరిగిందని ప్రశ్నిస్తోంటే అంతా మౌనంగా తప్పుచేసినవాళ్ళలా తలొంచుకుని నిలబడ్డాం.

ఇరుగుపొరుగు వచ్చారు. బంధుమిత్రులొ చ్చారు.

ఓదార్చారు. ధైర్యం చెప్పారు. వేదాంతం వల్లించారు.

"మావెట్టా బతికేదిరా" అన్న ఆమె ప్రశ్నకి మాత్రం ఎవరూ జవాబు చెప్పలేకపో యారు.

చేతికందొచ్చిన చెట్టంత కొడుకు, కోటి ఆశలు పెట్టుకున్న కొడుకు చేతి ఆసరా కావాల్సిన వయస్సులో చేజారిపోయాడు.

అలాటి దురదృష్టం పగవాడిక్కూడా రాకూడదు.

అసలిదంతా ఎందుకు జరిగింది?

ఇలాగే ఎందుకు జరిగింది?

ఇది అనివార్యమా? నివార్యమా?

స్టూడెంట్ లీడర్ల వంక చూశాను. కొన్ని గంటల క్రితంవరకూ రెచ్చగొట్టిన ఉపన్యాసా లిచ్చినవాళ్ళిప్పుడు యాదగిరి అమరుడయ్యా డని ప్రశంసల్తో ముంచెత్తుతున్నారు. వాటిని తలచి గర్వపడమని నూరిపోస్తు న్నారు.

ఏదైనా మహత్తరకార్యం గురించి అసు వులు బాస్తే ఆ త్యాగానికి అర్థం వుంటుంది.

కానీ ఒక చిన్న ఘటన గురించి అనాలో చితచర్య గురించి... ఇంతటి బలిదానం అవసరమా?

ఇదే ప్రశ్న ఆ మర్నాడు యూనివర్శిటీ ప్రాంగణంలో జరిగిన సంతాపసభలో వేశాను.

"డియర్ ఫ్రెండ్స్! దయచేసి నేను చెప్పేది సావధానంగా వినండి. మనం విద్యార్థులం. విద్యని అర్థిస్తూ వచ్చినవాళ్ళం. విద్యావిజ్ఞానం సముపార్జించుకుని ఉద్యోగం, ఉపాధిద్వారా జీవితంలో స్థిరపడాల్సిన వాళ్ళం. మనల్ని కన్నవారినీ, నమ్ముకున్నవా ళ్ళనీ సుఖపెట్టాల్సినవాళ్ళం. అలాంటి మనం చేసిందేమిటి? మనకి నిజంగా అన్యాయం జరిగితే లేదా జనానికో దేశానికో ఆపద వస్తే మనం ముందు నిలవాల్సిందే. పోరాటానికి దిగాల్సిందే. అలాగని బస్సుల్ని దహనం చేసి, రైలుపట్టాలు పీకి జనజీవి తాల్ని స్తంభింపచేయాల్సిన అవసరంలేదు"

"ఈ చెవిటి ప్రభుత్వాలకి అలాటివే విన్పి స్తాయి మిస్టర్" ఎవరో అరిచారు.

"అదే పొరబాటు. స్వాతంత్ర్య సముపార్జ నకోసం రవి అస్తమించని బ్రిటీష్ సామ్రా జ్యంతో తలపడి పోరాడి తరిమేసింది అహింస అనే ఆయుధంతో అని మర్చిపో వద్దు. ఇప్పుడు మనం ఎదుర్కొంటున్నది మన ప్రభుత్వమని, మనం నాశనం చేస్తు న్నది ప్రభుత్వ ఆస్తి అని మనం మరిచిపో కూడదు. మనం విద్యార్థులమే కాదు ఓటు శక్తి వున్నవాళ్ళం. బాధ్యతగల పౌరులం అని విస్మరించవద్దు"

"సుత్తి కొట్టకురా దేవుడోయ్" గుంపులోని ఎవరో అనగా ఘొల్లుమన్నారు కొందరు.

ఆ కొందరి వంకా మిగతావాళ్ళు విసుగ్గా, చిరాగ్గా చూడడం నా దృష్టిని దాటిపోలేదు

దానర్థం విద్యార్థులు ఆలోచిస్తున్నారు. వారి ఆలోచనల్లో కదలిక వస్తోంది. అది చాలు!

"నేన్చెప్పేది ఒకటే. మన తొందరపాటు నిర్ణయాలు ప్రభుత్వ ఆస్తుల్ని నష్టపరచకూ డదు. మన చర్యలు యాదగిరిలాంటివాళ్ళని బలిపెట్టకూడదు. మన ఆవేశం కొందరు

తల్లితండ్రులకీ, తోడబుట్టినవారికి కడుపు శోకంగా మారకూడదు"

నా మాటలు పూర్తికాలేదు. కానీ ఇంతలో "మనల్నే సవాలు చేస్తున్నాడ్రా. ఓ చూపు చూడండి" అన్నాడో లీడరు. అరడజను మంది తోసుకొచ్చి హాకీ బాట్‌లతో నామీద పడ్డారు.

కళ్ళు తెరిచేసరికి ఆసుపత్రి బెడ్‌మీద వున్నాను.

పక్కనే విషాదమూర్తిలా అమ్మ కూర్చుని వుంది.

తలకి వున్న కట్లు తడిమి చూసుకుంటోంటే "ఆ రౌడీల్తో అనవసరంగా గొడవ పడ్డావెందుకురా" అంది కళ్ళనీళ్ళు పెట్టుకుని.

"వాళ్ళు రౌడీలుకాదమ్మా. వాళ్ళూ స్టూడెంట్సే. నా మాటలువల్ల వారి పదవులు పోతాయేమోనని, పలుకుబడి తగ్గిపోతుందేమోనని ఇలా పిరికిగా, అనాగరికంగా ప్రవర్తించారు"

"అలాంటివాళ్ళకి దూరంగా వుండాలి గానీ..."

"వాళ్ళు ఆటవికులై వుంటే వారి ప్రవర్తనకి ఆశ్చర్యపడేవాడ్నికాదు. వాళ్ళు నాగరికులమ్మా. చదువూ సంధ్యా నేర్చినవాళ్ళు. అలాంటివాళ్ళు ఆటవికంగా ప్రవర్తిస్తోంటే ఇది తప్పు అని వేలెత్తి చూపకపోతే వాళ్ళెప్పటికి తెలుసుకుంటారు చెప్పు?"

"వాళ్ళ గొడవ మనకెందుకురా. మనం బాగుంటే చాలదూ. వాళ్ళ గురించెళ్తే ఏమయిందో చూడు. వాళ్ళు బాగానే వున్నారు గానీ నువ్వే ఆసుపత్రి పాలయ్యావు"

"ఏసుక్రీస్తు శిలువ మోసిందీ, చిత్రవధలనుభవించిందీ తనకోసం కాదమ్మా"

విప్పారిత నేత్రాలతో చూసింది అమ్మ.

ఆ చూపుల్లో ఎన్నో అర్థాలు!

డాడీ, అన్నయ్యా వచ్చారు.

వస్తూనే "నువ్వింత ఫూల్‌వనుకోలేదు. ఒక చెంపమీద కొడితే రెండో చెంప చూపడానికి నువ్వేమైనా గాంధీ మహాత్ముడిననుకుంటున్నావా? అసలు వాళ్ళతో తలపడే ముందు నలుగురు దిట్టమైనవాళ్ళని వెంటేసుకోవద్దూ? దెబ్బకి దెబ్బ తీయాలిగానీ తోక ముడవకూడదు. నువ్వు సామాన్యుడివి కాదురా. డీసీటీవో కొడుకువి. నాకెన్నో కనెక్షన్లున్నాయి గానీ నీమీద దాడి చేసిందెవరో చెప్పు. కమాన్ టెల్ మీ" అనడిగారు డాడీ.

"స్టూడెంట్స్"

"ఆ సంగతి నాకు తెలుసులేవోయ్. నిన్ను కొట్టినవారి పేర్లు చెప్పు. రేపీపాటికి వాళ్ళ ఒంట్లో సున్నానికి ఎముక లేకుండా చేయించేస్తాను. నాకు పోలీసాఫీసర్లంతా తెలుసురా. డోంట్ వర్రీ. నా కొడుకుమీద చెయ్యి చేసుకున్నవారి కాళ్ళూచేతులూ విరచకుండా ఎలా వుంటాను? నువ్వేం భయపడకు. అంతా గుట్టుచప్పుడు కాకుండా చేయించేస్తాను. మనచేతికెలాంటి మట్టీ అంటదు. అవసరమైతే ఇన్ఫార్మర్లని ముద్ర వేసి ఎన్‌కౌంటర్ చేయించెయ్యగలన్రా... ఆ బద్మాష్‌లని వదలకూడదు. చెప్పరా"

"తెలీదు"

"బుకాయించకు. నువ్వు దిక్కూ మొక్కూ లేనివాడివికాదురా. ఒక సీనియర్ ఆఫీసర్ కొడుకువి. మైండిట్"

"పోనీ నాకు చెప్పరా గాంధీ. నేను మా ఫ్రెండ్స్‌ని తీసుకెళ్ళి వాళ్లపని పట్టేస్తాను" అన్నాడు అన్నయ్య.

"దాన్ని పొడిగించొద్దు. అంతటితో వదిలెయ్యండి చాలు"

"పోలీస్‌కీ ఇలాగే చెబుతావా?"

"యస్"

"నీ ఖర్మ! నిన్నింకెవడూ బాగుచెయ్యలేడు. మరీ ఇంత చేవలేనివాడివి నా కడుపునెలా పుట్టావురా. మధ్యన నాకేం? అనుభవించు" విసవిసా వెళ్ళిపోయారు డాడీ.

"రేపు కాలేజీకెళ్ళాక మళ్ళీ ఏమైనా చేస్తారేమోనని భయపడుతున్నావా?" అన్నయ్య అడిగాడు.





"వాళ్ళేమీ చెయ్యరు"
"అంత ఖచ్చితంగా ఎలా చెప్పగలవురా? "
"మానవతమీద నాకుగల అపారమైన విశ్వాసం"
"నీమాటలెవరికైనా అర్థమవుతాయో లేదో గానీ నాకుమాత్రం అర్థంకావు"
"పోనీలే అన్నయ్యా. వదిన ఎలావుంది"
తుళ్ళిపడ్డాడు. తత్తరపడ్డాడు.
అమ్మ కూడా సూటిగా చూసేసరికి "డాక్టర్తో మాట్లాడి వస్తాను" అంటూ హడావిడిగా వెళ్ళిపోయాడు అన్నయ్య.
"మనమేదో చెయ్యాలి మమ్మీ. అన్నయ్య ప్రవర్తన అనుమానాస్పదంగా వుంది"
"ఏం చెయ్యాలో ఏమీ పాలుపోవట్లేదురా"
"చేతినిండా డబ్బు, చెడు స్నేహాలు అన్నయ్యలాంటివారిని ఎంతకైనా దిగజారుస్తాయి. అసలందుకే ఏళ్ళు గడుస్తున్నా ఎక్కడా సి.ఎ. పూర్తవడంలేదు"
"మీ డాడీకి తెలిస్తే ఏం చేస్తారోనని భయంగా వుందిరా"
"ఏమైనా చెయ్యనీ. ఇంకా దాచినందున అనర్థమే జరుగుతుంది. తప్పు మంచి జరగదు. డాడీకి చెప్పేస్తాను మమ్మీ"
"నువ్వు చెబితే ఇంకోలా తీసుకుంటారు. వద్దులే... సమయం చూసి నేను చెబుతాన్లే..."

★ ★ ★

పెద్ద పూలగుచ్ఛాలతో సహజా, ఒక గులాబీతో శిరీషా మరికొందరూ ఆసుపత్రికొచ్చారు.
"కంగ్రాట్యులేషన్స్ మైడియర్ హీరో"
"దెబ్బలు తిన్నవాడ్ని. నేను హీరో ఏమిటి? " మందహాసం చేశాను.
"ఓడి గెలిచావు" అంది శిరీష.
"ఎలాగెలాగా? "
"స్టూడెంట్లు రౌడీల్లా ప్రవర్తించడం ఏవిటని అంతా అసహ్యించుకుంటున్నారు. డిగ్రీలు చదువుతున్న మనమే ఇలా బిహేవ్ చేస్తే విద్య లేని నాయకుల ఘోరప్రవర్తనని తప్పుపట్టగల అర్హత ఎవరికీ వుండదంటున్నారు. మీమాటలందరికీ నచ్చాయి. ఉద్యమాలకి దూరంగా ఉందామనుకుంటున్నారంతా"
శిరీష మాటలకి రియాక్టవకుండా వుండలేకపోయాను. "ఉద్యమాలకి దూరంగా వుండమని నేను చెప్పలేదు. చెప్పను కూడా. కానీ ప్రయోజనకరమైన ఉద్యమాల్లో మాత్రమే పాల్గొంటాను. గాంధీజీ పిలుపుమేరకు ఎందరో విద్యార్థులు చదువుమాని స్వాతంత్రోద్యమంలో పాల్గొన్నారు. వారి త్యాగనిరతిని గుర్తించకుండా ప్రశంసించకుండా ఎలా వుండగలం? ఆంధ్రప్రదేశ్ అవతరణలో విశాఖ ఉక్కుసాధనలో యువత పాత్ర ముఖ్యంగా విద్యార్థులు పోషించిన పాత్ర మహత్తరమైనదే. కేవలం నలభైమంది యువకుల్ని నాకివ్వండి ఈ దేశపు రూపురేఖలు మార్చేస్తానన్నారు స్వామీ వివేకానంద. యువశక్తిమీద వారికున్న నమ్మకం ఎలాంటిదో ఆలోచించు. అంతటి శక్తివంతులమైన మనం చిన్న విషయాల గురించి వీధిపోరాటాలకి దిగటం విలువైన కాలాన్ని వృధా చెయ్యడం మంచిది కాదంటాను"
చప్పట్లు కొట్టారంతా. సహజ అందరికన్నా అధికంగా చప్పట్లు కొట్టి నా చెయ్యి పట్టుకుని వూపేసి మరీ అభినందించింది.
ఆమె ధోరణి నచ్చలేదు. ఎంబ్రాస్సింగా ఫీలవుతూ, 'అతి సర్వత్రవర్జయేత్' అన్నాను.
ఆమెకర్థంలేదు.
సహజవంక మురిపెంగా చూస్తూ, "ఇలా రామ్మా. నీ పేరేంటి? " తనపక్కన కూర్చోబెట్టుకుంటూ అడిగింది అమ్మ.
"సహజ ఆంటీ. గాంధీ క్లాస్‌మేట్‌నే కాదు క్లోజ్ ఫ్రెండ్‌ని కూడా"
"కుందనపు బొమ్మలా వున్నావు గానీ ఈ డ్రస్సు నీకు నప్పలేదమ్మా. ఇంచక్కా పరికిణీ వోణీ కట్టుకో" సహజ ధరించిన జీన్స్ పాంటూ, టీ షర్టూ చూసి అంది అమ్మ.
"అవి ధరిస్తే కాలేజీకొచ్చావా, పేరంటాని

కొచ్చావా అని ఏడిపిస్తారాంటీ" అంది సహజ.

"పోనీ ఈ అమ్మాయిలా చూడీదార్ వేసుకో చూడముచ్చటగా వుంటుంది" శిరీషని చూపిస్తూ అంది.

ఆమె ముఖం నల్లబడింది. "నా స్టైలు నాది. ఒకర్ని చూసి నేర్చుకోవాల్సిన ఖర్మ నాకులేదు. అయినా నేనిలా వుంటేనే గాంధీ కిష్టం" అంటూ నా సపోర్టుకోసం చూసింది.

నేను సపోర్టు ఇవ్వలేదు. "ఎప్పుడు డిశ్చార్జి చేస్తున్నారు" అనడిగింది శిరీష.

"ఇవాళే వెళ్ళిపోవచ్చన్నారు. ఎందుకైనా మంచిది రెండ్రోజులాగాక వెళ్దామని ఆపేసింది మమ్మీ"

"అదే మంచిది"

"కాలేజీ పోతోందికదా"

"ఏకసంథాగ్రాహివి. నువ్వు అసలు కాలేజీకి రాకపోయినా డిస్టింక్షన్ ఖాయం" శిరీష మాటలకి అవునంటూ జత కలిపారంతా.

సీన్‌ని శిరీష ఢామినేట్ చేసేస్తోందని భయమేసినట్టుంది సహజకి. "ఇక్కడి పాలిటిక్స్ నీకు సరిపడవు. నీలాంటి జీనియస్ ఇక్కడ వుండలేడుగానీ పాస్‌పోర్టుకి అప్లై చేసెయ్యి గాంధీ" అంది.

"ఇక్కడెందుకుండలేం? ఇక్కడ లేనివేమిటి? సహజవనరులా, మానవవనరులా, ప్రతిభాఉత్పత్తులా? గణితంలోనేకాదు కంప్యూటర్ రంగంలోనూ ప్రపంచంలో అగ్రగణ్యులు మన దేశస్తులే"

"అంగట్లో అన్నీ వున్నాయిగానీ అల్లుడి నోట్లో శని అన్నట్టు అన్నీ వున్నా మనకేం ఒరిగిందిక్కడ. నీకు తెలుసా గాంధీ? మొన్నీమధ్య జనాభా సేకరణ చేస్తే మన దేశంలో నలభై నాలుగుశాతం అక్షరాస్యులూ, యాభైఆరుశాతం రాజకీయ నాయకులూ అని తేలిందిట"

"భలే జోక్ చెప్పావు సహజా"

"అందుకే నే చెబుతున్నాను. ఈ దేశంలో వుంటాననడం ఓ జోక్. అమెరికా ఎగిరెళ్తాననడం ఓ ఎడ్వంచర్. మరేమీ ఆలోచించకుండా వెంటనే పాస్‌పోర్టుకి అప్లై చేసెయ్యి. డిగ్రీ చేతికి రాగానే వీసాకి ట్రై చెయ్యొచ్చు"

"సారీ. నా వేళ్ళు ఈ భూమిలోనే వున్నాయి. నా కాళ్ళూ ఈ గడ్డని వదలవు"

అవమానంగా ఫీలయ్యింది సహజ. అంతా వుండడంతో వెంటనే సర్దుకుంది. "ఈ దేశం బాగుపడదు గాంధీ. దీన్నెవరూ బాగుచెయ్యలేరు"

"దారుణంగా మాట్లాడకు సహజా..." అనింకేదో చెప్పబోయాను గానీ కట్ చేసిందామె.

"ప్రస్తుతం నీ మూడ్ బాగున్నట్టులేదు. తర్వాత తీరిగ్గా మాట్లాడుకుందాం. బై... బై... ఆంటీ..."

ముఖం చిన్నబుచ్చుకుని వెళ్ళిపోయింది సహజ.

"మేం కూడా వెళ్తాం. విష్యూ స్పీడ్ రికవరీ" అని చెప్పి శిరీష వగైరాలు కూడా వెళ్ళిపోయారు.

"నేనొకటడుగుతాను. దాచకుండా చెబుతావా గాంధీ" వాళ్ళెళ్ళాక అంది అమ్మ.

"నీకు తెలుసు కదా మమ్మీ. నాది దాచుకునే మనస్తత్వం కాదు"

"మిగతా విషయాలు వేరు. ఇది వేరు. ఇందాక వచ్చిందే ఆ జీన్స్ పాంటమ్మాయి"

"సహజ"

"ఆ అమ్మాయిని ప్రేమిస్తున్నావా?"

"ప్రేమా అంటే ఖచ్చితంగా చెప్పలేను"

"కానీ ఆ అమ్మాయి నిన్ను ప్రేమిస్తోంది"

"అది ప్రేమా, ఆకర్షణా అన్నదింకా తేలాల్సి వుంది. కానీ సహజంటే నాకిష్టం. ఐ లైక్ హెర్. కానీ ఆమె ఇంకా మారాలి. నా భావాలకి తగ్గట్టుగా మారాలి. మారితేనే..."

"నీకు కార్బన్ కాపీలా వున్నవాళ్ళనే ప్రేమిస్తానంటావు. అంతే తప్ప అమ్మాయిలకి స్వంత అభిప్రాయాలూ, స్వంత వ్యక్తిత్వమూ

# రచయితలకు మనవి



- ★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- ★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**
- ★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**
- ★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
- ★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
- ★ **ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు** రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- **చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

జూలై చతుర నవల తమసోమా...!

......................................................

సమీక్షకుని పేరు : ......................................................

చిరునామా: ......................................................

......................................................

......................................................

......................................................

వుండకూడదంటావు. నువ్వూ మీ డాడీలానే తయారవుతున్నావురా. మీ మగాళ్ళంతా ఇంతేరా. వట్టి స్వార్థపరులు"

"మమ్మీ! నువ్వు నువ్వేనా...? ఇలా మాట్లాడింది మా మమ్మీయేనా" అపనమ్మకంగా చూస్తూ అడిగాను.

"ఏం? నాకు నోరు లేదనుకున్నావేంట్రా గాంధీ. నేను మీ మమ్మీనే కాదు ఒక స్త్రీని కూడా"

"నేను కాదనడంలేదు మమ్మీ"

"నువ్వేకాదు. ఎవరూ కాదనలేని సత్యం అది. పెళ్ళికాకముందు ఎంచక్కా గొంతెత్తి పాడేదాన్ని. వీణమీద సరాగాలు పలికించేదాన్ని. పెళ్ళయ్యాక అవన్నీ మూలన పడిపోయాయి"

"డాడీ వద్దన్నారన్నమాట"

"వూ... అవన్నీ సంసార స్త్రీలు చెయ్యరన్నారు"

అమ్మ కళ్ళల్లో కన్నీటి పొర కదిలింది. కళ్ళు తుడిచాను.

అభిమానంగా చూసింది.

"కోయిల గొంతు కోయడం అమానుషమే. డాడీ అదోటైపు మనిషి. పాటలోని మాధుర్యం, సంగీతమిచ్చే ఆహ్లాదం ఆస్వాదించిన వాళ్ళెవరూ అలాటిపనికి పూనుకోరు. అయినా డోంట్‌వర్రీ మమ్మీ. త్వరలోనే స్వరం సవరించుకుందువుగాని..."

"గాంధీ!"

"మనవలకి జోలపాటలు పాడాలికదా"

"భలే నవ్విస్తావురా" నెత్తిమీద మొట్టబోయి కట్లు చూసి ఆగింది.

అప్పుడు అమ్మ నవ్విన మురిపెపు నవ్వు ఎంత ముచ్చటగా వుందో చెప్పలేను!

"అలా నవ్వుతోంటే చాలా అందంగా వున్నావు మమ్మీ"

"నా అందాన్ని పొగుడుతూ మాట దాటెయ్యాలని చూడకు. ఆ అమ్మాయిలో నీకు నచ్చని లక్షణమేంటో చెప్పు..."

"సహజ నేలమీద నడవదు మమ్మీ. సినిమాల్లోలా జీవించాలనుకుంటుంది. ఊహల్లో ఊరేగుతుంది...

"ఆ అమ్మాయనేమిటీ... ఈ కాలపు పిల్లలంతా అలాగే ఉంటున్నారు. విందుల్లో, వినోదాల్లో తేలియాడాలని చూస్తున్నారు. అమాంతం ధనవంతులైపోవాలని ఆరాటపడుతున్నారు"

"కరెక్టుగా చెప్పేవు మమ్మీ! గెట్ క్విక్ రిచ్ అన్నది ఈ కాలపు యువతకి తారకమంత్రమైంది. దాన్ని నిజం చేసుకోవడానికి అమెరికా మానియా మొదలైంది"

"అమెరికా వెళ్ళాలనుకోవడం తప్పెలా అవుతుందిరా? "

"వెళ్ళచ్చు దేనికి? పైచదువులకి, పరిశోధనకి, విజ్ఞానార్జనకి. అంతేగానీ డాలర్ల మూటకోసం కాదు. ఇప్పుడంతా వెళ్తోంది, వెళ్ళాలనుకుంటోంది డాలర్ల యావతోనే. వారికి అమెరికా భూతలస్వర్గంలా కనిపిస్తోంది. కానీ వాళ్ళకి తెలీనిదేమిటంటే డబ్బే సర్వస్వం కాదనీ, డబ్బుకన్నా స్వేచ్ఛ విలువైందని. అక్కడ సెకెండ్‌క్లాస్ సిటిజన్‌లా తలదించుకుని, బిక్కుబిక్కుమంటూ వుండాలనీ, ఇల్లూ, ఆఫీసూ అంటూ యాంత్రికంగా బతకాలనీ, సంఘజీవితం లేక గృహఖైదీలా మగ్గాల్సివస్తుందనీ వాళ్ళకి తెలీదు పాపం!"

"నీకు నీ అభిప్రాయాలున్నట్టే వాళ్ళకి వాళ్ళ అభిప్రాయాలుండటం తప్పు కాదుకదా!"

"తప్పుకాదు. బంగారుపంజర జీవితాన్ని ప్రేమిస్తానంటే అది వారి ఖర్మ అంటాను. అలాంటివారితో నాకు సరిపడదంటాను"

"గాంధీ!"

"సహజకి ఆ బంగారు పంజరం కావాలి. నాకు ఇక్కడి స్వేచ్ఛావాయువులు కావాలి. నేను మారను. ఆమె మారితే సంతోషం"

"హు! సరిపోయింది. ఆ పిచ్చిది పిచ్చి ఆశలు పెట్టుకుంటున్నట్టుంది. అదేదో ముందే తేల్చి చెప్పెయ్. ఆనక ఆశాభంగాలు, ఆత్మహత్యలు ఉండవు"

"మమ్మీ!" కలవరపడ్డాను.



"ఏమిటో అలా వచ్చేసింది" నొచ్చుకుంటూ అంది. "ఇలాంటివి మొగ్గగా ఉండగానే గిల్లి పారేయడం అందరికీ క్షేమం"

తలపంకిస్తూ ఉండిపోయాను.



కౌలేజీనుంచి బయటకొచ్చి బైక్ స్టార్ట్ చేస్తోంటే చొరవగా వెనకాల కూర్చుని "పోనీయ్" అంది సహజ.

"ఎక్కడికి? "

"నువ్వెక్కడి పప్పుసుద్దవి గాంధీ? అందమైన ఆడపిల్ల నీ వెహికిల్ ఎక్కి పోనీయ్ అంటే ఎక్కడికీ, ఎందుకూ అంటూ చొప్పదంటు ప్రశ్నలేస్తావేంటి? రయ్‌మని దూసుకుపోక!"

"నాకు స్వీట్ నథింగ్స్ ఇష్టముండవని నీకు తెలుసుకదా!"

"నువ్వు అన్‌ఫిట్ ఫర్ రొమాన్స్ అని కూడా తెలుసు. కానీ ఏం చేస్తాను. నిన్ను ప్రేమించిన నేరానికి ఎడ్జస్టవ్వక తప్పదు కదా! నువ్వెలాగూ నీ దృక్పథం నుంచి అంగుళం కూడా కదలవు. పోనీ నేనే కదుల్తూ నీ కనుకూలంగా కరుగుతున్నాను. బికాజ్ ఏ లవ్యూ సో మచ్..."

"నేను కాదనటంలేదు. కానీ"

"కానీలకి గోలీమారో. ఛలో గాంధీ..."

"ఎక్కడికో చెప్పకుండా..."

"ఛలో అన్నాక ఎక్కడికో చెప్పక ఛస్తానా. అంతా మనల్నే చూస్తున్నారుకాని ముందు ముందుకి దూకించు మహానుభావా..."

కాలేజీ ఏరియా దాటాక, "ఎక్కడికెళ్లాలో ఇప్పుడైనా చెబుతావా? సినిమాకైతే ముందే సారీ చెప్పేస్తున్నాను. టైమ్ వేస్ట్ తప్ప నో యూజ్..." అన్నాను.

"షాపింగ్ చెయ్యాలి"

"కొంపతీసి దుస్తుల సెలక్షన్‌కి కాదుకదా. ఆ విషయంలో నేను చాలా పూర్. పైగా నువ్వు అన్ని షాపుల్నీ ఆమూలాగ్రం తిరగెయ్యందే కర్చీఫ్ కూడా కొనవు"

"గుడ్. నువ్వూ జోకులేస్తున్నావు. నా సాహచర్య ఫలితమన్నమాట. ఫరవాలేదు పైకొస్తావు డియర్" భుజం చరుస్తూ అంది.

"నీ కాంప్లిమెంటుకి థాంక్స్. కానీ ఎక్కడికెళ్ళాలో, ఏం కొనాలో చెప్పు"

"బేగంపేట వెళ్దాం. ఒక పెద్ద షోరూంలో చిన్న గిఫ్ట్ కొందాం. రేపు నా ఫ్రెండ్ మేరేజ్..."

"ఏం కొందామని? "

"ఏదైనా డెకరేటివ్ పీస్..."

"గృహప్రవేశానికి డెకరేటివ్ పీస్‌లు ప్రెజెంటు చేస్తే బావుంటుందిగాని మారేజ్‌కి బాగోదు సహజా. సంసారానికి ఉపయోగించేవేమైనా ఇవ్వరాదా? "

"ఆс... ఈ రోజుల్లో ఎవరాలోచిస్తున్నార్లే"

"మనం ఆలోచిద్దాం. మనమిచ్చే గిఫ్ట్ మన అభిమానానికి సూచికగా వుండాలి. మన టేస్టుకి అనుగుణంగా వుండాలి. మనల్ని గుర్తుచెయ్యాలి. అదే సమయంలో అవతలివారికి ఉపయోగపడేట్లుగా వుండాలి"

"అయ్యో రామా! ఇంత చిన్న విషయాని క్కూడా క్లాసు పీకాలా చెప్పు? "

"చిన్నదైనా పెద్దదైనా చేసే ప్రతి పనీ పెర్‌ఫెక్ట్‌గా చెయ్యాలి? నువ్వెంత బాగా చెయ్యగలవో అంత బాగానూ చెయ్యాలి"

"సరే చేస్తానుగాని ఇంక నన్ను క్షమించి





వదలిపెట్టు"

"అది కాదు సహజా..."

"లెంపలు కూడా వేసుకుంటున్నాను ప్లీజ్..."

"ఒకే దెన్. ఏ షాపుకెళ్దాం"

"అదిగో ఆ పెద్ద షోరూంకి పోనియ్"

హోటల్లా వున్న ఆ షోరూంని చూసి, "ఇది చాలా కాస్ట్లీ షాపు సహజా" అన్నాను.

"మనమూ కాస్ట్లీ మనుషులమే కదా. నువ్వు డీసీటివోగారి గారాల పుత్రుడివి. నేను లవ్వర్ని, ఉడ్‌బీని"

"నగరంలోని ప్రముఖులూ, ఎలైట్‌వర్గమూ షాపింగుకొచ్చే ప్లేస్ ఇది. అంతా కార్లలో వస్తున్నారు చూడు"

"రానియ్. మనమూ కారులో వచ్చేరోజు వస్తుందిలే. మెల్లగా మనమూ ధనికవర్గంలో చేరిపోతాం చూడు"

"సహజా! ఆకాశానికి నిచ్చెనలు వెయ్యకు..."

"ఇప్పుడింకో లెక్చర్ దంచొద్దు. లోపలికి పోనీయ్ చెబుతా" విశాలమైన పార్కింగ్ ప్లేస్‌లో పార్కుచేసి లోపలికెళ్ళాం.

సెంట్రల్లీ ఎయిర్‌కండిషన్డ్ షోరూం.

టై కట్టుకున్న ఇద్దరు ముందుకొచ్చి వినయంగా అడిగారు.

"గిఫ్ట్ ఐటమ్... డిస్కౌంట్ ఎనౌన్స్ చేశారే అవి..."

"ఫస్ట్‌ఫ్లోర్ మేడం"

పైకెక్కుతూ "ఈ షాపులో కూడా డిస్కౌంట్ పెట్టడం చాలా ఆశ్చర్యంగా వుంది" అన్నాను.

"హైదరాబాదీయులు డిస్కౌంటుగాని, ఫ్రీగిఫ్టులుగాని, బహుమతుల స్కీంగాని లేకపోతే ఏవీ కొనరట. మొన్నేదో ఇంగ్లీషు పత్రికలో రాశారు"

"మిడిల్‌క్లాసువాళ్ళు కొనేషాపులైతే అలాగే అనుకోవచ్చు కానిది పైవర్గంవారి కోసం పెట్టిందికదా. ఇక్కడి సరుకులూ రేట్లూ చూస్తోంటే కళ్లు తిరుగుతున్నాయి. మినిమం రేటు ఓ థౌజండ్ అనుకుంటాను"

"ఆమాత్రమైనా పెట్టకపోతే ఏమొస్తుందిలే కర్చీఫ్ తప్ప!" నవ్వుతూ ముందుకి దారితీసింది.

డిస్కౌంటు సరుకులు పెట్టినవైపెళ్ళాం. అక్కడా జనం ఎక్కువగానే ఉన్నారు.

నేను షోకేసుల్లోని వస్తువులు చూస్తూంటే గిఫ్ట్ సెలక్షన్‌లో పడింది సహజ

ఒక అరగంటకి ఒక చక్కని అద్దాల తాజ్‌మహల్‌ని పట్టుకొచ్చింది.

"ఎలా వుంది? నా సెలక్షన్ ఫెంటాస్టిక్కదూ" కించిత్తు గర్వంగా అడిగింది.

"సూపర్బ్‌గా వుంది. కళాకారుడి పనితనం మెచ్చుకుండా వుండలేరెవరూ. కాని పెళ్లికివ్వడం బాగోదు"

"ఎందుకు బాగోదు? ప్రేమ చిహ్నం కదా? "

"కావొచ్చు కాని ఓ సమాధికదా"

"అబ్బ. నువ్వెప్పుడూ ఇంతే. అంతా ఒక రకంగా చూస్తే నువ్వింకోరకంగా చూస్తావు. అంతా ఒకదారిన నడిస్తే నువ్వు వేరేదారిలో నడుస్తావు. ఉలిపికట్టెలా అయిపోతావేమోనని భయమేస్తుంటుంది ఒక్కోసారి"

"అందరిలా సర్దుకుపోవడం, రాజీపడటం, హిపోక్రసీ నాకు నచ్చవు. నమ్మినదాన్ని కుండబద్దలు కొట్టినట్టు చెప్పడం, నచ్చని దాన్ని ఎదిరించడం నా స్వభావం"

"మరీ వెనకాముందూ ఆలోచించకపోతే ఎలా గాంధీ. నిజం మాట్లాడి విరోధం తెచ్చుకునేకన్నా లౌక్యంగా వుండి మంచి చేసుకోవడం అన్నివిధాలా లాభకరం"

"స్వలాభం కాదు సమాజలాభం ముఖ్యం"

"బాబోయ్. నీకో నమస్కారం. ఎరక్కతేనెతుట్టని కదిపాను"

"సో... ఇదే ఫైనలైజ్ చేశావా? "

"నువ్వు సమాధి అనేశావుకదా. ఇంకెలా



గిఫ్ట్ ఇవ్వగలను. ఇంకోటి చూస్తాన్లే. నీకు నచ్చింది ఇవ్వడం నా కిష్టంలేదు"

మళ్ళీ సెలక్షన్‌లో పడింది.

పావుగంటకి ఒక డాన్సింగ్ డాల్ విత్ నైట్‌బల్బ్ తీసుకొచ్చింది.

"ఇదెలా వుంది? "

"సో సో..."

"నాకు బాగా నచ్చింది"

"పేక్ చేయించైతే. ఎంతేవిటి? "

"దీనిమీద తొమ్మిదొందలని స్టిక్కర్ అంటించారు. థర్టీపెర్సెంట్ డిస్కౌంట్‌కదా. ఆరొందలవుతుంది"

"చాలా ఖరీదే. అంత ఖరీదు చేసేట్లన్పిం చడంలేదు"

"పెద్ద షాపుల్లో క్వాలిటీ బాగుంటుంది. బేరాలుండవు గనుక రేట్లలో మోసం వుండదు. చూస్తున్నావుగా ఎవరూ బేరాలా ట్టంలేదు. కేషో, క్రెడిట్‌కార్డు ద్వారానో చక చకా చెల్లించి స్టైలుగా వెళ్ళిపోతున్నారు చూడు"

"చూస్తోంటే వాళ్ళకి డబ్బు విలువ తెలిసి నట్టు లేదు. తాతలూ తండ్రులూ కూడబె ట్టిన డబ్బునో, అక్రమార్జననో ఉపయోగిస్తు న్నారేమో అన్పిస్తోంది"

"మరీ దారుణంగా మాట్లాడకు. ఎవరైనా వింటే బావుండదు. వీళ్ళంతా పెద్దమను షులు..."

బిల్లు తెచ్చిచ్చాడు సేల్స్‌మేన్.

"కేష్ కౌంటర్లో బిల్లు పేచేస్తే ఆ పక్కనే డెలివరీ ఇస్తారు మేడం" అని వినయంగా చెప్పాడు.

"థాంక్యూ"

బిల్లు అందుకుని చూశాను.

ఏడువందలయాభై.

"ఇదేవిటి ఏడువందల యాభై వేశాడు? దాని రేటు తొమ్మిదొందలన్నావుకదా. థర్టీ పెర్సెంట్ డిస్కౌంటు ఇస్తే సిక్స్‌హండ్రెడ్ అవ్వాలంతే..."





"అవున్నిజమే" బిల్లు తీసుకుని చూసి, "ఇందులో కరెక్టుగానే రాశారు గాంధీ. నూటయాభై ఎస్టీఅట" అంది సహజ.

"దీనికి టాక్సేవిటి? "

"పెద్ద హోటల్స్‌లో వెయ్యరూ. అలాగే పెద్ద షాపుల్లో వేస్తారేమో"

"ఇంక డిస్కౌంటేం ఇచ్చినట్టూ. ఇది మోసంకదా? అడుగుతానుండు"

"పోనీలెద్దూ. అంతా కామ్‌గా పేచేసేస్తు న్నారుకదా"

"వాళ్లు గమనించివుండరు..."

"వద్దులే గాంధీ. మనం అడిగితే బాగోదు. మనల్ని తక్కువగా చూస్తారు"

"ఎందుకు చూస్తారు? "

"మీన్ మెంటాలిటీ వాళ్ళమనుకుం టారు..."

"అనుకుంటే అనుకోనీ. వాళ్ళేదో అనుకుం టారని మనంతట మనం ఎలా మోసగించ బడటానికి సిద్ధపడగలం చెప్పు"

సేల్స్‌మేన్ దగ్గరికెళ్ళి "ఎస్టీ అని రాశారు. అంటే ఏవిటి? " అడిగాను.

"సేల్స్‌టాక్స్ సార్"

"ట్వంటీఫైవ్ పెర్సెంట్ సేల్స్‌టాక్స్ ఎక్క డైనా వుందా? "

"ఏమోసార్... నాకు తెలీద్సార్"

"తెలీకుండా బిల్లెలా తయారుచేస్తు న్నావు? "

తలొంచేసుకున్నాడు.

"లీవిట్ గాంధీ..." ఎంబ్రాస్సింగా ఫీల వుతూ అంది సహజ.

ఆమె మాటల్ని పట్టించుకోకుండా మరో సేల్స్‌మేన్‌ని అడిగాను.

"ఎస్టీ అంటే సర్వీసు టాక్స్ సార్"

"ఇదేమైనా హోటలా సర్వీసుటాక్సు వెయ్యడానికి? అయినా ఇందులో మీరు చేస్తున్న సర్వీసేముంది? "

తల గోక్కున్నాడు తప్ప సమాధానమివ్వ లేదు.

తిన్నగా కేష్‌కౌంటర్ దగ్గరికెళ్ళాను.

"ఈ బిల్లులో ఎస్టీ అని వేశారేంటి?

డిస్కౌంటు ఇస్తున్నట్టే ఇచ్చి తిరిగి రాబట్టేసుకుంటున్నారా? " ఉచ్ఛ స్వరంతో అడిగాను.

కౌంటర్ వెనుక నిలబడ్డతను కంగారుపడుతూ ముందుకొచ్చి బిల్లు చూశాడు.

ఏదో ఆలోచించి ఏవో లెక్కలేసుకుని "సారీ సర్. కంప్యూటర్ మిస్టేక్. ఇప్పుడే రెక్టిఫై చేయిస్తాను" అన్నాడు బిల్లు తీసుకెళ్తూ.

"చూశావా. మనం అడక్కపోతే నూటయాభై నష్టపోయేవాళ్ళం" అన్నాను సహజతో.

"ఇంత పెద్ద షాపులో ఇలా చెయ్యడం..." అపనమ్మకంగా చూస్తూ అంది సహజ. ఇంత జరిగినా ఆమెకి నమ్మకం చిక్కడం లేదు.

"ఏంటి ఏం చేశారు? " బిల్లు చెల్లించి వస్తూ అడిగింది ఒకావిడ.

జరిగింది చెప్పాను.

తన బిల్లు చూసి "ఇందులోనూ ఎస్టీ వేశారు" అంది.

అందుకుని చూశాను. నిజమే.

"డిస్కౌంట్ సేల్‌లో కొన్నారా? "

అవునంటూ తలాడించింది.

"థర్టీ పెర్సంట్ డిస్కౌంటిచ్చి ట్వంటీఫైవ్ పెర్సంట్ టాక్స్ వడ్డిస్తున్నారు. ఇది పచ్చి మోసం. అడగండి డబ్బు వాపస్ ఇచ్చేస్తారు"

మాకు కరెక్టెడ్ బిల్ తెచ్చిచ్చినతనికి ఫిర్యాదు చేసిందామె.

అతడి మోము అప్రసన్నంగా ఎర్రగా మారిపోయింది.

"తర్వాత రండి చూస్తాను"

"మళ్ళీ రావడం ఎందుకు ఇప్పుడే చూడండి"

"డబ్బు చెల్లించేశాక వాపసివ్వడం కుదర్దు"

"ఎందుక్కుదర్దు? మళ్ళీ రావాలంటే మాకు పాతిక రూపాయలు ఖర్చవుంది"

"ఇప్పుడే రావక్కర్లేదు. ఆర్నెల్లలో ఎప్పుడైనా రండి. అప్పుడైనా డబ్బివ్వం. ఆ ఎమౌంట్‌కి మరో సరుకు ఇస్తాం"

"చేసిన మోసం చాలు. మీ సరుకులేం నాకొద్దు. నా డబ్బు నాకిప్పెయ్యండి"

"కుదర్దంటున్నానుకదా..."

గిరుక్కున వెనుదిరిగి వెళ్ళిపోతోంటే "ఏయ్ మిస్టర్" అని పిలిచాను.

"మీ బిల్లు కరక్టు చేశానుగా వెళ్ళండి" విసుగ్గా అన్నాడు.

"వాళ్ళతో మనకి గొడవెందుకు గాంధీ వెళ్ళిపోదాం పద. అంతా మనవంక వింతగా చూస్తున్నారు" నన్ను తోస్తూ అంది సహజ.

"అవతల అన్యాయం జరుగుతోంటే కళ్ళు మూసుకొంటావేమిటి? "

"చూడు మిస్టర్. అతిగా మాట్లాడొద్దు. మీ పని పూర్తయిందిగా. మర్యాదగా వెళ్ళిపోండి" ఒకరకంగా బెదిరిస్తూ అన్నాడు.

నలుగురైదుగురు సేల్స్‌మెన్ ఆయన పక్కకొచ్చి నిలబడ్డారు.

"ఆవిడ బిల్లు కరక్టు చెయ్యండి వెళ్తాను" దృఢస్వరంతో అన్నాను.

"అది మేమూ మేమూ చూసుకుంటాం. మధ్యలో అనవసరంగా కల్పించుకోవద్దు" హెచ్చరించాడు.

"పబ్లిక్‌గా దోచేస్తూ అనవసరమంటారేమిటీ? "

"ఎక్కువగా మాట్లాడుతున్నాడు బయటకి తోసెయ్యండి"

సేల్స్‌మెన్ నావైపు రాబోతే "స్టాప్ దేర్!" అంటూ గర్జించాను.

అంతా అదిరిపడ్డారు. ఏమిటంటూ తోసుకొచ్చారు కస్టమర్లు. పెదవి కొరుక్కుంటూ అసహనంతో మండిపోతూ అల్లరైపోతామేమోనని భయపడిపోయారు షాపువాళ్ళు.

ఆవిడ బిల్లు పట్టుకుని చూపుతూ, "ఈవిడ బిల్లులో అక్రమంగా ట్వెంటీఫైవ్ పెర్సంట్ సేల్స్‌టాక్స్ వేశారు. ఇదేమిటని ప్రశ్నిస్తే ఇంకోసారొచ్చి తీసుకెళ్ళమంటున్నారు. న్యాయం మీరే చెప్పండి" అన్నాను గొంతు హెచ్చించి.



చటుక్కున అంతా బిల్లులు తిరగేశారు.

మా బిల్లులో వేశారంటే మా బిల్లులో వేశారన్నారు.

"అంటే డిస్కౌంట్ అంటూ ఆకర్షించి మోసం చేస్తున్నారన్నమాట."

అంతా బిల్లులు చూపుతూ కౌంటర్ మీదికి ఎగబడ్డారు.

లోపల్నుంచి సూట్‌వాలా వచ్చాడు.

"ఆగండాగండి. కంప్యూటర్ మిస్టేక్‌వల్ల అలా జరిగింది. అన్ని బిల్లులూ సరిచేస్తాం. జరిగిన పొరపాటుకి మా స్టాఫ్ తరపున సారీ చెబుతున్నాను"

జనం శాంతించారు.

నావంక అభినందిస్తూ చూశారు.

సహజ గొప్పగా పొంగిపోతూ నా నడుం చుట్టూ చెయ్యివేసి తనకి హత్తుకుంటూ "యూ ఆర్ గ్రేట్. యూ ఆర్ రియల్ హీరో" అంది.

ఆమె సంబరం చూసేసరికి నాకెంతో ఆనందం కలిగింది.

"నేలవిడిచి సాము చెయ్యడం మానేస్తే, ప్రాక్టికల్‌గా ఆలోచించడం మొదలుపెడితే నువ్వు కూడా గ్రేట్‌వవుతావు సహజా"

ఆమె ముఖం వాడిపోయిందొక్కసారి. నా చెయ్యి వదిలేసి దూరంగా జరుగుతూ అంది "నా స్వప్నం అదే. నేను గ్రేట్‌నవ్వాలి. అన్నిటా గ్రేట్. అందరికన్నా గ్రేట్ డబ్బులో, హోదాలో, కీర్తిలో అన్నిటా గ్రేట్ సహజ ద గ్రేట్ కావాలి. అంతా నన్ను చూసి ఈర్ష్యపడే స్థాయికి చేరుకోవాలి. ఆరు నూరైనా నూరు ఆరైనా సరే ఆ స్థాయికి చేరుకుని తీరతాను. అందుకోసం ఏంచెయ్యడానికైనా సరే ఎలాంటి త్యాగం చెయ్యడానికైనా సరే నేను సిద్ధమే"

ఆమెలో దాగివున్న మరో మనిషి బయటకొచ్చేసరికి నా కళ్లనీ, చెవుల్నీ విశ్వసించలేక దిమ్మెరపోయి చూస్తూండిపోయాను.

★ ★ ★

"నీ గురించి రకరకాల వార్తలు వింటున్నాను. నువ్వింకా బుద్ధిగా చదువుకుంటున్నావనుకొంటోంటే వెధవ తిరుగుళ్లు తిరుగుతున్నావన్నమాట. నీకు బాగుపడాలనీ గొప్పవాడివి కావాలనీ లేదుట్రా? "

ఇంట్లో అడుగుపెడుతుంటే డాడీ అన్నయ్యని తీవ్ర స్వరంతో నిలదీస్తున్నారు.

అన్నయ్య తలొంచుకుని నిలబడితే అమ్మ నోట్లో చెంగు కుక్కుకుంది.

"ఏం జరిగింది డాడీ..."

"ఏమీ జరక్కూడదనే హెచ్చరిస్తున్నాను. ఇకనుంచైనా చెడు తిరుగుళ్లు మాని బుద్ధిగా చదువుకో. అవునూ ఆ సిఏ ఇంకెప్పటికి పూర్తవుతుందిరా? "

"ఈసారి పూర్తైపోతుంది"

"ప్రతీసారి అలాగే అంటున్నావు. ఈసారైనా గట్టెక్కితే మంచిదే మరి. అదేదో పూర్తయితే సాఫ్ట్‌వేర్ కంపెనీ స్టార్ట్ చేద్దురుగాని. చాలా మంచి బిజినెస్‌మెన్‌లకి చెప్పివుంచాన్లే. మీరంతా కలిసి ప్రారంభించొచ్చు ప్రాఫిట్స్ బావుంటున్నాయి. పబ్లిక్ ఇష్యూకొస్తే హాట్‌కేక్స్‌లా అమ్ముడవుతున్నాయి. ఈ బూమ్‌ని కేష్ చేసుకోగలిగితే చాలు ఇంక నిన్నెవరూ పట్టుకోలేరు. వింటున్నావా? "

బుద్ధిగా తల వూపాడు అన్నయ్య.

"అన్నయ్యకి పెళ్లిగాలి సోకినట్టుంది" బ్రదర్ పెళ్ళి వార్తని డాడీకి తెలీకుండా ఎక్కువకాలం దాచడం మంచిది కాదనుకుంటూ అన్నాను.

అన్నయ్యా అమ్మా కూడా తుళ్ళిపడ్డారు.

డాడీ కోప్పడతారేమోననుకున్నాం కాని మా అంచనాలని తల్లక్రిందులు చేస్తూ నవ్వేశారు. "నీకు పెళ్ళీడొచ్చిందని తెలుసులే మొదట చదువు పూర్తికానియ్యి..."

"డాడీ! అన్నయ్య ఒకమ్మాయిని..." బ్రదర్ గబుక్కున నా నోరు మూసేశాడు.





"ఆ సంగతులిప్పుడెందుకురా గాంధీ. తర్వాత మాట్లాడుకోవచ్చులే" అంది అమ్మ.

"డాడీ దగ్గర దాచటం ఎందుకు మమ్మీ"

"నాకు తెలుసురా. ప్రేమలూ పెళ్ళిళ్లూ తర్వాత. ముందు చదువు. తర్వాతే మిగిలినవి. తెల్సిందా? "

నేను అయోమయంగా చూస్తోంటే బుద్ధిమంతుళ్లా తలూపేడు అన్నయ్య.

"డాడీ! సులోచన అనీ..."

"సులోచనా లోచనా అన్నది తర్వాతని చెప్పానుకదా. ఆనంద్‌కే కాదు ఈ సమాధానం నీక్కూడా"

"నువ్విలా రారా నాయనా" అంటూ బ్రదర్ నన్ను లోపలికి లాక్కెళ్తోంటే "పోస్టు సార్" అంటూ వచ్చాడు పోస్ట్‌మాన్.

కవరు అందుకుని, "ఒరే గాంధీ. నీకేరా... ఎక్కడ్నుంచబ్బా. రైల్వే మినిస్ట్రీనించిరా. అక్కడ్నుంచి నీకు లెటర్రావడం ఏవిటీ..." అంటూ కవరు చించారు డాడీ.

లెటర్ చదివి, "రైల్వే సర్వీసు గురించి కంప్లయింట్ చేశావా? " అనడిగారు.

"అవును డాడీ. ఆమధ్య ఈసీకోసం వెళ్ళినప్పుడు ట్రెయిన్ బాగా లేటయిందికదా. అప్పుడు రైల్వేమంత్రికి కంప్లయింట్ చేశాను. ఏమన్నారూ? "

"అవాళ అంత అలస్యం ఎందుకయ్యిందో ఆరా తీస్తున్నారు. ఇలాంటివి జరక్కుండా చర్య తీసుకోమని ఆదేశించారట. జరిగిన అసౌకర్యానికి చింతిస్తూ సంఘటనని తన దృష్టికి తీసుకొచ్చినందుకు థాంక్స్ చెప్పార్రా"

డాడీ చేతుల్లోంచి లెటర్ తీసుకుని చూశాను.

ఫర్వాలేదు. కంప్లయింట్లని కూడా పరిశీలిస్తున్నారు. పట్టించుకుంటున్నారు. థాంక్స్ టు అఫీషియల్స్!

"ఏకంగా మంత్రిగారి దగ్గర్నుంచే ఉత్తరం వచ్చిందాండీ" మురిసిపోతూ అడిగింది అమ్మ.

"ఇలాంటివి మంత్రులు రాయరు. వారి పిఏలు రాస్తారు"

"ఏమైతేనేం. ఇకనుంచి రైళ్ళు వేళకి నడిస్తే అంతేచాలు" అంది అమ్మ.

"వీడేదో నాలుగుముక్కలు గీకేడని దేశంలోని రైళ్లన్నీ సక్రమంగా నడిచేస్తాయేవిటీ నీ పిచ్చిగానీ"

డాడీ మాటలకి బాధ కలిగింది. ముఖ్యంగా మాటల చివర మెరిసిన వ్యంగ్యపు నవ్వు.

"రైళ్లన్నీ సక్రమంగా నడిచేస్తాయన్న పేరాశ నాకు లేదు. కనీసం నా కంప్లయింట్ కొందర్లోనైనా కదలిక తీసుకొస్తే కొంత ప్రయత్నమైనా చేస్తే రైళ్ల నిర్వహణలో కొంతైనా మార్పు వచ్చితీరుతుందని నా నమ్మకం. జనమంతా తమ హక్కుల గురించి తెలుసుకుని స్పందిస్తే దేశం మరింత బావుంటుందని నా నిశ్చితాభిప్రాయం"

"ఐఏఎస్‌లకి ఇలాంటి పిటిషన్లు చదవటమే పననుకుంటున్నావా? ఇలాటి పిచ్చిపనులింకెప్పుడూ చెయ్యకు. ఇవాళ రేపు డ్యూటీ చెయ్యడమన్నా, దేశభక్తి అన్నా అర్థమేమిటో తెలుసా? తన గురించి తను పని చేస్తూ తనొక్కడూ బాగుపట్టం"

"నేనొప్పుకోను డాడీ. ఒక శేషన్, ఒక ఖైర్నర్, ఒక కిరణ్‌బేడి, ఒక పేర్వారం రాములు ఎన్ని మార్పులు తేగలిగారో, ఎందరిచేత ఎన్ని చెరువుల నీళ్ళు తాగించారో మనకి తెలుసు. మనదేశపు దౌర్భాగ్యమేమిటంటే అధికారులంతా తమ తమ అధికారాలని సక్రమంగా వినియోగించరు. అనధికారుల దయాదాక్షిణ్యం కోసం సాగిలపడుతుంటారంతే. లేకపోతే కనీసం ఒక యాభైమంది ఐఏఎస్‌లు రాజకీయనాయకుల ప్రలోభాలకి లొంగకుండా నిలబడితే ఇవాళ దేశమింత అధ్వాన్నస్థితిలో వుండేదికాదు"

"ఏవిట్రోయ్ గాంధీ. దేశం, జనం అంటూ ఉపన్యాలిస్తున్నావేంటి. ఏదైనా స్టూడెంట్ సంఘంలో లీడర్‌వయ్యావేంటి? నీ ఒంటిక

లాంటివి పడవుగాని బుద్ధిగా చదువుకో. స్టేట్స్‌కెళ్ళి కోట్లకి పడగెత్తే మార్గం గురించా లోచించు తప్ప దరిద్రుల గురించి కనీసం మాట్లాడొద్దు. తప్పట్ల కబుర్లు కావాల్సింది నాయకులకి తప్ప మనక్కాదు" అని ఆగి, "విన్నావుగా నీ కొడుక్కి గట్టిగా చెప్పు. నువ్వు చెబితేనే వీడికెక్కుతుంది" అనేసి ఆఫీసుకెళ్ళిపోయారు.

"అనవసర విషయాల్లో తలదూర్చటం మాని నీ బాగేవిటో నువ్వు చూసుకోరా గాంధీ పైకొస్తావు" నవ్వుతూ వెళ్ళిపోయాడు అన్నయ్య.

"వాళ్ళ మాటలకేంగాని నువ్వు చేసిన పని మంచిదిరా. ఎవరికోసం వాళ్ళు బతకడం గొప్పకాదు. ఇతరుల కోసం బతకడమే గొప్ప" అంది అమ్మ ఆప్యాయంగా నా భుజం తడుతూ.

"థాంక్యూ మమ్మీ. అన్నయ్య గురించి నువ్వైనా డాడీకి చెప్పు మమ్మీ..."

"నీ ముందరే కేకలేశారు కదరా. ఆయ నకీ తెలిసినట్టుంది. ఆవులించకుండానే పేగులు లెక్కపెట్టేస్తార్రా మీ డాడీ..."

ఫోన్ మోగింది. రిసీవర్ తీశాను "హలో..."

"గాంధీ? నేనురా కుమార్‌ని"

"ఏవిట్రా ఎనీథింగ్ అర్జంట్?"

"అర్జంటేరా. మన గోపాల్ లేడూ... మిమిక్రీ గోపాల్..."

"వాడికేవయ్యిందిరా?"

"వాడికేం కాలేదు. వాడి అన్నయ్య ఆత్మ హత్య చేసుకోబోయాడ్రా..."

"మైగాడ్! ఇప్పుడెలా వుందిరా?"

"డోంట్ వర్రీ. అతగాడు బతికిపోయాడు గనుకే చావొచ్చిపడింది"

"అదేవిట్రా"

"ఫోన్‌లో చెప్పకూడనిది. మనమంతా కలిసి ఎలాగైనా హెల్ప్ చెయ్యాల్రా. నువ్వు వెంటనే రాగలవా?"

"ఇప్పుడే బయల్దేరుతున్నాను..."

ఫోన్ పెట్టేసి, "మమ్మీ నా ఫ్రెండ్ వాళ్ళ న్నయ్యకి ఏదో ప్రోబ్లం వచ్చిందిట. వెళ్ళొ స్తాను" అన్నాను అమ్మతో.

"పాపం ఏవైందిట్రా..."

"కుమార్ చెప్పలేదు మమ్మీ..."

"భోంచేసి వెళ్ళరా..."

"త్వరగా వచ్చేస్తానుగా..."

బయటికి వెళ్ళబోతోంటే ఒకాయన లోప లికొచ్చాడు.

తెల్లపాంటూ, గోల్డ్‌కలర్ ఖద్దరు సిల్కు పొట్టి చేతుల చొక్కా, గోల్డ్‌ఫ్రేమ్ కళ్ళజోడు, గోల్డ్ స్ట్రాప్ వాచ్, ఎనిమిదివేళ్ళకి ఉంగ రాలూ, చేతిలో చిన్న బ్యాగు చూడగానే రైస్ మిల్లరో కాంట్రాక్టరో అన్పించేలా వున్నాడు.

"నాన్నగారున్నారా...?"

"మీరెవరు?"

"నాన్నగారితో పనుండొచ్చాను"

"లేరు. ఆఫీసుకెళ్ళారు. ఆయన్తో ఏమైనా మాట్లాడాలంటే ఆఫీసుకెళ్ళండి"

"నాన్నగారే అక్కర్లేదు. అమ్మగారున్నా నా పని పూర్తవుతుంది. అమ్మగారు న్నారా..."

"మా మమ్మీ ఆఫీసు విషయాలు మాట్లా డదు..."

"ఎవర్తోన్రా మాట్లాడుతున్నావూ..." అంటూ వచ్చింది అమ్మ.

"నమస్కారం అమ్మగారూ..."

"నమస్కారం... మీరు..."

"నా పేరు రామస్వామండి. మీరెరగరు గాని అయ్యగారికి బాగా కావాల్సినవాడ్ని లెండి. మీకిమ్మని అయ్యగారు పంపారు..."

"ఆయన పంపారా... రండి రండి కూర్చోండి"

తత్తరపడుతోన్న అమ్మవంక వింతగా చూశాను.

అతడెవరో, అతడి ద్వారా డాడీ ఏం పంపారోనని ఆశ్చర్యంగా చూస్తూ నిలబడి పోయాను.

"ఇంకా అలా నిలబడ్డావేంరా. ఎక్కడికో





అర్జంటుగా వెళ్ళాలన్నావుగా..." చెమట్లు కక్కుతూ అంది.

"వెళ్తాన్లేగాని డాడీ ఏం పంపారుట?"

"ఏవో కాగితాలయ్యుంటాయిలేరా. నేను తీసుకుంటాన్లే. నువ్వెళ్ళు..."

"కాగితాలొద్దన్నారు. అందుకని గోల్డ్ బిస్కెట్లు తెచ్చాను. ముంబాయి బిస్కెట్లు లెండి..." సోఫాలో కూర్చుని బ్యాగ్‌లోంచి చిన్నపాకెట్ తీస్తూ అన్నాడతడు.

"వుండండి వుండండి. కాఫీ తెస్తాను" నా వంక చూసి తడబడుతూ లోపలికెళ్ళిపోయింది అమ్మ.

అమ్మ ప్రవర్తన చాలా చిత్రంగా అన్పించింది.

తర్వాత కనుక్కోవచ్చు లెమ్మనుకుని బయటికి నడిచాను.

★ ★ ★

గోపాల్ వాళ్ళింటిముందు ఇరుగు పొరుగు మూగి దేన్ని గురించో తీవ్రంగా ఆలోచిస్తున్నారు. గుంపుచింపులు పడుతున్నారు.

కుమార్‌గాని, గోపాల్‌గాని కన్పిస్తారేమోనని చూశాను. ఎవ్వర్లేరు. ఒక నిమిషం నిరీక్షించి లోపలికెళ్లాను.

గోపాల్ వాళ్ళన్నయ్య హాల్లోని సోఫాలో కుంచించుకుపోయి కూర్చునున్నాడు. ఎవరెవరో వచ్చి జాలిగా చూసి ఒకటి రెండు ఓదార్పు మాటలు చెప్పి వెళ్తున్నారు.

అతడి పక్కకెళ్లి కూర్చున్నాను. నన్ను చూసి తలదించుకున్నాడు.

"మీరింత పిరికివారనుకోలేదు"

"చావుకి సిద్ధపడడానికి ధైర్యం కావాలి"

తుళ్ళిపడ్డాను సమాధానానికి. "చట్టప్రకారం ఆత్మహత్య నేరం"

"దానితో నాకు పనేవిటి? చట్టానికి నేనసలు నేవాడ్ని ఉన్నాననే తెలీదు?"

అతడి మానసికస్థితిని అంచనా వెయ్యడానికి యత్నిస్తూ అన్నాను. "మీరు అపోహపడుతున్నారు. చట్టం అందరికీ చుట్టమే. మనల్ని సరైన దారిలో నడిపిస్తూ మన హక్కుల్ని రక్షించేదే చట్టం. అతిక్రమిస్తే శిక్షించి దారిలో పెట్టేపని కూడా చట్టానిదే"

"పుస్తకాల కబుర్లు నేనూ అప్పుజెప్పగలను. బి.ఏ. ఫస్టు క్లాసులో పాసై అయిదేళ్ళయింది. ఇంతవరకూ చిన్న ఉద్యోగం కూడా దొరకలేదు. నేనెవరికీ అక్కర్లేదు. నాలాటి వాడికిక్కడ స్థానంలేదు"

"మీరు ఉద్యోగం కోసం డిగ్రీ చదివారా? విజ్ఞానం కోసం చదివారా?"

"ఉద్యోగం కోసమే" ఠపీమని జవాబిచ్చాడు.

"మీరే ఉద్యోగం చెయ్యగలరు చెప్పండి?"

"నేను దేనికీ పనికిరానా?"

"దేనికి పనికొస్తారో చెప్పండి"

అయోమయంగా చూశాడు.

"విజ్ఞానం వేరు, ఉపాధి వేరు. డిగ్రీలు మన విజ్ఞాన పరిధిని, అవగాహన శక్తిని విస్తరింపజేస్తాయి. అంతే తప్ప ఉపాధి నేర్పవు. అలాగని మన ముఖ్యమంత్రి అన్నట్టు హిస్టరీ, ఆర్ట్సు, లిటరేచరూ చదవడం మాని కంప్యూటర్లే నేర్చుకోమని చెప్పను. విజ్ఞానాభివృద్ధికి హిస్టరీ, సివిక్సూ సైన్సూ లిటరేచరూ ప్రతీదీ అవసరమే. ఆసక్తి వుంటే ఆయా సబ్జెక్టుల్లో ఉన్నత స్థాయికి చేరుకోవచ్చు లేదా ఉపాధికి కావాల్సిన అదనపు అర్హతల్నీ, నైపుణ్యాన్ని సమకూర్చుకోవచ్చు. అదీగాక పోతే వృత్తివిద్యల్ని అభ్యసించవచ్చు. అంతే తప్ప నేను డిగ్రీ చదివాను గనుక ప్రభుత్వం ఉద్యోగం ఇవ్వాలనడం, ఇవ్వలేదని నిందించడం మనకి తగదు..."

"ప్రభుత్వం గాకపోతే ఇంకెవరిస్తారు ఉద్యోగాలు? కోటి ఉద్యోగాలిస్తామనే కదా వాజ్‌పేయి అధికారంలో కొచ్చింది?"

"ఆయనే ఇప్పుడు కేంద్రప్రభుత్వరంగ సంస్థల్లో అధికంగా ఉద్యోగులున్నారని పది శాతంవరకూ స్వచ్ఛంద పదవీ విరమణ ద్వారా పంపించేస్తానంటున్నారు"

"ఈ పొలిటీషియన్లందర్నీ వరుసగా నిల బెట్టి మెషీన్‌గన్‌తో కాల్చిపారెయ్యాలి"

"అప్పుడు నీకు ఉద్యోగం ఇస్తారా?"

తలదించుకున్నాడు.

అందరి సానుభూతికోసం అర్రులు చాస్తోన్న అతడికిప్పుడు కావాల్సింది ఆత్మ విమర్శ, కార్యసాధక దీక్షానూ. అందుకు నా మాటలు పురిగొలుపుతాయని నాకు తెలుసు.

బయటికొచ్చేసరికి స్కూటర్ మీదొచ్చారు గోపాల్, కుమార్.

"వచ్చేవా గాంధీ. రారా...రా... బైకెక్కు" అన్నాడు కుమార్.

"సంగతేవిట్రా... అలా కంగారు పడుతున్నారేవిటి"

"ఇలారా చెబుతా"

ఓ పక్కకి తీసుకెళ్ళి అన్నాడు "పోలీసు కేసయ్యిందిరా"

"అవుతుంది... అందులో చిత్రమేముంది?"

"డబ్బు ఆశ చూపినా ఆ ఇన్‌స్పెక్టర్ లొంగలేదు. మీ డాడీ ద్వారా అతనికి చెప్పిస్తే పనవ్వొచ్చనుకుంటున్నాడు గోపాల్. ఆఫీసర్లకీ, ఆఫీసర్లకీ ఏవో లింకులుంటాయి కదా!"

"అసలా ఊహ రానివ్వడమే మంచిది కాదు. ప్రతీదీ సవ్యంగా, న్యాయంగా నడవట్లేదని ఆవేశపడే మనం లంచం ఇవ్వాలని చూడటం, వత్తిడి తేవాలని ఆలోచించడం మనకి తగదురా కుమార్"

"ఇటువంటప్పుడు కూడా అలా మాట్లాడతావేమిట్రా గాంధీ. కేసు ఫైలు చేస్తే శిక్ష పడుతుంది తెలుసా?"

"తప్పు చేసినందుకు శిక్ష అనుభవించక తప్పదు."

"శిక్ష అనుభవిస్తే గవర్నమెంట్ ఉద్యోగం రాదుట"

"అనుభవించనీ... అది మిగతా వారికి గుణపాఠం అవుతుంది. వాళ్ళింట్లోవాళ్ళు కూడా ఇకనుంచి మరింత కేర్ తీసుకుని మరింత కన్సర్న్ చూపిస్తార్లే. వాత్సల్యం ప్రవహించినచోట గుండెలు బీటలువారవు. ఆత్మహత్య ఆలోచన మొలకెత్తదు"

"చాలా దారుణంగా మాట్లాడుతున్నావు"

"అది నా తప్పు కాదు నీ దృక్పథం తప్పు. కోర్టులు శిక్ష ఎందుకు విధిస్తాయి చెప్పు? నేరస్తులు పశ్చాత్తాపపడటానికి, ఇతరులకదో హెచ్చరిక కావడానికి. పది రోజులో పది హేను రోజులో జైలు శిక్ష అనుభవించనీ. అతడికదో గుణపాఠం అవుతుంది"

నావంక వెర్రిగా చూశాడు కుమార్.

"అసలు జైలుశిక్ష అంటే ఏమిటో తెలుసా? ఒకరి స్వేచ్ఛని హరించడం. అంటే తనిష్టమొచ్చినట్లు బతికే హక్కుని, మసిలే హక్కుని హరించి అతడి పరిధిని నియంత్రించడం అంతే. అంటే స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు ఎంత గొప్పవో నువ్వే ఆలోచించు. కొద్దికాలం వాటిని కోల్పోయిన వారికే వాటి విలువ బాగా తెలుస్తుంది. అనుభవించనీ... అది అతడి జీవిత గమనాన్ని ఖచ్చితంగా మార్చి తీరుతుందని ఘంటాపథంగా చెప్పగలను"

"ఏవంటున్నాడ్రా" అంటూ వచ్చాడు గోపాల్.

"వీడితో లాభంలేదురా. చేతులు కాల్తున్నాయిరా అంటే వేదాంతం చెబుతున్నాడు. కార్పోరేటర్ యాదవ్ వచ్చాడేమో చూద్దాం పద. లేదంటే ఎమ్మెల్యేని కలుద్దాం"

ఇద్దరూ వెళ్ళిపోయారు.

ఒంటరిగా మిగిలిపోయాను.

★ ★ ★

నూతన సంవత్సరమే కాదు కొత్త శతాబ్ది నవ్యసహస్రాబ్ది ఆరంభం కానుంది.

ఎటు చూసినా కోలాహలమే. పండుగ వాతావరణమే.

ముఖ్యంగా గ్రీటింగ్ కార్డుల షాపులనిండా ఇసుకవేస్తే రాలనంత జనం.

కాలేజీలోని స్టూడెంట్సందరిచేతుల్లోనూ




కట్టలున్నాయి. ప్రొఫెసర్లకీ, లెక్చరర్లకీ ఇస్తూ సహవిద్యార్థులకి గ్రీటింగ్స్ చెబుతూ ఉత్సాహంగా తిరుగుతున్నారంతా.

క్లాసులేమీ జరగటంలేదు. అయినా లెక్చరర్ వస్తారేమోనని క్లాసులో కూర్చున్నాను.

"హాయ్ గాంధీ. హుస్సేన్ సాగర్లోని బుద్ధుడిలా ఒంటరిగా తపస్సు చేస్తున్నావేంటి" అంటూ వచ్చింది సహజ.

"దానికేంలే గాని ఇవాళ తళతళా మెరిసి పోతున్నావేంటి సంగతి" ఆమె ధరించిన జీన్సు పాంటూ, బాగీ షర్టూచూస్తూ అన్నాను. ఆ డ్రెస్సులో ఆమె చాలా బాగుంది. ఆమె నుంచి వస్తోన్న సుగంధ పరిమళం ఎంతో ఆహ్లాదంగా వుంది.

"థాంక్ గాడ్. ఇన్నాళ్ళకి నేనూ, నా అందం నీ కళ్ళల్లో పడ్డాం"

"అంటే ఇన్నాళ్ళూ నీ అందాన్ని నేను గమనించలేదంటావు"

"ఒక్క మెచ్చుకోలు కవిత కూడా రాయలేదంటే చూడలేదనే కదా అర్థం. విష్యూ హేపీహేపీ న్యూ ఇయర్ అండ్ న్యూ మిలీనియం" చెయ్యి పట్టుకుని ఊపేస్తూ ఒక పెద్ద గ్రీటింగు కార్డు చేతిలో పెట్టింది.

"థాంక్యూ. సేమ్ టూయూ..."

"అంత కూల్‌గా చెబుతావేంటి"

"ఇంకెలా చెప్పాలి? "

"కిస్ ఇచ్చి హాట్‌గా చెబుతావని ఎక్స్‌పెక్ట్ చేశాను"

"ఇది క్లాస్‌రూం..."

"నేనేం బెడ్రూం అనుకోవడంలేదులే మహానుభావా. ఎవరూ లేనప్పుడైనా ముద్దూ ముచ్చటా... అసలు చాటుమాటు ముద్దుల్లోనే మజా ఎక్కువంట"

గ్రీటింగ్ కార్డు తెరిచాను.

"ఐ లవ్యూ ఐ లవ్యూ ఐ లవ్యూ..." అని వినిపించింది.

"ఓహ్... చాలా బావుంది..." అంటూ మూసి మళ్ళీ తెరిచాను. మళ్ళీ ఐ లవ్యూ అంది మూడుసార్లు.

"థాంక్యూ సహజా. ఇది చాలా ఖరీదేమో..."

"ప్రేమ మనసుకి ఖరీదు కట్టే షరాబులే డోయ్"

"ఒప్పుకుంటున్నాను. ఈ కాస్ట్‌లీ గిఫ్టుల్ని చూస్తోంటే న్యూ ఇయర్స్ డే, వాలంటైన్స్ డే, మదర్స్ డే అంటూ విపరీత ప్రచారం చెయ్యడం, ఇలాటివి అమ్ముకోడానికి వేసిన వ్యాపారపుటెత్తు అన్పిస్తోంది"

"నువ్వన్నీ విపరీతంగా ఆలోచిస్తావు గాంధీ. న్యూ ఇయర్ డే నాడు గ్రీటింగు చెప్పడంలో వ్యాపారమేముంది చెప్పు? పైగా మదర్స్‌డేలాంటి వాటివల్ల మదర్‌కెంతో గుర్తింపూ, గౌరవం ఇచ్చినట్టు కదా. దానికింకా ఇంకా ప్రచారం జరగాలంటాను"

"అది జరగాల్సింది ఇక్కడ కాదు పాశ్చాత్యదేశాల్లో. రెక్కలు రాగానే తల్లినీ తండ్రినీ మరచి వేరే గూడు వెదుక్కుని వెళ్ళిపోయే చోట. ఆ రకంగానైనా ఏడాదికోరోజున తల్లినీ, తండ్రినీ గుర్తుంచుకుంటారని. అలాటి అవసరం, అగత్యం మనకి లేదు"

"ఏం ఎందుకు లేదు? "

"మాతృదేవోభవ అంటూ ప్రథమ వందనం తల్లికి అర్పించే ఉత్కృష్ట సంస్కృతి గల దేశం మనది గనుక!"

"సరేలే. ప్రతీదాన్లోనూ మనమే గొప్ప, మన దేశమే గొప్ప అంటావు. ఒక్కసారి నువ్వు కళ్ళు తెరచి ప్రపంచంలో వస్తోన్న మార్పుల్ని చూస్తే బావుణ్ణు. ఆ సోదికేం గాని రేపటి మన ప్రోగ్రాం ఏమిటి డియర్? "

"మన ప్రోగ్రాం? "

"రేపు థర్టీఫస్టే కదా. పైగా సండే. కాలేజీ లేదు గనుక మళ్ళీ కలుసుకుంటామో లేదో. రేపటి ప్రోగ్రాం ఇప్పుడే ఫైనలైజ్ చేసుకుందాం"

"ఓ.కే. ఏదైనా చక్కని ఆహ్లాదకరమైన ప్రోగ్రాం వేసుకుందాంలే"

"ఒకటీ రెండూ కాదు బోల్డన్ని ప్రోగ్రాము

లున్నాయి. బఫేలూ డాన్సులూ గజళ్లూ... ఓహ్! ఎంత సంబరమో సంరంభమో చెప్ప లేను. రామోజీ ఫిల్మ్‌సిటీలో స్పెషల్ న్యూ ఇయర్ ప్రోగ్రాం వుంది. హోటల్ గోల్కొం డలో మిడ్‌నైట్ బఫే వుంది. సెంట్రల్ కోర్టు హోటల్లో డైస్ అండ్ డాన్స్ మిలీ నియం సెలబ్రేషన్లు వున్నాయి. స్పెషల్ న్యూ ఇయర్ రూం పాకేజి కూడా వుంది. రాత్రికక్కడే వుండొచ్చు కంట్రీ క్లబ్‌లో మమతా కులకర్ణి డ్యాన్స్ ప్రోగ్రాం వుంది. ఇంకా... ఆ... ట్రెజర్ ఐలెండ్‌లో లక్కీ ఆలీ, సునీతారావుల చక్కని ప్రోగ్రాం వుంది. ప్రతీదీ థ్రిల్లింగ్ ప్రోగ్రామే డియర్. నువ్వేది ఓకే చేసినా సరే నాకు ఓకే" ఉత్సా హంగా అంది.

"అవన్నీ ఖరీదైన ప్రోగ్రాములు. అంత ఖర్చు అనవసరం సహజా"

ఛెళ్లున చెంపమీద కొట్టినట్టుగా చూసింది.

"మనస్ఫూర్తిగానే అంటున్నాను. అదంతా దండుగమారి వ్యవహారం. బిజినెస్‌కోసం వ్యాపార వర్గాలు చేసే గిమ్మిక్స్‌లో మనం పడటం మంచిదికాదు"

నన్నో అనాగరికుడిగా చూసి చూసి అంది "అలా డల్‌గా మాట్లాడతావేంటి గాంధీ. అందరూ ఎన్నెన్ని ప్రోగ్రాములు వేసుకుంటు న్నారో తెలుసా? న్యూ ఇయర్ డే సెలబ్రే షన్స్ గొప్పగా మరుపురాని విధంగా సెల బ్రేట్ చేసుకోవాలని పోటీపడుతున్నారు తెలుసా? "

"అలా అని మన సభ్యత 'సంస్కృతి' సంప్రదాయం మరచిపోకూడదు సహజా.

పాశ్చాత్య మోజులో కొట్టుకుపోకూడదు. ఇంగ్లీషు సంవత్సరాది ఆరంభ సమయమై నంతమాత్రాన స్టార్ హోటళ్ళలో క్లబ్బులలో పాశ్చాత్య సంగీతపు హోరులో ఊగిపోనక్క ర్లేదు. అశ్లీల నృత్యాల జోరుతో జతకలపా ల్సిన పనిలేదు..."

"మరేం చెయ్యాలిట? మడిగట్టుకుని ముట్లుడిగిన ముసలమ్మలా ఇంట్లో కూర్చో వాలా? "

"అసహ్యంగా మాట్లాడకు ట్రై టు అండర్ స్టాండ్ సహజా. ప్రతి ఏడాదీ సిటీలో ఏం జరుగుతోందీ నీకు తెలీదూ? యువత అర్ధ రాత్రి రోడ్లపైకి వచ్చి వెర్రి గంతులు వేస్తు న్నారు. కేరింతలు కొడుతూ "హేపీ న్యూ ఇయర్" అంటూ నినాదాలు చేస్తూ నానా హంగామా చేస్తూ ట్రాఫిక్‌కిసైతం అడ్డొస్తు న్నారు. అసలు వాళ్ళు ఎవరికి న్యూ ఇయర్ చెబుతున్నారో తెలీకుండా రోడ్లపై ఒళ్ళూ ఇళ్ళూ మరచి కొందరు యువతీయువకులు దొర్లటం విస్తరిస్తోన్న విష సంస్కృతికి పరా కాష్ట కదూ? "

"నేనేం తాగి రోడ్లమీద దొర్లుదామనడం లేదు. స్టార్ హోటల్లోనో, క్లబ్బులోనో న్యూ ఇయర్ ఈవ్‌ని ఆనందంగా గడుపుదామం టున్నాను. దానికింత పెద్ద ఉపన్యాసం ఇస్తావనుకోలేదు" నిస్పృహగా అంది.

"క్లబ్బులో డిస్కో నృత్యాల పేరుతో చేసే వెకిలి చేష్టలు వెర్రి తలలు వేస్తున్న సంగతి నీకు తెలీదూ? అందులో మనం కూడా ఓ భాగమవుదామంటావేమిటి చెప్పు? " కించిత్తు అసహనంగానే అన్నాను.

"మరీ స్పెసిమన్లా ప్రవర్తించకు. న్యూ మిలీనియం డే నాడైనా మజాగా గడపక పోతే ఇంకెందుకు లైఫ్? సరదాగా సంబ రంగా డాన్స్ చేస్తూ తింటూ, తాగుతూ ఊగి తూగి పోవాలిగాని, ఋషీశ్వరుడిలా ముక్కు మూసుకోవడం మన యూత్‌కే ఇన్సల్ట్!" మొఖం ఎర్రబడుతూంటే నిరసన స్వరంతో అంది.

"డిప్రెస్సవ్వద్దు. సరదాగా స్పెండ్ చేద్దాం. శిల్పారామం వెళ్ళి శాస్త్రీయనృత్యం చూద్దాం. లేదా నెక్లెస్ రోడ్‌లో ఆహ్లాదకర సంగీతాస్వా దన చేద్దాం"

"ఆపైన హుస్సేన్ సాగర్లోకి జంప్‌చేద్దాం"

చటుక్కున లేచి వేగంగా నిష్క్రమిం చింది.

"సహజా...సహజా!" పిలుస్తూ ఆమె





వెనుక క్లాస్‌రూంలోంచి బయటికొచ్చాను.

అప్పటికే ఆమె చాలా దూరం వెళ్ళిపోయింది.

ఆమెనే చూస్తూ పెదవి కొరుక్కొంటోంటే మురారి ఆమెని ఆపాడు.

గ్రీటింగ్ కార్డు ఇచ్చి నవ్వుతూ ఏదో చెప్పేడు. ఏం చెప్పేడో ఏమో ఛెళ్ళున అతడి చెంపమీద కొట్టి విసవిసా వెళ్ళిపోయింది సహజ.

మురారే కాదు ఆ దృశ్యాన్ని చూసిన కేంపస్‌లోని స్టూడెంట్సుందరం కూడా తుళ్ళిపడ్డాం. విస్తుబోయాం.

గబగబా వెళ్ళి "ఏవన్నావురా" అనడిగాను మురారిని.

"మిలీనియం హంగామాకి కపుల్స్ టిక్కెట్ వుంది ఎంజాయ్ చేద్దామా అన్నానంతే... తనింకేదో ప్రోగ్రాం వేసుకుందని చెప్పొచ్చు కదా. అందర్లోనూ పట్టుకుని నన్ను కొడుతుందా ఆ బిచ్?" ఆవేశంతో ఊగిపోతున్నాడు.

"ఆమె చేసింది తప్పే. అలా అని తోటి విద్యార్థిని పట్టుకుని అలా మాట్లాట్టం ఏం బావోలేదు"

"హు..." తలెగరేసి వెళ్ళిపోయాడు.

సహజ గురించే ఆలోచిస్తూ నిలబడిపోయాను.

"హేపీ న్యూ ఇయర్" అంటూ ఒక గులాబీ అందిచ్చింది శిరీష.

"థాంక్యూ థాంక్యూ వెరీమచ్. నైస్ వే టు విష్. నీ ఐడియా అమోఘం శిరీషా..."

"థాంక్యూ... గాంధీ మెచ్చుకున్నాడంటే హోల్ వరల్డ్ మెచ్చుకున్నట్టే" గులాబీ విచ్చినట్టు నవ్వుతూ అంది.

"యూ మీన్... నేనెవర్నీ ఎప్పుడూ మెచ్చుకోననా?" నవ్వుతూనే అడిగాను.

"అహహ... అపార్థం చేసుకోకు మరి. మోడ్రన్ ట్రెండూ, మోడ్రన్ థింకింగూ నీకు నచ్చవు. నచ్చని దాన్ని మొహమాటానికైనా మెచ్చుకోవు. అందుకనన్నాను"

"మోడ్రన్ అయినంత మాత్రాన నచ్చకపో

వడ మంటూ లేద

గోల్డూ అనను. మనిషి,

ప్రతీదీ నా కిష్టమే"

"ఓహ్! యూ ఆర్ గ్ర

ధన తొణికిసలాడుతోంటే

"లేదు లేదు. జస్ట్ ఓ

దట్సాల్"

రెండడుగులేశానో లేదో "గాంధీ" అంటూ పిలిచింది శిరీష.

ఆ పిలుపులోని ఆర్తికి ఆశ్చర్యబోతూ వెనుదిరిగాను.

"ఐ లవ్యూ"

దిమ్మెరబోయాను. ఎంతో ఫ్రెండ్లీగా వుండే ఆమె...!

నా చెవుల్నీ, కళ్ళనీ నమ్మలేనట్లుగా చూశాను.

"ఇక నుంచి నీకు నచ్చేట్లు, నువ్వు మెచ్చేట్లు వుంటాను"

మరో మాటకవకాశమివ్వకుండా వెళ్ళిపోయిందామె.

ఎంత చిత్రం!

నేనిష్టపడుతున్న సహజకి నా పద్ధతులు నచ్చటంలేదు.

నన్నిష్టపడుతోన్న శిరీషకి నా పద్ధతులు నచ్చుతున్నాయి.

సహజ ఆకాంక్షలకనుగుణంగా నేను మారలేకపోతున్నాను.

నా అభిరుచులకనుగుణంగా మారతానంటోంది శిరీష.

ఎవరు గొప్ప?

గొప్ప సంగతలా వుంచితే సహజ నాకిష్టం.

ఆమె నవ్వు ఇష్టం. నడక ఇష్టం. రూపం ఇష్టం. ముఖ్యంగా విశాలమైన ఆమె కళ్ళు మరీమరీ ఇష్టం. ఆమె కళ్ళల్లోకి చూస్తూ యుగాలు గడిపెయ్యమన్నా గడిపెయ్యగలనేమో!

ఏమైనా సహజ కోరికని తిరస్కరించి

...డా నా వ్యూ పాయింటు చెప్పి ...ప్ప వుండాల్సిందేమో!

గిల్టీ ఫీలింగు వెంటాడుతోంటే సహజకి ఫోన్ చేశాను.

నా గొంతు వింటూనే ఫోన్ కట్ చేసింది.



సహజని వెతుక్కుంటూ ఆమె ఉంటోన్న హాస్టల్ కెళ్ళాను.

హాస్టల్ ముందున్న గార్డెన్లోంచి నవ్వులు విన్పించి అటు చూశాను.

సహజ, ఆమె ఫ్రెండ్సూ.

నిమిషకాలం తటపటాయించి వారి దగ్గరికి నడిచాను.

సహజ ఫ్రెండ్స్ లేచి మందహాసంతో నన్నాహ్వానించారు.

పచ్చికలో చతికిలబడుతూ "నవ్వులు పువ్వులై పూస్తున్నాయి. ఏవిటి విశేషం? " అన్నాను చిన్నగా నవ్వుతూ.

"సహజ ఓ జోక్ చెప్పింది"

"ఏంటో అది" సహజ వంక చూస్తూ అన్నాను. ఆమె ముఖం తిప్పేసుకుంది.

"జోక్ అంటే జోక్ కాదుగాని అలాటిదే లెండి. సహజ వాళ్ళ ఊళ్ళో ఒకతనున్నాట్ట. అతను ఏదైనా చెప్పాలనుకున్నప్పుడు ఇంట్లోకెళ్ళి కుండ తెచ్చి దాన్ని బద్దలుగొడతాట్ట. ఇదేంటయ్యా అనడిగితే నేనెప్పుడూ కుండ బద్దలుగొట్టి మరీ చెబుతాను అంటాట్ట"

"మొత్తానికి భలే వాడేనే"

నాతోబాటు అంతా నవ్వేరు సహజ తప్ప.

"మీరు కన్పిస్తే చాలు జలపాతంలా దూకి ఉక్కిరిబిక్కిరి చేసేసే సహజ ఇవాళ మూగ వీణ అయిపోయిందేవిటన్సార్" ఒక అమ్మాయి అడిగింది.

"ఆ సంగతి ఆమెనే అడిగితే మంచిది. కారణం ఏమిటో మీతోబాటు నాకూ తెలుస్తుంది"

"హు... సరిపోయింది. మీ అలకల మధ్యలో తలదూరిస్తే మా తల బొప్పి కడుతుందేమో" ఇంకో అమ్మాయి అంది.

"నిన్ను వెతుక్కుంటూ వచ్చేక కూడా అలా మూడీగా వుండటం బావోలేదు సహజా" మరో అమ్మాయి అంది సహజతో.

మనస్సు అర్థంచేసుకోలేని వాళ్ళతో మనకేంటిగాని పదండే" అంటూ సహజ లేస్తోంటే కూర్చోబెట్టిందామె ఫ్రెండ్.

"కొత్త సంవత్సరంలో అడుగిడబోతున్న వేళ పాత కోపాలన్నీ మర్చిపోవాలి" అందామె.

"ఆ సంగతి ఆ బుద్ధుడికి చెప్పు"

సహజ మాటలకి "నాకేం కోపం లేదు" అన్నాను.

"కోపం గురించి కాదు. న్యూ ఇయర్ కి సంబరాల్లో పాలుపంచుకోవడం గురించి"

"నా అభిప్రాయాలు నీకు తెలుసు కదా"

"ఆ తెలుసు... తెలుసు. పాత చింతకాయ పచ్చడి భావాలూ, ఉసిరికాయపచ్చడి అభిప్రాయాలూ! మీకూ మీ అభిప్రాయాలకీ ఓ నమస్కారం"

"అది కాదు సహజా..."

"ప్లీజ్. ఇంకేం చెప్పొద్దు. నా మూడ్ ఇంకా పాడుజెయ్యొద్దు"

విసురుగా లేచి వెళ్ళబోతోంటే బలవం





తాన కూర్చోబెట్టారామె. స్నేహితులు.

మొహం ఎర్రబడగా మౌనంగా వుండిపోయాను.

"మీ కన్నీ తెలుసు. మీకు చెప్పేంత వాళ్ళం కాదుగాని సహజ మీతో కలిసి సరదాగా స్పెండ్ చెయ్యాలని కోరుకుంటున్నప్పుడు దాన్ని మన్నించడం ప్రేమికుడిగా మీ బాధ్యత"

"ఇతర విషయాలైతే వెంటనే అంగీకరించేవాడ్ని. కాని న్యూ ఇయర్ డే సెలబ్రేషన్స్ పేరిట సంస్కృతికి భిన్నంగా..."

నా మాట పూర్తికాకుండానే "నేన్చెప్పలేదూ. అతగాడికి ప్రేయసి ఆనందంకన్నా తన అభిప్రాయాలే ముఖ్యం. వాటితోనే ఊరేగనీ" అంటూ లేచి హాస్టల్లోకెళ్ళిపోయింది.

హతాశుడ్నయ్యాను. అందరి ముందూ ఆమె అంత రూడ్‌గా ప్రవర్తించడం జీర్ణించుకోలేకపోతున్నాను.

"సహజ బాగా హర్ట్ అయ్యిందండీ. ఈసారికి ప్లీజ్ రాజీపడిపోండి సార్" అర్థించిందోఅమ్మాయి.

"అది కాదు. ఈ సంబరాలన్నీ వ్యాపార విష సంస్కృతి పన్నిన రంగురంగుల దారాల ఉచ్చులు"

"సరే ఏదోటి. సహజ మాట మన్నించి తీసుకెళ్ళండి. అన్నీ చూపించేక తనకర్థమయ్యేట్లు మీ అభిప్రాయాల్ని విడమరచి చెప్పండి. తన అపోహలూ తొలగుతాయి. మీ భావాన్నీ తను అర్థంచేసుకోగలుగుతుంది. ఏమంటారు? "

ఆమె మాటలు సబబుగానే అన్పించాయి. కొందరికి మాటల్లోకన్నా క్రియా రూపంలో చెబితేనే బాగా అర్థమవుతుంది.

లేకపోతే ఇలాటి భేదాభిప్రాయాలే చిలికి చిలికి గాలివానైతే ప్రేమవృక్షం నిలువునా కూలినా కూలిపోవచ్చు

"ఓ. కే. సహజ ఏమంటుందో కనుక్కోండి"

"తనని ఒప్పించి పంపించే బాధ్యత మాది. తను మెచ్చేలా చక్కని ప్రోగ్రాం వెయ్యండి"

"అది కూడా తనే వేస్తే బావుంటుందేమో"

"వెరీగుడ్. మీరుచాలా మంచి వారు. తను వెరీ లక్కీ. తీసుకొస్తానుండండి" అంటూ హాస్టల్లోకెళ్ళిందో అమ్మాయి.

సహజ, ఆమె ఫ్రెండూ వచ్చారు.

సహజ మబ్బులు తొలగిన నిండు జాబిలిలా వెలిగిపోతోంది. తన పంతం నెగ్గిందనో లేక మిత్రురాళ్ళముందు తన గొప్ప పెరిగిందనో మరి!

"థాంక్యూ డియర్. నువ్వు తప్పకుండా నాదారి కొస్తావని నాకు తెలుసు. నువ్వెప్పటికీ నా వాడివే" అంది నా చేయిపట్టుకుని ఊపేస్తూ.

"ఎంత వారలైనా కాంతాదాసులే" అని నవ్విందో అమ్మాయి.

"ప్రోగ్రాం ఏమిటో చెప్పు" అడిగాను.

"నీ ఇష్టం. నువ్వెక్కడికంటే అక్కడికి రావడానికి నేను రెడీ"

"ఇది నిన్ను తృప్తిపరచడానికి వేసిన ప్రోగ్రాంగనక సెలక్షన్ కూడా నువ్వే చేస్తే బావుంటుంది"

ఓ క్లబ్బు పేరు చెప్పి "రెండు టిక్కెట్స్ బుక్ చేశాను" అంది సహజ.

వెంటనే "హమ్మో. గడుగ్గాయివేనే. ముగ్గులు ముందే పెట్టేసి మధ్యన మాచేత బతిమాలించుకున్నావా తల్లీ" అందో ఫ్రెండ్.

"గాంధీ మనస్సు నాకు తెలుసు" పెదాల మీద విజయరేఖ మెరుస్తోంటే అంది సహజ.

"అది కాస్ట్‌లీ క్లబ్ సహజా..."

"మనమూ కాస్ట్‌లీ మనుషులమేగాని ఆర్గ్యుమెంట్లు బంద్"

"ఓకే యాజ్ యూ విష్"

ప్రేమకోసం కొన్ని సర్దుబాట్లు తప్పవనుకుంటా.

"థాంక్యూ డియర్ థాంక్యూ వెరీమచ్" నా

చేతిని ముద్దిడుతూ అంది సహజ.

★ ★ ★

మహానగరం తళుకుబెళుకు లొలకబోస్తూ దేదీప్యమానంగా వెలిగిపోతోంది.

ఎటు చూసినా కోలాహలం, ఆడంబరం. వ్యాపార వర్గాల జిత్తులు. ఈ ఒక్కరోజూ ఆనందం జుర్రుకుంటే చాలనుకుంటూ ఎగబడుతున్న జనం. ఇది అంబరాన్నంటే సంబరాల పండగనుకుంటూ రెచ్చిపోతున్న యువత.

బైక్ వెనుక నన్ను హత్తుకుని కూర్చుని ఏదేదో చెప్పేస్తోంది సహజ. ఆమె మాటలేవీ నా చెవిలో దూరటంలేదు.

ఏదో తప్పుచేస్తున్నానన్న భావన పుండులా సలుపుతోంది.

ఆమె బ్లాక్ మెయిలింగ్‌లాంటి అలకకి లొంగకుండా వుండాల్సిందేమోనని మథనగా వుంది. నిజంగా ఇది నా ప్రవృత్తికి వ్యతిరేకంగా చేస్తున్న పనే.

"ఏయ్ ఏ అగాథంలోకి దొర్లిపోయావు? " నడుంమీద గిచ్చుతూ అంది.

"ఆ క్లబ్బు గబ్బులో కొట్టుకుపోయేకన్నా హుస్సేన్ సాగర్లో బోటుషికారు కెళ్తే బావుంటుందేమో సహజా"

"ఇంకోసారలా మాట్లాడేవంటే బండి మీంచి దూకేస్తానంతే"

"వద్దొద్దు. అంత పని చెయ్యకు నీకెంతైనా పుణ్యం వుంటుందిగాని"

"అలా దారికిరా. నా డ్రెస్ ఎలా వుంది గాంధీ? "

"టైట్స్... అందునా బ్లాక్ కలర్... చూడటానికి ఇబ్బందిగా వుంది"

"ఇప్పుడిది ఫాషన్ తెలుసా. నన్నీ డ్రెస్‌లో చూసి రెచ్చిపోతావనుకొంటోంటే అలా ముడుచుకుపోతున్నావేంటి? రక్తం వేడెక్కి బుసలుకొట్టాల్సిన వయస్సు మనది"

"అదే నా భయం కూడా"

"నన్నెవరైనా ఎత్తుకుపోతారనా? " కిలకిలా నవ్వి అంది మళ్ళీ "నేన్నీ గరల్‌ఫ్రెండ్‌నని తెలిసినా సరే నేనంటే పడి చస్తున్నామంటూ రోజుకి టెన్ లెటర్స్ రాస్తున్నారు తెలుసా? "

"నీ బాహ్య సౌందర్యాకర్షణ వాళ్లచేతా పని చేయిస్తోంది"

"నేను వాళ్ళ కళ్ళకి మిస్ ఇండియాలా కన్పిస్తున్నానేమో. నేను బ్యూటీ కాంటెస్ట్‌కెళ్తే ఎలా వుంటుంది డియర్"

"అందాన్ని సొమ్ముచేసుకోవాలనుకునే వాళ్ళకే ఆ రంగం బావుంటుంది"

"మరీ దారుణంగా మాట్లాడుతున్నావు"

"గత అయిదారేళ్ళనుంచీ మనదేశపు అమ్మాయిలని మిస్ యూనివర్స్‌లుగా, మిస్ వరల్డ్‌లుగా ఎందుకు ఎన్నికచేస్తున్నారో తెలుసా? ఇదివరకు లేని అందగత్తెలు ఇప్పుడు పుట్టుకొచ్చారని కాదు. రకరకాల సౌందర్యోపకరణాలకీ, పాశ్చాత్యప్రోడక్ట్స్‌కీ మనదేశం చక్కని మార్కెట్ అని మల్టీనేషన్ కంపెనీలు గుర్తించాయి గనుక"

"నీకో నమస్కారం బాబూ. కదిపితే చాలు ఏదో కథ చెబుతావు" నిష్టూరంగా అంది సహజ.

"కథ కాదు కఠిన సత్యం"

"ఏదోటిగాని వదిలేసెయ్. హేపీగా గడపాల్సిన సమయాన్ని పాడుచెయ్యొద్దు ప్లీజ్"

క్లబ్బు బయటా లోపలా భూతల స్వర్గమా అన్పించేలా ఏర్పాట్లు చేశారు.

రంగురంగుల విద్యుద్దీపాలు, రకరకాల పూల మొక్కలు, ప్రత్యేకమైన లైటు స్తంభాలు, రంగుల లైటింగ్ ఫోకస్ చేయబడిన స్టేజి, ఎన్నో రకాల స్టాల్స్, నోరూరించే ఆహారపదార్థాలు, హాట్ డ్రింక్స్ సంగీత బృందాలు, డాన్సర్లు...!

ఇహ క్లబ్బు కొచ్చిన వారిలో అత్యధికులు యువతీయువకులూ మిగతా వారు వయస్సు మళ్ళిన వారూనూ. అంతా హైక్లాసూ అప్పర్ మిడిల్ క్లాసు వాళ్లే అని చెప్పాలి. లేకపోతే ఆ "ఖరీదు"ని భరించడం సామాన్యులవల్ల కాదు.





అంతా వింత వింత డ్రెస్సుల్లో మెరిసిపో తున్నారు. ఆనందోద్వేగంతో వూగిపోతు న్నారు. తమతమ పార్టనర్స్‌ని విడిచి వుండ లేమన్నట్టుగా హత్తుకుపోతున్నారు. తింటు న్నారు, తాగుతున్నారు, ఊగుతున్నారు, పేలుతున్నారు.

సహజ కూడా వారిలో ఒకర్తైపోయింది. కాని నాకు ఊపిరాడకుండా వుంది. ఒకరక మైన నిషాలో యువత మునిగిపోతోందే అని బాధగా వుంది. వెర్రితలలు వేస్తోన్న నాగరికతని కళ్లారా చూస్తోంటే వేదనగా వుంది.

"కమాన్ డియర్ హేవ్ ఫన్ ఫర్గెట్ యువర్ సెల్ఫ్"

నా చెయ్యి పట్టుకులాగుతూ అంది. అయిష్టంగానే అనుసరించాను.

పచ్చిమిరపకాయ బజ్జీలనుంచి ఐస్‌క్రీమ్ దాకా రకరకాల తిళ్ళు తిన్నాం.

హోరెత్తించే సంగీత ఝురిలో సహజ కొట్టుకుపోతూ మైమరచి నర్తిస్తోంటే ఆమెనే వెర్రిగా చూస్తూండిపోయాను. ఆమె ఒక్కతే కాదు. క్లబ్బు కొచ్చిన అంతా కూడా నాగస్వ రానికి నర్తించే నాగులయ్యారు. నేనొక్కడ్నీ "ఆడ్"గా వుండిపోయాను. నేను రాకూడని ప్రదేశం అని మథనపడుతూనే సహజ సంతోషం కోసం పెదాలకి చిరునగవు అంటించుకున్నాను.

అనంతరం డాన్సులు మొదలయ్యాయి. ముంబాయినుంచో, గోవానుంచో వచ్చారు. అర్ధనగ్నంగా వుండి అశ్లీల నృత్యం చేస్తోంటే యువత హర్షధ్వానాలు చేస్తోంది!

వాటిని చూసి భరించడం నాకు శక్యంగా కుండా వుంది.

"కేబరేని చూస్తున్నట్టుగా వుంది. మన్లాంటి వాళ్ళు వుండాల్సిన ప్రదేశం కాదు. వెళ్ళిపోదాం సహజా"

నివ్వెరబోయి అనాగరికుడ్ని చూసినట్టు చూసింది.

"మన ఏజ్ గ్రూప్‌లో కలవలేకపోతున్నా వేంటి డియర్, అందర్లా ఎంజాయ్ చెయ్యలే కపోతున్నావంటే నీలో ఏదో లోపం వుంద న్నమాట"

"కావచ్చు. నేను దాన్ని లోపంగా గాక ప్లస్‌గా భావిస్తాను. ఈ గందరగోళంలోంచి బయటపడదాం రా సహజా"

"ఇంకో పదినిమిషాల్లో కొత్త సంవత్సరం రాబోతోంది. ఇలాంటి ఆనందకర సమ యంలో నువ్వు నాకిచ్చే బహుమతి ఈ సంబరాన్ని దూరం చెయ్యడమా?"

"అహ అదికాదు సహజా. ఇది డీసెంట్ పీపుల్‌కి తగని ప్లేస్. అయామ్ అనేబుల్ టు బేర్ ఆల్దిస్ న్యూసెన్స్"

"నా గురించి వచ్చావు. నా కోసం మరి కాస్సేపు భరించలేవా?"

ఆమె అర్థింపుకి లొంగిపోయాను.

నిప్పులమీద కూర్చున్నట్టుగా వుండిపో యాను.

పన్నెండయ్యింది.

సంగీత నృత్యాలు తారాస్థాయినందుకు న్నాయి. బాణాసంచా అదే పనిగా కాల్చారు. బుడగలు పేల్చారు.

"హేపీ హేపీ న్యూ ఇయర్" అంటూ గొంతెత్తి అరుస్తు కరచాలనాలు చేసుకు న్నారు. కౌగలించుకున్నారు. ముద్దుల్లో మునిగి తేలారు.

ఇంతలో నలువైపుల్నుంచీ గొట్టాల్లోంచి నీరు వర్షంలా కురిసింది. కేరింతలు కొడుతూ కృత్రిమ వానలో తడిసిపోతూ పిచ్చిగా అరుస్తూ గంతులెయ్యసాగారంతా.

దుస్తులు తడిసి ముద్దై లోదుస్తులు ప్రస్ఫుటంగా కన్పిస్తున్నాయి. అయినా ఎవరూ పట్టించుకోవట్లేదు. ఒకర్తో ఒకరు పోటీపడుతూ కవ్వించుకుంటూ ఆడా, మగా నర్తిస్తున్నారు. హత్తుకుంటున్నారు. రకర కాలు భంగిమలు ప్రదర్శిస్తూ వూగిపోతు న్నారు.

ఇంతలో ఒక అమ్మాయినో నలుగురు చుట్టేసి ఆమెని బలంగా కౌగిలించుకొం



టోంటే వెర్రిగా అరిచిందామె. నా పిడికిళ్ళు బిగుసుకున్నాయి. విసురుగా అటు వెళ్ళాను. ఇంతలో క్లబ్బు తాలూకు వాళ్ళొచ్చి ఆమెని విడిపించి ఆ దుండగుల్ని లాక్కుపోయారు.

"చూశావా? పశువుల్లా ప్రవర్తిస్తున్నారు. ఛా- అంతా చదువుకున్నవాళ్ళే. అయినా సంస్కార హీనంగా ప్రవర్తించారంటే అందుక్కారణం ఈ వాతావరణమూ ఈ పరిస్థితీనూ. ఇంకెప్పుడూ ఇలాటి చోటుకి నువ్వు రావొద్దు. నన్ను రమ్మనొద్దు. ఆఖరికి మన స్నేహితుల్నిగాని పరిచయస్తుల్నిగాని ఇటు కేసి తొంగిచూడనివ్వొద్దు. కమాన్..."

సీరియస్‌గా చెప్పి ముందు కదుగేశాను.

మొఖం ఎర్రగా చేసుకుని అనుసరించింది సహజ.

పల్లెలో పుట్టిపెరిగిన సహజ ఇలాంటి దుర్గంధంవైపు ఎందుకింత బలంగా ఆకర్షింపబడిందో ఎంతాలోచించినా అర్థంకాలేదు!

ఒకనాడామె గ్రేట్‌ని కావాలంటూ చెప్పిన మాటలు గుర్తొచ్చాయి.

సహజ మాయామృగంవెంట పరుగుపెట్టడంలేదు కదా? !

★ ★ ★

"మమ్మీ! కాలేజీకెళ్తున్నాను"

పుస్తకాలు తీసుకువెళ్తూ హాలులో కూర్చునున్న సులోచనని చూసి షాకయ్యాను.

ఆమె ఎంతో దిగులుగా, బెంగగా, నిరుత్సాహంగా వుంది.

రిజిస్ట్రార్ ఆఫీసులో తనూ, అన్నయ్యా పెళ్లిచేసుకున్న రోజున ఆకాశం అందినంత ఆనందంగా వుంది ఆమె. అలాంటిదిప్పుడు అత్యంత విలువైనదేదో పోగొట్టుకున్నట్టు...

ఆమెవంక చూస్తూ ఆగాను. ఆమె కూడా నన్ను చూసింది. గుర్తు చేసుకుంటున్నట్టుగా వుండిపోయింది.

"అన్నయ్య కోసం వచ్చిందిరా... వాడేమో బారెడు పొద్దెక్కినా లేవలేదు" నా వెనకే వచ్చిన అమ్మ అంది.

"రాత్రి కూడా బాగా ఆలస్యంగా వచ్చాడా మమ్మీ"

"అవన్నీ ఇప్పుడెందుకులే నువ్వు కాలేజీ కెళ్లు"

"ఈ అమ్మాయి ఎవరో తెలుసా? "

భయం అమ్మ కళ్లల్లో రెపరెపలాడింది. తన అనుమానం నిజం కాకూడదన్నట్టుగా చూసింది.

"వదిన"

అటు అమ్మ, ఇటు సులోచనా తుళ్లిపడి చూశారు.

కన్నీళ్లు పొంగివస్తోంటే లేచి నిలబడి ఆశగా చూసింది సులోచన. వరదలో కొట్టుకుపోతున్న వారికి చిరు ఆధారం లభించినట్టుగా ఫీలయిందామె.

"తప్పురా, పెళ్లీగిళ్లీ అవ్వకుండా అలా మాట్లాడకూడదు"

"మా పెళ్లి అయ్యిందండీ... ఈ అబ్బాయి కూడా సాక్షి సంతకం చేశాడు"

"మాకు మాట మాత్రమైనా చెప్పకుండా చేసుకున్నది పెళ్లి ఎలా అవుతుంది? వీళ్ల నాన్నగారి సంగతి నీకు తెలీదు. చండశాసనుడు. ఆయన మాటకి ఎదురు చెప్పగల దమ్ములు ఇంట్లో ఎవరికీలేవు. చాటుమాటు వ్యవహారాలని ఆయన హర్షించరు. నువ్వు లేనిపోని ఆశలు పెట్టుకోకుండా వచ్చిన దారిన వెళ్లడం శ్రేయస్కరం"

అమ్మ మాటలకి నేను సైతం విస్తుబోయాను.

"అది కాదు మమ్మీ..."

"నువ్వనవసరంగా కల్పించుకోకురా గాంధీ. ఇవి కుటుంబ విషయాలు. జీవితాల సమస్యలు. వీటిని మమ్మల్ని పరిష్కరించనీ"

"నేను... నేనిప్పుడు వట్టి మనిషిని కాదండీ"

తుళ్లిపడ్డాను. అమ్మ అయితే కంపిస్తూ చూసింది.

"ఆడపిల్లవి. కాలు జారేముందు ఆ




మాత్రం ఇంగిత జ్ఞానం వుండొద్దూ. చూస్తోంటే చదువుకున్నదానిలా వున్నావు. ఇంతదాకా ఎందుకు రానిచ్చావు. ఏ డాక్టరమ్మ కడుపో కాలో పట్టుకుని కడుపు తీయించుకోకపోయావా? "

"మమ్మీ!"

"నువ్వుండ్రా. సిగ్గూ ఎగ్గూ లేకుండా ఇంకా అలా నిలబడే వున్నావేంటి. వెళ్ళెళ్ళు... వీళ్ళ నాన్నగారొచ్చారంటే పోలీసుల్ని పిలిచి నానా రాద్ధాంతం చేస్తారు ఏమనుకున్నావో"

"పోలీసులే కాదు భగవంతుడే దిగి వచ్చినా సరే ఈ ఇంట్లో ఆమెకిగల హక్కుని కాదన్లేరు. అగ్ని, వేదమంత్రాల సాక్ష్యం లేకపోవచ్చుగాని అక్షరాల సాక్ష్యం వుంది. చట్టపు అండ వుంది"

నా మాటలకి అమ్మ నివ్వెరపోయింది. మరేమన్పించిందోగాని సులోచన ఏడ్చేసింది.

గొడవ విని కాబోలు లోపల్నుంచి బ్రదర్ వచ్చాడు. "గట్టిగా మాట్లాడుతున్నావు. ఎవర్తోన్రా గాంధీ" అంటూ సులోచనని చూసి షాక్ తిన్నాడు.

"నువ్విక్కడి కొచ్చావేం? రావద్దని చెప్పేనుగా. వెళ్ళెళ్ళు, మమ్మీ... ఈ అమ్మాయి.... ఆ నా ఫ్రెండ్ చెల్లెలు. కష్టాల్లో వుందంటేనూ హెల్ప్ చేస్తానన్నాను. అందుకని వచ్చిందంతే" అమ్మకి నచ్చచెప్పాలని చూశాడు అన్నయ్య.

"వదిన హెల్ప్‌కోసం రాలేదు హక్కుకోసం వచ్చింది. వంశోద్ధారకుడితో వచ్చింది"

నా మాటలకి కంగారుపడింది అమ్మ. "నీకెప్పుడేం మాట్లాడాలో తెలీదురా గాంధీ. నువ్వు కాలేజీకెళ్ళు చెబుతా. మీ డాడీ వచ్చారంటే కొంపకొల్లేరవుతుందిరా"

"తన బతుకు కొల్లేరవ్వబోతోంది గనుకే ఈ అమ్మాయి వచ్చింది"

"గాంధీ! అనవసరంగా నా స్వవిషయంలో కల్పించుకోకు" తీవ్ర స్వరంతో అన్నాడు అన్నయ్య.

"అది నీ ఒక్కడికే పరిమితమై వుంటే కల్పించుకునే వాడ్ని కాదు. కానిందులో ఇంకొకరి నూరేళ్ల జీవితం ముడిపడివుంది"

"అదంతా నీకనవసరం"

"నాకు అవసరం"

"ఏవిట్రా నీకు అవసరం బోడి! ఇది నా పెర్సనల్ మేటర్. మైండిట్"

"కావొచ్చు కాని ఒకరికి అన్యాయం జరుగుతోంటే ప్రశ్నించే హక్కు, అధికారం ఈ సమాజపు సభ్యుడిగా నాకున్నాయి. పైగా నేను మీ పెళ్లికి సాక్షిని"

దిమ్మెరపోయాడు అన్నయ్య.

"మధ్యలో మీరు పోట్లాడుకుంటారేవిట్రా. మీరూరుకోండి చెబుతా. ఇలాటి పెద్ద విషయాలు చూట్టానికి మేమున్నాంకదా"

అమ్మ మాటలు పూర్తవకుండానే బయట కారాగిన శబ్దమయింది.

"మీ డాడీ వచ్చినట్లున్నార్రా దేవుడా! నీకెంతైనా పుణ్యం వుంటుందిగాని గాంధీ ఈ ఊసేమీ ఆయన ముందు ఎత్తకు"

"ఇన్నాళ్లూ దాచటమే ఓ తప్పు. ఇదివరకు చెబుతానంటే చెప్ప నివ్వనందునే పరిస్థితి ఇంతదాకా వచ్చింది. ఇంకా దాచటం నాకు సాధ్యంకాదు"

అన్నయ్య ఏదో పనున్న వాడిలా లోపలి కెళ్లిపోయాడు.

అమ్మ అసహాయంగా చూసి ఏదో అనబోతోంటే డాడీ లోపలికొచ్చారు.

"ఏవిటి? అలా వున్నారేంటి? " అందరి వంకా గుచ్చిగుచ్చి చూస్తూ అడిగారు.

"అబ్బే... ఏవీలేదండి... మీర్రండి"

అమ్మ మాటలకడ్డొస్తూ "మీతో మాట్లాడాలని ఈ అమ్మాయి వచ్చింది డాడీ" అన్నాను.

"ఆఫీసు విషయాలు ఇంట్లో మాట్లాడనని నీకు తెలుసుకదరా. ఆఫీసుకి రమ్మను"

డాడీ లోపలికెళ్లిపోబోతోంటే అన్నాను "ఇంటి విషయాలు మాట్లాడాలనే ఇంటికొచ్చింది"

ఆయన నుదురు ముడిపడింది.

"మీరు స్థిమితంగా కూర్చుని విషయమంతా తెలుసుకుంటే బావుంటుంది"

నా మాటలకి అమ్మ వంక చూశారాయన.

"ముందు భోంచేద్దురుగాని రండి. తరువాత మిగతా విషయాలు తీరిగ్గా మాట్లాడుకోవచ్చు"

మరేమనుకున్నారో సోఫాలో కూర్చుంటూ "సంగతేవిట్రా. ఈ అమ్మాయి నీకేమవుతుంది, ఫ్రెండా? " అనడిగారు.

"వదిన"

"గాంధీ!" గర్జించారు.

"అది సత్యం. పునః సత్యం"

"ఆనంద్ ఏడి? " కోపోద్రిక్తులై ప్రశ్నించారు డాడీ.

"లోపలున్నాడు"

"ఇంకా చూస్తూ నిలబడ్డావేమే పిలు"

డాడీ గద్దింపుకి గబగబా వెళ్లి అన్నయ్యని తీసుకొచ్చింది అమ్మ. అన్నయ్య భయపడతాడనుకున్నాను. కానెంతో ధీమాగా పొగరుగా వున్నాడు.

"ఈ అమ్మాయి నీకు తెలుసా? "

"తెలీక పోవడమేమిటి బాగా తెలుసు నా ఫ్రెండ్. హాయ్ సులోచనా" ఏమీ ఎరగనట్టు పలకరించాడన్నయ్య.

బెదురు చూపులు చూసిందామె.

"ఫ్రెండ్ కాదంటున్నాడు గాంధీ"

"వాడికేం తెలీదు. నేను చెబుతున్నాగా డాడీ! షీఈజ్ ఒన్నాఫ్ మైఫ్రెండ్స్. దట్సాల్" తలెగరేస్తూ చెప్పాడు.

"ఆనంద్ యూ చీట్... అలా మాట్లాడ్డానికి సిగ్గెయ్యడంలేదూ. నన్ను నమ్మించి పెళ్లి చేసుకుని ఇప్పుడు మోజు తీరిందని చెప్పి కేవలం ఫ్రెండ్ననని బుకాయిస్తావా? నేనేమైపోవాలి? నా కడుపులో పెరుగుతున్న నీ బిడ్డ ఏం కావాలి? "

సులోచన మాటలకి అందరికన్నా మిన్నగా డాడీ కలవరపడ్డారు.

"నువ్వెందు వాడ్ని చెప్పనీ... మొద్దులా మాట్లాడవేంరా? ఆ అమ్మాయి చెప్పిందంతా నిజమేనా? "

"ఒకరంటే ఒకరం మోజుపడ్డాం అందుకని... మా ఇద్దరి తప్పూ వుంది"

"పెళ్లి చేసుకున్నావంటోందిగా"

"అదంతా వట్టిదే. నమ్మించడానికి చేసుకున్నా, కాగితాలపెళ్లి"

"కాగితాల పెళ్లికాదు రిజిస్టర్ మేరేజ్" కల్పించుకుంటూ అన్నాను.

"నీకెలా తెలుసురా? "

"మీరు ఈసీ కోసం పంపినప్పుడే వీళ్లక్కడ పెళ్లి చేసుకున్నారు. నన్ను సాక్షిసంతకం చెయ్యమంటే చేశాను కూడా"

"మరి వెంటనే నాకెందుకు చెప్పలేదు? "

అమ్మవంక చూశాను. "సమయం చూసి మీకు చెబుదామనుకున్నాం. ఇంతలో..." అంటూ ఆగింది అమ్మ.

"అఘోరించకపోయారు! ఏంరా నువ్వేమంటావు" అన్నయ్యని ప్రశ్నించారు.

"అది పెళ్లికాదు డాడీ"

"షటప్! రిజిస్ట్రాఫీసులో పెళ్లి చేసుకుని అది పెళ్లే కాదంటావేంట్రా. ఆ అమ్మాయి మంచిది గనుక సరిపోయింది. ప్లీడరు నోటీసిచ్చినా, పోలీసు కంప్లయింటు చేసినా పీకలదాకా ఇరుక్కుపోయే వాడివి. అలా జరగనందుకు సంతోషించు"

"అదికాదు డాడీ"

"ఏది కాదురా? చెయ్యకూడనిదంతా చేసేసి నంగనాచి కబుర్లు చెబుతావేంట్రా ఇడియట్. అసల్నీకి పెళ్లి పిచ్చెలా పట్టిందిరా. అవతల సిఏ పూర్తవ్వలేదు. ఇవతల దమ్మిడీ సంపాదనలేదు. లైఫ్‌లో సెటిలవ్వడానికి కనీసం టూ ఇయర్స్ పడుతుంది. ఇప్పుడే పెళ్లీ పిల్లలూ అంటూ మెడకి గుదిబండలు తగిలించుకుంటే ఇంకేం పైకొస్తావు? కడకే చిన్న ఫర్మ్‌లోనో బుల్లి గుమాస్తాగా మారి గొర్రెతోక బతుకు నీడ్వాల్సొస్తుంది"





తలొంచుకున్నాడు అన్నయ్య.

"సరేనమ్మాయ్. మీ పెద్దవాళ్లకీ సంగతి తెలుసా? " సులోచనతో అన్నారు డాడీ.

"తెలీదండీ"

"మావాడే కాదు నువ్వు చేసినపనీ బావో లేదు. మీరు ఎల్కేజీ చదువుతున్న పిల్లలు కాదు. చదువూసంధ్యా, వయస్సూ జ్ఞానం అన్నీ ఉన్నవాళ్లు. మీరిలా బిహేవ్ చెయ్యడం ఏంబావోలేదు. నాకీ సంగతి సూటిగా చెప్పు? వీడికి ఉద్యోగం సద్యోగం లేదుకదా! పిల్లల్ని కని ఎలా పోషిద్దామను కుంటున్నారు? తొందరపడ్డా ముందు జాగ్ర త్తలేకపోతే ఎలా? సరే! గతాన్ని మళ్లీమళ్లీ తవ్వుకుని ప్రయోజనం లేదుగాని మీ వాళ్ల ఎడ్రసు ఇవ్వు. వీలు చిక్కగానే కలిసి అంతా చెప్పి ఒప్పిస్తాను. ఈలోగా మీ భవి ష్యత్తుని ఎలా తీర్చిదిద్దాలనుకుంటున్నదీ మీ ఇద్దరూ కలిసి నిర్ణయించుకోండి. అర్థ మైందా? "

తలాడిస్తూ అంది సులోచన "మీరు నిజంగా దేవుడు మావయ్యగారూ"

డాడీ మాటలూ ప్రవర్తనా నన్నూ అమ్మనీ కూడా ఆశ్చర్యాంబుధిలో నిలువునా ముంచేశాయి.

"ఇంకా అలా చూస్తూ నిలబడ్డావేమే! మా అందరికీ భోజనం వడ్డించు. ఇవాళ అమ్మాయి మనింట్లో మనతోబాటు భోంచేసి వెళ్తుంది. గాంధీ నువ్వు కూడా రారా"

"నా భోజనం అయింది డాడీ. కాలేజీకెళ్తు న్నాను. ఇప్పటికే ఆలస్యమైపోయింది. వస్తాను మమ్మీ"

★ ★ ★

"బాసూ" లేబ్‌లోంచొస్తోంటే పిలుస్తూ వచ్చాడు కరుణానందం.

ఆగి ఏవిటన్నట్టు చూశాను.

"నీకూ సహజకీ డిఫరెన్సెస్ వచ్చాయా? "

"అలాటిదేమీ లేదే"

"నీ పేరెత్తితే చాలు మండిపడుతోంది మరి"

ఈమధ్య సహజ నన్ను తప్పించుకు తిరు గుతున్నమాట నిజమే. పిలిచినా పలకటం లేదు. కేవలం న్యూఇయర్ డేనాడు ఆమెని మందలించి నందుకే ఇంతగా అలిగిందను కోను. మరేదో బలవత్తరమైన కారణం వుండి తీరాలి.

"మాట్లాడవేం బాసూ"

"సహజ ప్రవర్తనకి కారణం ఏవిటో నాకూ అంతుచిక్కడం లేదురా"

"ఇదివరకు నిన్ను క్లవరూ జీనియస్సూ అంటూ పొగిడేసేది. ఇప్పుడు బతకడం చాతకాని వాడూ, పప్పుసుద్దా అంటూ తీసి పారేస్తోంది. మీరిద్దరూ మేడ్‌ఫర్ ఈచద ర్‌లా వుంటారు. మీరు పెళ్లి చేసుకుంటారని అంతా ఎంతగానో ఎక్స్‌పెక్ట్ చేస్తున్నాం. మీరిలా ఎడమొఖం పెడమొఖం అవడం మేం భరించలేకపోతున్నాం. నువ్వే సహ జతో డైరెక్టుగా మాట్లాడితే బావుంటుంది బాసూ"

"థాంక్యూ... ఇవాళే మాట్లాడతాను"

"ఇంకో పాయింటు ఏవిటంటే"

"ఏవిటో చెప్పరా"

"మురారితో క్లోజ్‌గా వుంటోంది"

నవ్వేశాను. "నామీద అలిగి మురారితో మూవ్ అవుతోందేమోరా! సినిమాల్లో చూపి నట్టుగా!"

"నిజంగానే రాచుకుపూచుకు తిరుగు తోంది"

"నేన్నమ్మను. న్యూ ఇయర్‌డే పార్టీకి రమ్మన్నాడని అందరూ చూస్తుండగా మురారి చెంపలు వాయగొట్టిందిగా. ఆ సంగతి మరిచిపోతే ఎలా? "

"దాన్ని వాళ్లిద్దరూ మరచిపోయినట్టు న్నారు. ఎందుకైనా మంచిదని నీ చెవినే శాను. నేనిలా చెప్పినట్టు ఆ మురారికి తెలీ నివ్వకు గురూ! ఫ్రీ టీ, సిగరెట్లుకి ముప్పొ స్తుంది"

"చెప్పన్లే" ముందుకి నడిచాను.

★ ★ ★

ఊడలు దిగిన మర్రిచెట్టు కింద ఎవరికో సమో నిరీక్షిస్తూ కన్పించింది శిరీష.

క్రీమ్‌కలర్ చుడీదార్ ధరించి నిండుగా అందంగా వుందామె.

"ఏదివిలో విరిసిన పారిజాతమో" అన్నాను ఆమెని చూసి మందహాసం చేస్తూ.

"అదేమో తెలీదుగానీ ఏ మదిలో ప్రేమ గీతమై మెరుస్తానా అని చూస్తున్నాను"

"నువ్వంటే మొత్తం కాలేజీయే పడిచస్తుం దికదా"

"గాజుపెంకులు నాకెందుకు? వజ్రమో, వైఢూర్యమో కావాలిగానీ"

"వజ్రమే నీకు లభించాలని ఆశీర్వదిస్తు న్నాను"

"థాంక్యూ నువ్వంటే జరిగి తీరుతుంది. నీ మాట మీద నాకు గురివుంది"

"నా మాట మంత్రంలా మహత్తుగలదం టావు"

"ఎగ్జాక్ట్‌లీ! ఈ డ్రెస్సు ఎలా వుందీ"

"నువ్వీ డ్రెస్సులో అదిరిపోతున్నావు శిరిషా. పారిజాత పుష్పంలా వున్నావని చెప్పేనుగా. నీకీ డ్రెస్ చాలా బావుంది"

ఆమె కళ్లు మెరిశాయి.

"థాంక్యూ సోమచ్. నీకు నచ్చింది గనుక ఇక నుంచి చుడీదార్లే ధరిస్తాను"

"గుడ్ డెసిషన్. జీన్సూ, టీషర్టులూ, మిడ్డీలూ మినీలూ అమ్మాయిల ఆకర్షణని పెంచొచ్చేమోగాని వారి అందాన్ని పెంచదు. వారంటే గౌరవాభిప్రాయాన్ని కలగజే యదు. చుడీదార్లని మించిన డీసెంట్ డ్రెస్ లేదని చెప్పాలి"

"మరి సహజ ఎక్కువగా జీన్సు ధరి స్తుందేం? తనకి చెప్పలేదా? "

"చెప్పేను. పల్లూ బోర్ అంటుంది"

"జీన్స్ నీకిష్టం కాదని చెప్పలేదా? "

"చెప్పేను. అలా అని నా అభిరుచిని ఇత రుల మీద రుద్దాలని ప్రయత్నించను"

"నువ్వు రుద్దకపోయినా తను గ్రహించి వుంటే బావుండేది"

"నాలాగే తనకీ బలమైన అభిప్రాయాలు న్నాయి"

"సహజంటే అసూయగా వుంది"

"ఏయ్ ఎందుకు? "

"నీ ప్రేమని పొందినందుకు? "

నవ్వి వూరుకున్నాను.

ఇద్దరం మౌనంగా కలిసి నడుస్తున్నాం. ఎవరి ఆలోచనలో వాళ్లుండిపోయాం.

ఒగురుస్తూ వచ్చాడు షాజహాన్. అది అతడి నేమ్‌కాదు నిక్‌నేమ్. కాలేజీలో చేరాక ఎందర్ని ప్రేమించాడో వాడికే తెలీదు. ఏవిటన్నట్టు చూశాను.

శిరీష వంకే చూస్తూ దానిమ్మ పండు అందించాడు.

"ఇదేవిటి? "

"ఫలం? "

"దేనికి? "

"తపస్సుకి, ఐమీన్ ఆరోగ్యానికి చాలా మంచిది శిరీషా. అందుకని నీకోసం కోసితె చ్చాను"

"పక్కింటివారి పెరట్లోని చెట్టునుంచా? "

"అంత కరెక్టుగా ఎలా చెప్పావు? "

"కొందర్ని చూడగానే తెలిసిపోతుందిలే"

శిరీష మాటలకి నవ్వకుండా వుండలేకపో యాను. బిక్కమొహం పెట్టేడు షాజహాన్.

"నేనోమాట చెప్పాలనుకుంటున్నాను శిరిషా" అంటూ నా వంక చూశాడు.

"నేను పానకంలో పుడకనా? " నవ్వుతూ అడిగాను.

"పుడకా కాదు పిడకా కాదుగాని నువ్వొండు గాంధీ. షాజహాన్ మనందరికీ ఫ్రెండేకదా! ఏం షాజహాన్? అవునూ నీ అసలు పేరేంటి? "

"వీరవెంకట సత్యన్నారాయణ"

"మరి షాజహాన్‌గా ఎప్పుడు మారిపో యావు? కాలేజీలో అడుగుపెట్టేకా లేక





హైస్కూల్లోనా..." అర్థోక్తిగా చూసి నవ్వింది.

"నేనే పాపం ఎరగను శిరీషా. కాలేజీకొచ్చేక మురారీ వాళ్లూ నాకా పేరు పెట్టేశారు. అదిప్పుడు పూర్తిగా నా పేరై కూర్చుంది. ఎవరైనా వచ్చి సత్యనారాయణ ఎవరని అడిగితే ఆ పేరుగల వాళ్లెవరూ మా కాలేజీలో చదవటం లేదనేస్తారంతా"

"నీ పేరు కథ బావుందిగాని ఏదో చెప్పాలన్నావుగా చెప్పెసెయ్"

"అదీ... మరీ... నువ్వు నా గురించేమనుకుంటున్నావో తెలీదుగాని నేను మాత్రం నీకు నా గుండెల్లో గుడికట్టి మరీ పూజిస్తున్నాను శిరీషా? "

"ఏం చేస్తున్నావూ? "

"పూజిస్తున్నాను"

"రియల్లీ? "

"నీమీద కాదు నా మీద ఒట్టు"

"అరె అలాగా... నాకు తెలీదే"

"ఇప్పుడు తెలిసిందికదా! ఇక నుంచి ప్రేమిస్తావా? "

"డబ్బా తెస్తాను"

"డబ్బా ఎందుకు? " అయోమయం మార్కు మొహంతో అడిగాడు.

ఆమె భావం అర్థంగాక ఆసక్తిగా చూశాను.

"నన్ను పూజిస్తున్నావుకదా నా దర్శనం కోసం వచ్చి నప్పుడల్లా వట్టిచేతుల్తో రాకుండా పువ్వోపండో తెచ్చి ఇస్తావుకదా? "

అనుమానంగా చూస్తూనే తలాడించాడు.

"ఆ తర్వాత హుండీలో డబ్బు వేస్తావు కదా! అందుకని నువ్వేసే కానుకల కోసం డబ్బా పట్టుకు తిరుగుతుంటాననంటున్నాను"

నవ్వునాపుకోలేకపోయాను.

షాజహాన్ మొహన కత్తివేటుకి నెత్తురు చుక్కలేదు. తడబడుతూ వెళ్లిపోయాడు.

"నీకు సెన్సాఫ్ హ్యూమర్ ఎక్కువ శిరీషా"

"కానేం లాభం నువ్వెప్పుడూ సీరియస్ గానే వుంటావుకదా"

"హమ్మో! నా మీదకి బాణం సంధించావన్నమాట"

"అలాగైనా సరదాగా వుంటావని ఆశ"

చురుగ్గా చూశాను.

తలదించుకుంది.

మళ్లీ మౌనం మా ముందుకొచ్చి తిష్టవేసింది.

"వెహికల్ ఎక్కడ పెట్టావు"

"సర్వీసింగ్ కిచ్చాను. లిఫ్ట్ ఇవ్వగలవా? "

"వైనాట్ కమాన్"

బైక్‌మీద వెళ్తోంటే అంది "ఆకలిగా వుంది గాంధీ"

"అరె... అలాగా"

దగ్గర్లోని బేకరీలోకెళ్లి కూర్చున్నాం.

"బర్గర్ తింటావా లేక పేస్ట్రీ"

"నీకేది ఇష్టం? "

"చికెన్ బర్గర్"

"నాకూ అదే ఇష్టం"

ఆమె ముఖంలోకి చూశాను. కళ్లు దించుకుంది.

బర్గర్ తింటూ అంది శిరీష "జనాన్ని సినిమాలు బాగా పాడు చేస్తున్నాయి గాంధీ. వయసొచ్చిన యువతీ యువకులకి ప్రేమగోల తప్ప వేరే ప్రపంచమేలేనట్టు నూరిపోస్తున్నాయనుకో"

"వాటి ప్రభావం ఎక్కువగా వున్న మాట నిజమే. వాటికన్నా టీవీ మరింత ప్రమాదకరంగా తయారయిందంటాను"

"ఎంచేత? "

"ఆటంబాంబు తర్వాత మళ్లీ అంతటి దుష్ప్రభావం చూపించగల శక్తి టెలివిజన్‌కే వుంది. విదేశీ ఛానల్స్ విదేశీ ఉత్పత్తులకి విపరీతమైన పబ్లిసిటీ ఇచ్చి వాటి మీద మోజు కల్పించడమే కాదు పాశ్చాత్య సంస్కృతిని మనమీద రుద్దుతున్నాయి. మన సంస్కృతీ సాంప్రదాయాల మీద తృణీకారభావం కలిగేలా విదేశీ సంస్కృతి మీద ఆకర్షణ పెరిగేలా ఒక పద్ధతి ప్రకారం



స్లోపాయిజన్ ఎక్కిస్తున్నాయి. మన దుస్తుల్ని, వేషాల్ని, అలంకరణ సామగ్రిని, భాషని, ప్రవర్తననే కాదు మన భావాలని సైతం కలుషితం చేసేస్తున్నాయి. ఈ సాంస్కృతిక దాడిని అరికట్టక పోతే రాబోయే తరానికి రాముడూ, గాంధీయే కాదు రాట్నమూ, సత్యము, సౌశీల్యము, అహింసా ఏమీ తెలీవు. అలజడి, అశాంతి తప్ప మరేమీ మిగలవు!"

చప్పట్లు కొట్టింది శిరీష. పక్కటేబుళ్ల దగ్గర కూర్చున్న వారంతా చిత్రంగా చూసినా పట్టించు కోలేదామె.

"గ్రేట్! నీతో మాట్లాడటమే ఏ ఎడ్యుకేషన్ గాంధీ. నీ ఫ్రెండ్‌నైనందుకు అయామ్ ప్రౌడాఫ్‌యూ"

"గర్వించి వూరుకుంటే చాలదు, జనావళికి హానిచేసే అన్ని రకాల చెడుల్నీ అరికట్టాలి. ఎదిరించాలి. నిలుపుదల చెయ్యడానికి కృషి చెయ్యాలి"

"ఒక వేదిక వుంటే ఎన్నో చేతులు కలుస్తాయి. నువ్వే ఓ వేదిక నెందుకు నెలకొల్పకూడదు గాంధీ? "

"నేనా? "

"నువ్వే"

"నేను చాలా చిన్నవాడ్ని. అది పెద్దవాళ్లకే సాధ్యమయ్యే మహత్తర కార్యం"

"అలా ఎందుకనుకోవాలి? కడివెడంత గుమ్మడికాయ కత్తిపీటకి లోకువ. అనంతమైన చీకటి చిరుదివ్వెకి లోకువ. ప్రయత్నమనే చిరుదీపాన్ని వెలిగిస్తేచాలు ఎన్నెన్నో చేతులొచ్చి కలుస్తాయి. నూనెపోస్తాయి. ఒత్తిని ఎగదోస్తాయి. చేతుల్ని అడ్డుపెట్టి కాపుగాస్తాయి"

విస్మయంగా చూశాను.

"మాట్లాడవేం గాంధీ"

"ఐలైక్ యువర్ ఐడియా. నీనుంచి నేర్చుకోవాల్సింది చాలా వుంది"

"ఛాఛా నీ ముందు నేనెంత"

"మంచి ఎక్కడున్నా స్వీకరించవచ్చు అందుకు వయస్సూ అనుభవం ఏవీ అడ్డు రావు. రాకూడదు. అడ్డువచ్చిన మరుక్షణం అతడి ఎదుగుదల అంతటితో ఆగిపోతుంది"

నా చేయి పట్టుకుని ఊపేస్తూ "యూఆర్ గ్రేట్" అంది పరమానందోద్వేగంతో ఊగిపోతూ శిరీష!



"ఏంటన్నయ్యా! ఇవాళరేపు చాలా హుషారుగా వుంటున్నావు" డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చుంటూ అన్నాను.

"సమస్యలన్నీ ఒక్కొక్కటీ మబ్బులు విడినట్టు విడిపోతున్నాయిరా. అసల్నీకే థాంక్స్ చెప్పాలి" అన్నాడన్నయ్య భోంచేస్తూ.

"మధ్యలో నేనేం చేశాను? "

"సులోచన గురించి డాడీకి నువ్వే చెప్పేవుగా! డాడీ ఎలా రియాక్టవుతారోనని భయపడ్డానుగాని చక్కని సలహా ఇస్తారని ఎక్స్‌పెక్ట్ చెయ్యలేదు. ఏమైనా సీనియర్ ఆఫీసర్ సీనియర్ ఆఫీసరేరా! వాళ్ల తెలివితేటలు ముందు మనం పనికి రామనుకో"

"ఏం సలహా ఇచ్చారేంటి అంతగా పొగిడేస్తున్నావు"

"ఏదో ఇచ్చారుగాని అవన్నీ ఇప్పుడెందుకురా! నీకిష్టమని పిండి వడియాలు చేశాను




అంది అమ్మ ఓ డిష్ మీద మూత తీస్తూ.

"ఏం మమ్మీ! నేను తెలుసుకోకూడదా లేక నాకు చెప్పకూడదా? "

"అహ... అలా అని కాదు. పెద్ద పెద్ద విషయాలు నీకెందుకు చెప్పు? "

"నన్ను పరాయివాడ్ని చేస్తున్నావేమిటి మమ్మీ"

"అబ్బెబ్బే. అవేం మాటల్రా! నువ్వు నా బంగారు తండ్రివి. నిన్నెందుకు దూరంచేసి మాట్లాడతాను చెప్పు. కొన్ని విషయాలు నువ్వు జీర్ణించుకోలేవు. మానాన్నలాగా నీది అదో తరహా పద్ధతి. అందుకని కొన్ని తెలుసుకోక పోవటమే మంచిది"

"కరెక్టుగా చెప్పేవు మమ్మీ! వీడు మనింట్లో తప్ప పుట్టాడు" అన్నాడు అన్నయ్య.

"చాల్లేరా! నువ్వేసే వెధవ్వేషాలు కన్న వాళ్లం గనుక కడుపులో దాచుకుంటున్నాం. నలుగురికీ తెలిస్తే మొఖంమీద వూయరూ. నువ్వు చేసే పనులు గాంధీ ఎన్నటికీ చెయ్యడు. వాడి మంచితనం చూస్తోంటే ఒక్కోసారి నాకే భయమేస్తుంది" అంది అమ్మ.

"తప్పుల్ని ఎత్తి చూపటం, తప్పుడు పనుల్ని సహించకపోవడం, తప్పు చేసేవాళ్లని వేలెత్తి చూపడం నా స్వభావం. నన్ను చూసి తప్పుడు గాళ్లు భయపడాలిగాని నువ్వెందుకు భయపడాలి మమ్మీ"

"తప్పు చెయ్యని వాళ్లు భూమ్మీదే వుండరుగనుక" నవ్వేడు అన్నయ్య.

"ఇంక సరిపెట్టరా" అన్నయ్యని కసిరి "తల్లిపాలు కూడా కల్తీ అయిపోతున్న రోజులుకదా గాంధీ" అంటూ కిచెన్లోకెళ్లిపోయింది అమ్మ.

"ఒరే బ్రదర్. వదిన ఎలా వుందిరా? వాళ్లింట్లో వాళ్లు ఒప్పుకున్నారా? " మెల్లగా అడిగాను.

"అది తర్వాతి సంగతి. ముందు పీకలమీదకొచ్చిన ప్రోబ్లం కదిలిపోయింది" సంతోషంగా అన్నాడు.

"అంటే? "

"అబార్షన్ చేయించేశాం"

"వదిన ఒప్పుకుందా? "

"ఒప్పుకోకేం చేస్తుంది. ఎవర్ికైనా భవిష్యత్తు ముఖ్యంకదా" అంటూ అదోలా నవ్వుతూ లేచి వెళ్లిపోయాడు.

ఆ నవ్వు ఎన్నో అనుమానాలకి అంకురం వేసింది. నేను అడిగే లోపలే అన్నయ్య వెళ్లిపోయాడు. అమ్మ వచ్చింది.

"ఇవాళేమయ్యిందిరా నీకూ. భోజనం ఎక్కడా తెమలడంలేదూ"

"తింటున్నానుగానీ వదినకి అబార్షన్ చేయించారట కదమ్మా"

"అవున్రా! నేనెంత చెప్పినా ఎవరూ వినిపించుకోలేదు" కళ్లొత్తుకుంది అమ్మ.

"బహిరంగంగా పెళ్లికాకుండా బిడ్డతల్లి అయితే తలవంపులనుకున్నారా డాడీ? "

"ఏమో మరి! ఆయన మనసు లోపలే ముందో ఆ దేవుడికి తప్ప ఎవరికీ తెలీదు"

"వదినా వాళ్ల పుట్టింటి వాళ్లకీ చెప్పలేదుట"

"ఆనందింకా స్థిరపడలేదుకదరా! ఎవరెవర్తోనో కలిపి ఏదో బిజినెస్ చేయించాలని చూస్తున్నారు మీ డాడీ. అదయ్యాక వెళ్లి మాట్లాడతారేమో"

"ఎలా చేసినా ఫర్లేదు. ఆ అమ్మాయికి అన్యాయం జరక్కుండా చూస్తే అంతే చాలు"

అమ్మ నా మొహంలోకి చూసి తలదించుకు వెళ్లిపోయింది!

భోజనం ముగించి అన్నయ్య గదిలోకెళ్లాను.

"కంగ్రాట్యులేషన్స్. ఏదో బిజినెస్ స్టార్ట్ చేస్తున్నావుటకదా"

"అవున్రా. రియల్ ఎస్టేట్ కింగ్ రామనారాయణ తెలుసుగా? అదేరా సునందా హౌసింగ్ అధినేత. ఆయన్తో కలిసి కోఆపరేటివ్ అర్బన్ బ్యాంక్ పెడదామనుకుం

టున్నాం"

"పెట్టుబడి చాలా కావాలేమో? "

"కోటి రూపాయలు కేపిటల్ వుంటే చాలు. షేర్లు అమ్మి కేపిటల్ మొబిలైజ్ చెయ్యొచ్చు. ఉద్యోగాలిస్తామంటే చాలు లక్షలు వచ్చిపడతాయి. జనం సొమ్ముతో బిజినెస్ అన్నమాట. మనకి లాభాలే లాభాలు"

"చేసేది వ్యాపారమైనా వ్యాపారనీతి తప్పొద్దు. అవినీతికి పాల్పడొద్దు. మరి సిఏ సంగతి? "

"ఉస్కో గోలీమారో. బ్యాంకే పెట్టేస్తోంటే ఇంక డిగ్రీలెందుకురా"

"అది పూర్తి చేస్తే మంచి ఫ్యూచరుంటుం దికదా! వదిన ఏమంటోంది? "

"ఏమైనా అన్నా ఎవరు లెక్క చేస్తారు? "

"ఏవిటి నీ ఉద్దేశం? "

"సదుద్దేశమే! నా కాళ్లమీద నేను నిలబ డాలంటే డబ్బు కావాలి. అందుకు డాడీ పేరు కావాలి. సో డాడీ చెప్పినట్టు వినాలి తప్ప సులోచన కోరినట్టు కాదుకదా! తర్వాతి సంగతంటావా నందోరాజాభవి ష్యతి" నవ్వేడు.

"ఎలాగూ బిజినెస్ ప్రారంభిస్తున్నావుకదా వదిన్ని ఇంటికి తీసుకొచ్చెయ్యకూడదూ? "

"నీకర్థం కాదులేగానీ డాడీ ఏం చెయ్య మంటే అది చేస్తాను. నా పేరు ఆనంద్. అయినా నేను శ్రీరామచంద్రుడ్ని"

"రాముడివైతే పరవాలేదు కృష్ణుడివికా కుండా వుంటే చాలు. వదిన మీదే నీ బాగూభాగ్యమూ ఆధారపడి వున్నాయని గుర్తుంచుకో"

"కరక్ట్. కానీ ఏ వదినన్నది పాయింటు"

"అన్నయ్యా"

"సరదా కన్నాన్లేరా. డోంట్ క్రియేట్ సీన్" ఓ ఫైలు తీసుకుని వెళ్లిపోయాడు అన్నయ్య.

★ ★ ★

పెట్రోలు బంకులో పెట్రోలు కొట్టిస్తోంటే నా పక్కన వచ్చి ఆగిందో హీరోహోండా.

దానిమీద మురారీ, అతడ్ని కరచుకుని సహజా కూర్చున్నారు.

ఆశ్చర్యంగా, అపనమ్మకంగా చూశాను.

"హాయ్‌గాంధీ! నీ చిలక నా భుజం మీద వాలిందేవిటని చూస్తున్నావా? స్వర్గానికెగ రాలంటే రెక్కలు కావాలి. అవిప్పుడు నాకు న్నాయి దటీజ్ దట్" కళ్లు చికిలించి నవ్వేడు. కోహినూర్ వజ్రాన్ని చేజిక్కించుకు న్నంత ఆనందంగా వున్నాడు.

సహజ వంక చూశాను. నా ఉనికి పట్టిం చుకోకుండా మురారి చెవి కొరుకుతోంది. అతడు పగలబడి నవ్వుతున్నాడు.

బండిమీంచి దిగకుండానే పెట్రోలు పోయించుకుని దూసుకెళ్లిపోయారు.

కరుణానందం మాటలు గుర్తొచ్చాయి.

సహజ నిజంగానే మురారి ప్రేమలో పడిందా?

గుండెల్నెవరో ఉక్కు హస్తాలతో నలిపే స్తున్నంత బాధ!

ఎంతో న్యూనతగా భరించరానంత అవ మానం జరిగినట్టుగా వుంది. కాలేజీకెళ్లాను.

సహజా, మురారీ ఒకరికొకరు అతుక్కు పోయి తిరుగుతున్నారు. అందర్నీ పిలిచి మరీ గొప్పగా కబుర్లు చెబుతున్నారు.

ఆ దృశ్యం చూసి భరించగల శక్తిలేకపో యింది. తిన్నగా క్లాస్‌రూంకెళ్లాను.

క్లాసు జరుగుతోంది. లెక్చరర్ ప్రసంగాన్ని ఆసక్తిగా వింటున్నారంతా!

కానీ నా బుర్రలోకి ఒక్కమాటా ఎక్కడం లేదు.

మెదడులో సుళ్లు తిరుగుతోంది ఒకటే ప్రశ్న.

సహజ ఎందుకిలా చేసింది?

బెల్ మోగింది.

మరి కూర్చోలేక కేంటీన్‌కెళ్లాను. టీ తాగుతూ ఓ మూలగా కూర్చున్నాను.

"సహజ ఎంతపని చేసిందో చూశావా? " అన్నాడు కుమార్ వచ్చి నా పక్కన





కూర్చుంటూ.

గోపాల్ వాళ్ళన్నయ్య సూయిసైడ్ ఎఫయిర్లో సాయపడనందుకు మొదట కోపగించుకున్నా తర్వాత మామూలుగానే కలిసిపోయాడు కుమార్. ఇంట్లో సరైన ప్రేమానురాగాలూ ఉత్సాహ ప్రోత్సాహాలూ లభించని వాళ్ళే ఆత్మహత్యలకి తలపడతారని గ్రహించానని కూడా చెప్పాడు.

నేను మాట్లాడకపోయేసరికి, "నన్నడిగితే సహజ నీకు తగదురా. నువ్వు నేలమీద నడుస్తావు. సహజ కలల్లో విహరిస్తుంది. నువ్వు ఆదర్శాలూ ఆచరణా అంటావు. ఆమె డాలర్లూ అమెరికా అంటుంది. అసలా మెలో ఏంచూసి ప్రేమించావురా?" అనడిగాడు.

అవునూ. ఏంచూసి ప్రేమించాను?

సహజ పల్లెనుంచి రావడం, అందంగా, అమాయకంగా వుండటం, ఆత్మీయంగా మాట్లాట్టం, నా ప్రతిమాటనీ సపోర్టు చెయ్యడం. వీటన్నితోబాటు నాతో క్లోజ్‌గా మూవ్ అయిన తొలి యువతి సహజ.

తర్వాత్తర్వాత సిటీషోకులూ, ఫ్యాషన్లూ డాలర్ డ్రీమ్సూ ఆమెని లోబరుచుకున్నాయి. అది గ్రహించినప్పట్నుంచీ తామిద్దరి మధ్యా విభేదాలు పొడుసూపుతూనే వున్నాయి.

కడకి ఇద్దరి దార్లూ వేరయ్యాయి.

అందుకు సంతోషించాలో బాధపడాలో తెలీనిస్థితి!

"నోవర్రీ యార్. అది గాకపోతే దాని బాబులాంటిది నిన్ను వరించి వస్తుంది చూడు. నిజానికి నీలాంటి వజ్రాన్ని చేజిక్కించుకోగల అర్హత ఎలాంటిదో సహజకి తెలీదు తెలుసా? ఇది నా మాటే కాదురా. మన ఫ్రెండ్సంతా ఎగ్జాట్లీ ఇదే మాటంటున్నార్రా"

"జరిగిందాని గురించి చింతించడం లేదురా. హఠాత్తుగా ఆమె ఎందుకిలా ఛేంజ్ అయిందా అని ఆలోచిస్తున్నాను. నాతో మాట మాత్రమైనా చెప్పకుండా ఎందుకు దూరమయ్యిందా అని మథనపడుతున్నాను. కనీసం నన్నో స్నేహితుడిగానైనా భావించి విషయం చెప్పలేదే అని బాధపడుతున్నాను"

"అదీ ఆమె సంస్కారస్థాయి. ఫర్గెట్ హెర్..."

"లోపం నాలోనే వుందేమో. అది తెలుసుకుంటే మళ్ళీ అలాటివి జరక్కుండా సరిదిద్దుకోవచ్చుకదా"

"అందుకని వెళ్ళి ఆ బిచ్‌ని అడుగుతావా? నీకు సిగ్గు లేదేంట్రా గాంధీ. ఆఫ్టరాల్ ఓ ఆడపిల్లకోసం..."

"వద్దు. మరీ చీప్‌గా మాట్లాడొద్దు. ఎవరికివారు నిర్ణయాలు తీసుకోగల అర్హత, హక్కూ వున్నాయి. ఆమెని శాసించగల హక్కు మాత్రం మనకి లేదు. ఆమె నిర్ణయమే సరైందేమో. అందులోనే ఆమెకి సుఖమూ సంతోషమూ వుంటే ఆమె డెసిషన్ని నేనూ సపోర్టు చేస్తాను..."

"గాంధీ!"

"నాకు బాధలేదని చెప్పడంలేదు. నా బాధకన్నా తన ఆనందం ముఖ్యం. ఆమె అంటే ఇప్పటికీ నాకు సాఫ్ట్ కార్నర్ వుంది. ప్రేమవుంది" అంటూ లేచి చక్కా వచ్చేశాను.

★ ★ ★

మహారణ్యం.

చీమలు దూరని చిట్టడవినీ, కాకులు దూరని కారడవినీ మించి వుంది. ఎటుచూసినా అడ్డదిడ్డంగా పెరిగిన వృక్షాలూ, ముళ్ళపొదలూ నడవ శక్యంగాని ఎండుటాకుల గుట్టలూ. దూరాన్నుంచి వుండుండి క్రూరమృగాల భయంకర శబ్దాలు విన్పిస్తున్నాయి.

అయినా వేటినీ లక్ష్యపెట్టకుండా అడవి కడ్డంపడి వెళ్తున్నారు డాడీ. మరో అడవిని ఆనుకుని చక్కని రహదారి వుంది. అయినా దాన్ని వదిలేసి కంటకమార్గాన్ని ఎన్నుకుని

సాగిపోతున్నారు డాడీ.

డాడీ! డాడీ!

గొంతెత్తి అరిచాను. వూహూ. డాడీ విన్పించుకోలేదు. అసలు ఏ శబ్దమూ విన్పించుకునేస్థితిలో లేరు.

ఎవరో మంత్రించి పిలిచినట్టుగా మరెదో మోహినీపిశాచి సైగచేసి పిలుస్తున్నట్టుగా అరణ్యం లోపలికెళ్ళిపోతున్నారు.

ఆయన దృష్టి, ధ్యాసా అడవికావల ఎక్కడో వుంది. బహుశా కొండల లోయల మధ్యెక్కడైనా రత్నాల లోయలాంటిదేమైనా వుందేమో. దాన్ని చేజిక్కించుకోవాలనే తపనతో దూసుకుపోతున్నారేమో!

కానీ దారి దారుణంగా వుందే. నిజానికది దారే కాదు. అయినా ఎందుకలా అడవికడ్డంపడి వెళ్ళిపోతున్నారు? ఏం బావుకోవాలని, మరేది చేజిక్కించుకోవాలని దూసుకుపోతున్నారు.

అమ్మా!

అది డాడీ ఆర్తనాదమే.

డాడీ డాడీ... మీకేమయింది డాడీ. అరె దొంగవూబిలో దిగబడి అంతకంతకి కూరుకుపోతున్నారు.

"డాడీ!"

గబుక్కున లేచి కూర్చున్నాను.

ఒళ్ళంతా తడిసి ముద్దయింది.

ఇంత భయంకరమైన కల ఎందుకు వచ్చిందో అర్థంకాలేదు.

లేచి వెళ్ళి మంచినీళ్లు తాగి వచ్చాను.

ఎలాంటి వెధవ్వేషాల జోలికీ పోకుండా ఎంతో సిన్సియర్‌గా వుంటాడు డాడీ. ఆయన్ని, ఆయన ప్రవర్తనని ఇంతవరకూ ఎవరూ వేలెత్తి చూపలేదు.

అలాంటి ఆయన కలలో అలా వున్నారేవిటి? దేన్నో చేజిక్కించుకోవాలని అర్రులు చాస్తూ ముళ్లబాట గుండా వెళ్తున్నారేవిటి? అది దేనికి సంకేతం?

ఎంతాలోచించినా ఏమీ బోధపళ్ళేదు.

కలలకి అర్థాలు వెదకడమంత అవివేకం వుండదని సరిపెట్టుకొంటోంటే అడుగుల చప్పుడు విన్పించింది.

తలుపు తీసుకుని డాబామీద కెళ్ళారెవరో.

ఎవరైవుంటారు?

డాడీయా? లేక అన్నయ్యా?

వెనుదిరిగి వస్తారేమోనని కాస్సేపు నిరీక్షించాను.

రాలేదు.

మరి తాత్సారం చెయ్యలేక డాబామీదకెళ్ళాను.

డాడీ సిగరెట్టుమీద సిగరెట్టు కాలుస్తూ పచార్లు చేస్తున్నారు.

ఒకరకమైన టెన్షన్‌తో వూగిపోతున్నట్టుగా వున్న ఆయనవంక అయోమయంగా చూశాను. ఏం జరిగిందో ఏమిటో తెలుసుకోవాలన్పించి దగ్గరికెళ్ళాను.

"డాడీ"

నా పిలుపుకి ఉలిక్కిపడి చేతిలోని సిగరెట్టు విసిరేసి నా వంక ఆందోళనంగా చూశారు. ఆ చూపులో భయం కూడా లేకపోలేదు.

"నువ్వా! ఇంకా ఎవరో అనుకుని హడలిపోయాను" చిన్నపిల్లాడిలా గుండెలమీద ఉమ్మి వూదుకుంటూ అన్నారు.

"ఎవరనుకున్నారు? "

నా వంక తేరిపార చూసి మరో సిగరెట్టు వెలిగించారు.

మళ్ళీ అడిగాను.

"నీ కర్థంగాదులేగాని డాబామీద కొచ్చావేంటి? నిద్రపట్టడం లేదా? ఎనీథింగ్ రాంగ్? "

"అయామ్ ఆల్‌రైట్. మీర్రావడం చూసి ఎందుకొచ్చారో ఏవిటో తెలుసుకుందామని... ఎనీథింగ్ రాంగ్ డాడ్? "

"అహ అబ్బే... ఆఫీసు విషయాలేవో గుర్తొచ్చి నువ్వెళ్ళి పడుకో"

"మీరు కూడా రండి"

"నేవస్తాన్లే. నువ్వెళ్ళు అప్పుడప్పుడూ




నిద్రపట్టనప్పుడు ఇలా డాబామీదకి రావడం కాస్సేపు చల్లగాలిలో పచార్లు చెయ్యడమూ నా కలవాటేలే"

"ఆఫీసులో ఏమైనా సమస్యలు..."

"ఆఫీసన్నాక ఏవోటి వుంటూనే వుంటాయిలే. పైగా మాకు పొలిటికల్ ప్రెజర్ ఎక్కువ. కరవమంటే కప్పకి కోపం విడవమంటే పాముకి కోపం. నాకివన్నీ మామూలేలే. ఐకెన్ ఫేసిట్. నువ్వెళ్ళి పడుకో..."

ఆయన్ని ఒంటరిగా వదలటమే మంచిదన్పించి మౌనంగా వెనుదిరిగాను.

హాల్లోని సోఫాలో విషాదమూర్తిలా కూర్చునున్న అమ్మని చూసి నేను అవాక్కైతే నన్ను చూసి మమ్మీ షాక్ తింది.

"ఈ టైంలో ఎక్కడికెళ్ళావురా?"

"డాబామీదకి..."

"డాడీ పిలిచారా?"

"ఊహూ... డాడీ చాలా ఆందోళనగా వున్నారు. ఎప్పుడూ ఆయన్నలా చూడలేదు. ఆఫీసులో ఏమైనా గొడవలు జరిగాయా?"

"గొడవలా అంటే గొడవలు కాదనుకో. అయినా తన గుండెల్లో ఏముందో నాకు చెబుతారా ఏమన్నానా. తనలోతనే రగిలిపోతుంటారంతే"

"అంత రగిలిపోవాల్సిన సమస్యలేమున్నాయి?"

"మమ్మీ కలవరపడింది. "అహ. అలా అని కాదు... వూరికే మాటవరసకి అన్నానంతే"

"అవునూ నువ్వలా వున్నావేంటి మమ్మీ?"

"ఎలా వున్నాను?"

"ఏదో జరక్కూడనిది జరగబోతోందని తెలిసి భయపడుతున్నట్టు..."

"ఏదో పీడకల వచ్చిందిరా. అంతే..."

"నాకూ వచ్చింది" అంటూ నాకొచ్చిన కల గురించి వివరించాను.

భయవిహ్వాలయై విన్నది. పిమ్మట కళ్ళు తుడుచుకుంది.

"ఆమాత్రానికే ఇదైపోతావేంటి మమ్మీ. కలలో జరిగితే ఇలలో జరగదంటారు"

"ఏమోరా. నాకేదో భయంగా వుంటోందిరా గాంధీ..." బేలగా అంది.

"ఏం ఎందుకు మమ్మీ..."

"ఎందుకంటే ఏం చెప్పనురా. ఈమధ్య తరచూ మీ డాడీ నిద్రరాక... ఎన్నడూ లేనిది నిద్రమాత్రలు కూడా మింగుతున్నారు"

"అంటే ఏదో సమస్య ఆయన్ని వేధిస్తోందన్నమాట. అదేవిటో తెలిస్తే పరిష్కారం గురించి ఆలోచించొచ్చు పరిష్కారం లేని సమస్యంటూ వుండదు. సమస్యేంటో తెలిస్తే చెప్పు మమ్మీ పరిష్కరిద్దాం"

ఏదో చెప్పబోయి మింగేసింది. "నాకు మాత్రం ఏం తెలుసురా. ఆఫీసు విషయాలు నాకు చెబుతారా ఏమన్నానా. చెప్పినా నాకర్థం గావనుకో"

"డాడీని అడగనా?"

"వద్దొద్దు. నేనేదో చెప్పేనని నామీద కోప్పడతారు"

"నీ మీదెందుకు కోప్పడతారు?" సూటిగా ప్రశ్నించాను.

"నేను కావాలనే చెప్పానని"

"అయితే నీకు తెలుసన్నమాట..."

"అబ్బే నాకేం తెలీదురా. అయినా ఇవి పెద్దవాళ్ళ విషయాలు. మేం మేం చూసుకుంటాంగాని నువ్వెళ్ళి పడుకోరా"

"నువ్వేదో దాస్తున్నావని నా కర్థమైందిలే. సరే. నన్ను చూసి భయపడుతున్నా, నాకు చెప్పకూడదనుకున్నా ఓకే చెప్పొద్దు. కాని గోటితో గిల్లితే పోయేదాన్ని గొడ్డలితో నరకాల్సిన స్థితికి తీసుకురావద్దు. బై మమ్మీ..."

ముఖంలోని రక్తమంతా ఒక్కసారిగా ఇంకిపోగా మిర్రిమిర్రి చూస్తుండిపోయింది మమ్మీ.

ఆమె కళ్ళనిండా నీళ్లు! భయాల నీడలు!

★ ★ ★

ఉదయమే లేచి డ్రెస్సప్ అవుతుంటే "ప్రైవేటు క్లాసు వుందా గాంధీ" అనడిగింది అమ్మ.

"ఒక ఫ్రెండుని అర్జంటుగా కలుసుకోవాలి మమ్మీ..."

"ఫ్రెండంటే అవాళ ఆసుపత్రి కొచ్చిందే ఆ అమ్మాయి... సహజ కాదుకదా? " చిరున వ్వులు చిందిస్తూ అంది.

"సహజే"

"అన్నయ్యలా నువ్వు మాత్రం తొందరప డకు సుమా. నువ్వు తొందరపడవనుకో అయినా చెప్పడం నా బాధ్యత"

"బహుశా ఇప్పుడు కలిసి గుడ్‌బై చెప్పా స్తానేమో"

"గాంధీ! ఏమైందిరా? ఏమైనా గొడవ పడ్డారా? "

"ఇదివరకు చెప్పానుగా మమ్మీ. తను ఆకాశం వంక చూస్తుంది. నేను నేలవంక చూస్తాను బై..."

అమ్మకి ముఖం చూపించలేక ఒకరకంగా చాటుచేస్తూ బయటికి నడిచాను.

బైక్ లేడీస్ హాస్టల్‌వైపు పరుగెడుతోంది.

మస్తిష్కంలో ఎన్నెన్నో ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి.

నిజానికి రాత్రి నా కంటిమీదకి కునుకు రాలేదు.

సహజ ధోకా ఇచ్చిందన్న భావన నన్ను నమిలేసింది.

చాలామందికన్నా భిన్నంగా వుంటానని ఒప్పుకుంటాను. కాని నేనెవరినీ బాధించను. పరులని మోసగించను. అన్యాయ అక్రమాలని సహించను. నీతినియమాలకి ప్రాణం ఇస్తాను. ఏరకంగా చూసినా నాలో వున్నవన్నీ మంచి లక్షణాలే.

అంతా నన్ను సమర్థిస్తారు. మెచ్చుకుంటారు. గౌరవిస్తారు.

అలాటి నన్ను సహజ కాదంటోంది. నా గుండె గుమ్మందాకా వచ్చి వెనుదిరిగింది.

నా ఆత్మవిశ్వాసంమీద సమ్మెటపోటు వేసింది సహజ!

అంతా నన్ను చూసి పగలబడి నవ్వుతున్నారన్న భావన నన్ను నిద్రపోనివ్వలేదు. సహజ పరాయిదవుతుందన్న ఊహ నా మదిని అల్లకల్లోలపరిచింది.

నాలో నేను కృంగిపోతూ విషాదావస్థలో రాత్రంతా గడిపేశాను.

నన్నెందుకు కాదంటోందో తెలుసుకుంటే గాని శాంతి లభించదని బయల్దేరాను.

సహజ సూటిగా సమాధానమిస్తుందనే నా ఆశ!

హాస్టల్ వార్డెన్ని కలిసి సహజని పిలిపించమని చెప్పాను.

"అప్పుడే తెల్లారిందన్నమాట. చదువు తప్ప అన్నీ కావాలి" విసుక్కుంటూ "విజిటర్స్ రూంలో కూర్చో" అందామె.

ఆవిడ ప్రతిదానికీ రేట్ల బోర్డు పెట్టిందని అప్పుడెప్పుడో సహజ చెప్పిన మాటలు గుర్తొచ్చాయి. సినిమాకెళ్తే ఒక రేటు, బోయ్ ఫ్రెండ్‌తో తిరిగి రావాలంటే ఒకరేటూ చొప్పున వసూలు చేస్తుంటుందట.

"మీరు స్ట్రిక్టుగా వుండరన్నది బహిరంగ రహస్యం. స్ట్రిక్టుగా వున్నా నాకేం అభ్యంతరంలేదు. విజిటింగ్ అవర్స్‌లోనే వచ్చాను. మీరు నాలాటి వారిమీద విసుక్కోవడం మానేసి మీ బాధ్యతని మీరు సక్రమంగా నిర్వర్తించడం నేర్చుకోండి. లేకపోతే రేపటి రోజున ఏదైనా అవాంఛనీయ ఘటన జరిగితే దానికి మీరే బాధ్యత వహించక తప్పదు. ఎందరో తల్లిదండ్రులు మీమీది భరోసాతో తమ కూతుళ్ళని హాస్టల్లో చేర్చారని మరచిపోకండి" అనేశాను.

అవాక్కయిందామె.

విజిటర్స్ రూంలోకెళ్లి పచార్లు చేస్తున్నాను.

నిమిషాలు దొర్లుతున్నాయిగాని సహజ రాలేదు.

ఆమె రూమ్మేట్ కాబోలు వచ్చి "మీరా! తనింకా లేవలేదు. మీరొచ్చారని చెప్పి లేపు





తానుండండి" అంటూ వెళ్ళిపోయింది.

నా ఫోన్ పిలుపు విన్పిస్తే చాలు ఎక్కడ ఏ స్థితిలో వున్నా లేడికూనలా పరుగున వచ్చేది సహజ.

అలాంటిదిప్పుడు ఆమె స్నేహితురాలు వచ్చి వెళ్ళిన అరగంటకి వచ్చింది. నైటీలోనే వుందింకా.

ఏమిటన్నట్టు విసుగ్గా చూసింది.

"నీతో మాట్లాడాలని వచ్చాను"

"ఏం మాట్లాడతావు? " ఆవులిస్తూ అంది. ఎర్రబారిన ఆమె కళ్ళు సగంరాత్రి గడిచాక గూటికి చేరుకుందన్న సంగతి చెప్పక చెబుతున్నాయి.

"మన మధ్య మాట్లాట్టానికేమీ లేదా? "

"అబ్బా. నాకసలే తలపోటుగా వుంది. ఏం మాట్లాడాలనుకుంటున్నావో త్వరగా మాట్లాడేసేయ్"

నిన్నమొన్నటిదాకా నన్ను పొగుడుతూ నా చుట్టూ ఉపగ్రహంలా తిరిగిన సహజ ఈమే అంటే నమ్మలేనంతగా మారిపోయిందామె ప్రవర్తన.

"మాట్లాడూ..."

"నన్ను ప్రేమిస్తున్నావా లేదా? "

"ఒకప్పుడు ప్రేమించాను. ఇప్పుడు కాదు"

అలాటి సమాధానమే ఊహించాను. అయినా షాకింగ్‌గా అన్పించింది. గుండె గదుల్లోపల ఏదో తెలీని మంట. మరేదో కాల్తున్న భావన! బాధ!

"కారణం తెలుసుకోవచ్చా? "

"తెలుసుకునేం చేస్తావు? " లేచి పచార్లు చేస్తూ అంది.

"వీలైతే దిద్దుకుంటాను"

"నువ్వు దిద్దుకున్నా, తల్లకిందులుగా తపస్సు చేసినా నేను అడుగుని వెనక్కి తీసుకోలేను"

"ఎంచేత? "

"మనవి ఉత్తర దక్షిణ ధృవాలని తెలిసిపోయింది. మన పరిచయం ఓ స్వప్నం అనుకోవడం మనద్దరికీ మంచిది"

"నాలో ఏమైనా మార్పు వచ్చిందా? "

"లేదు. రాలేదు గనుకే నేను మారిపోయాను" చిత్రంగా నవ్వింది.

"మరైతే ఒకప్పుడు నచ్చిన నేను ఇప్పుడెందుకు నచ్చటంలేదు? "

"నిజంగా ఆన్సర్ కావాలా? "

"కావాలి. నిన్ను బతిమాలాలనో, మార్చాలనో అడగటంలేదు. నా జీవితంలోకి ఎందుకొచ్చావో, అర్థాంతరంగా ఎందుకు నిష్క్రమిస్తున్నావో తెలుసుకోవాలని మాత్రమే అడుగుతున్నాను"

"తెలుసుకునేం చేస్తావు? సహజ ధోకా ఇచ్చిందని చెప్పి ఆ శిరీష సానుభూతి మూటగట్టుకుని ఆమె ఒళ్ళో సేదదీరుదామనా? "

"షటప్"

"ఆ శిరీషతో నీ తిరుగుళ్ళు నాకు తెలీవనుకోకు" ఉక్రోషపడింది.

"అసహ్యంగా మాట్లాడకు. ఆమె ఒక ఫ్రెండ్. దట్సాల్"

"ఫ్రెండ్ లవ్వర్‌గా మారకూడదా? "

"అనవసర ప్రసంగం వద్దు. నేనడిగిందానికి నీ సమాధానం సూటిగా చెప్పు"

"ఓకే. వినటానికి నీకు లేని భయం చెప్పటానికి నాకెందుకూ. నువ్వు ఎర్రగా బావుంటావు. దురలవాట్లేవీ లేవు. మంచివాడివన్న పేరుంది. వీటన్నిట్నీ మించి డీసిటివోగారి అబ్బాయివి. ఎన్నో ఆస్తులున్నాయని, ఏదో రోజున అమెరికా వెళ్ళి కోట్లకి పడగెత్తుతావని ఆశపడ్డాను. ప్రేమించాను"

"నేను డాలర్ డ్రీమ్స్ కననని ఎన్నోసార్లు చెప్పానుకదా"

"చెప్పావు. అయినా నిన్ను మార్చగలనని ఆశించాను. నిన్ను మార్చడం ఓ భ్రమ అని తేలిపోయింది. నా ప్రేమ ఎగిరిపోయింది"

"అంటే నువ్వు ప్రేమించింది నన్ను కాదు అమెరికా వీసాని"

"ఎగ్జాట్లీ. అమెరికా భూతల స్వర్గంలో మహారాణిలా బతకాలన్నది నా బంగారు

స్వప్నం. ఆ స్వప్నాన్ని సత్యం చేసుకోడానికి నేనేం చెయ్యడానికైనా వెనుదీయను"

ఆమె అమాయకత్వానికి జాలేసింది. మందహాసం చేస్తూ అన్నాను. "పిచ్చి దానా... మురారి యావరేజ్ స్టూడెంట్. అమెరికాకి వెళ్ళలేడు. పైగా నువ్వతన్ని అందరిముందూ ఘోరంగా అవమానించిన సంగతి అతడెప్పటికీ మరచిపోలేడు"

"నువ్వే పిచ్చివాడివి. మురారి దాన్ని స్పోర్టివ్‌గా తీసుకున్నాడు. నిజానికి ఆ అవ మానమే నన్ను తనదాన్ని చేసుకొమ్మని పురిగొల్పింది. సుపీరియారిటీ కాంప్లెక్సుతో లెక్చర్లిచ్చే నీకన్నా నా కోసం పడిచస్తోన్న మురారే బెటర్ అనుకున్నాను..."

"సహజా!"

"అసహజాన్ని కాదు. సహజనే చెబుతు న్నాను. అన్నట్టు గాంధీ... ఆడపిల్ల తను ప్రేమించిన వారికన్నా తనని ప్రేమించినవా రిని పెళ్లాడితేనే ఎక్కువ సుఖపడుతుందిట కదా. నువ్వు చదివిన పుస్తకాల్లో ఎక్కడైనా ఈ కొటేషన్ కన్పించిందా? "

ఆమె మాటలు పట్టించుకోకుండా అన్నాను. "మురారి బంగారుపిచికే. అమె రికా వెళ్ళడానికీ కోట్లు సంపాదించడానికీ ఆ అర్హత సరిపోతుందంటావు? "

"ఓరి అమాయకుడా. నేన్నీలా అమాయ కురాల్ని కాదు. నేను వేసే ప్రతి అడుగూ ఎంతో కేలిక్యులేటెడ్‌గా వేస్తాను. ఎన్నోర కాల కేలిక్యులేషన్స్ వేశాకే నిర్ణయం తీసుకు న్నాను"

"ఇప్పుడేసిన కేలిక్యులేషన్స్ ఏవిటో!"

"మురారికి హెచ్ ఒన్ బి వీసా వచ్చింది. షాకయ్యావుకదూ? బట్ ఇటీజ్ ట్రూ. అతడి బంధువులకక్కడ సాఫ్ట్‌వేర్ కంపెనీ లున్నాయి. వాళ్లు పంపారు. ఎగ్జామ్స్ అవ డంతోనే మురారి వెళ్తాడు. అతడి వెనక నేను వెళ్తాను. ఇద్దరం సాఫ్ట్‌వేర్ రంగంలో కృషిచేస్తాం. ఆనక స్వంతంగా ఓ కంపెనీని స్టార్ట్ చేస్తాం. కోట్ల డాలర్లకి అధిపతులమై మహారాజయోగం అనుభవిస్తాం"

"డబ్బు కోసం, విలాసవంతమైన జీవితం కోసం ప్రేమనీ మనస్సునీ వంచించుకుం టావా? "

పగలబడి నవ్వింది సహజ.

"సహజా!"

"మనీ మేక్స్ మెనీ థింగ్స్. డబ్బులేని వాడు డబ్బుకి కొరగాడు. ధనమేరా అన్నిటికీ మూలం. ఈ ప్రపంచం నడు స్తోంది రూపాయిబిళ్ల అంచుమీద. సారీ. డాలర్‌నోటు రెపరెపల గాలికి!"

"డబ్బుకోసం శరీరాన్నమ్ముకునే వేశ్యకీ నీకూ తేడా లేదు"

"లేకపోతే పోనీయ్. ఐ డోంట్ కేర్"

"ఛా. నువ్వంటే అసహ్యం పుడుతోంది. నువ్వింతగా పతనమవ్వగలవని కలలో సైతం ఊహించలేదు. నీతో స్నేహం చేసి నందుకు సిగ్గేస్తోంది. నిన్ను ప్రేమించినం దుకు నామీద నాకే అసహ్యం పుడుతోంది"

"హియర్ హియర్" చప్పట్లు కొడుతూ అంది సహజ. "అవినీతి చక్రవర్తి కొడుకు పరిశుద్ధ యువరాజులా మాట్లాడుతున్నాడు చూడండి! వినండి! చప్పట్లు కొట్టండి!"

"సహజా! హోల్డ్ యువర్ టంగ్"

"నా నోరు మూయగలవు. లోయ నోరు మూయగలవు. లోకం నోరు మూయగ లవా? అలా వెలుగులోకెళ్ళి చూడు. కళ్లుంటే కన్పిస్తుంది. చెవులుంటే విన్పి స్తుంది. మీ నాన్నలాటి అవినీతిపరుడెక్కడా వుండడు"

"ఏం కూశావ్..." ఆవేశంతో విచక్షణ మరచి చెయ్యెత్తాను. అంతలోనే నిగ్రహిం చుకుని "ఛా... నీది నాలుకా, తాటి పట్టా? " అన్నాను.

"నాలుకే. నీలా కళ్లు మూసుకుని పాలు తాగే పిల్లినాలుక కాదు. నిజం నిర్భయంగా చెప్పే నాలుక. మీ నాన్న ఎందరు వ్యాపా రుల్ని పీడించి, ఎందర్ని ఎన్ని రకాలుగా బ్లాక్‌మెయిల్ చేసి మరెన్ని రకాల దొంగలె





క్కలు చూపించి అన్ని ఆస్తులు సంపాదిం చాడో ఆ లెక్కలూ తప్పొళ్ళూ నీకు తెలీక పోతే మీ నాన్నని అడుగు. చెబుతాడు. అంతా తెలుసుకున్నాక మీ నాన్నని అస హ్యించుకుంటే అప్పుడు అప్పుడొచ్చి నా మొఖంమీద ఉమ్మేయ్. భరిస్తాను. అస హ్యించుకో సహిస్తాను. అంతవరకూ నీకు నావంక వేలెత్తి చూపే అర్హత కూడా లేదు. మైండిట్"

నాటుబాంబులాంటి మాటలని నామీదకి విసిరేసి ఆమె నిష్క్రమించింది.

వేయి వక్కలయ్యాయి నా గుండెలు! నా విశ్వాసం!

★ ★ ★

"గాంధీ! అదేవిట్రా! అలా వున్నావేంట్రా. ఏవయ్యిందిరా నీకూ..." నా వాలకం చూస్తూనే బెంబేలు పడింది అమ్మ.

"నాకేం కాలేదు మమ్మీ. నేను బాగానే వున్నాను"

"గాలో, ధూళో సోకిన వాళ్ళావున్నావురా. పొద్దున్న బయటికెళ్ళినప్పుడు బాగానే వున్నావు. ఇంతలో ఏవయిందిరా కన్నా. ఎక్కడైనా జడుసుకున్నావా? "

"అలాంటిదేం లేదుగాని నాక్కొన్ని నిజాలు చెబుతావా మమ్మీ? "

"నిజాలు చెప్పడం ఏవిట్రా"

"నాకు తెలీని నిజాలు ఇన్నాళ్ళూ తెలీ కుండా దాచిన నిజాలు కావాలిప్పుడు. రా మమ్మీ. ఇలా వచ్చి కూర్చో చెబుతా"

"అసలివాళ నీకేమయ్యిందిరా? "

"ఒకమ్మాయి నా కళ్లు తెరిపించిందమ్మా. ఇన్నాళ్ళూ నేను నివసిస్తున్నది పవిత్రదేవాల యంలో కాదు. శ్మశానంలో. శవాల్ని పీక్కు తినే నక్కల మధ్య అని చెప్పింది"

"అయ్యో అవేం మాటల్రా" నోరు నొక్కు కుంది.

"అంతా వివరంగా చెబుతానుగా. మీ పెళ్ళయ్యేసరికి డాడీ ఏం చేసేవారు మమ్మీ"

"పాతికేళ్ళనాటి ఆ గొడవలన్నీ ఇప్పుడు తవ్వుకోవడం ఎందుకురా? "

"ఎన్ని మానవకంకాళాలు బయటప డ్తాయో తెలుసుకోవాలిగా. చెప్పు మమ్మీ"

"నీ మాటలు వింటోంటే భయమేస్తోం దిరా గాంధీ"

"నాకేం మతిభ్రమించలేదు. నువ్వు సత్య మేవిటో చెప్పకపోతే ఆ పని జరగొచ్చేమో"

"చాలు చాల్లే. అవేం అమంగళం మాటల్రా. పైన తథాస్తు దేవతలుంటారు ఏవనుకుంటున్నావో" కసిరింది.

"చెప్పు మమ్మీ. అప్పట్లో డాడీకెంత జీతం వచ్చేది? "

"మూడొందల యాభైకి పదో పాతికో తక్కువే వచ్చేదిరా. ఎల్డీసీగా చేసేవారు. తర్వాత అయిదేళ్ళకి కాబోలు యుడీసి అయ్యారు. అంచెలంచెలుగా ఎదిగి ఈ స్థాయికి చేరుకున్నారు. ఆయన్తో చేరినవా ళ్ళలో ఇద్దరో ముగ్గురో మాత్రమే ఇంత పెద్ద ఆఫీసర్లయ్యారు. ఏ మాట కామాటే చెప్పుకోవాలి. మీ డాడీనీ, ఆయన చేసే పనినీ పైఅధికారులంతా మెచ్చుకుంటూ వుంటార్రా. అందుకనే అన్ని ప్రమోషన్లొచ్చి చకచకా మెట్లెక్కేశారు"

"డాడీకి వాళ్ళ డాడీనుంచి ఏమాత్రం ఆస్తి పాస్తులు సంక్రమించాయి? "

"ఆc చెప్పుకోడానికే వుంది. పల్లెలో చిన్న ఇల్లూ, ఎకరం మడి చెక్కానూ. మంచి కుటుంబం, కుర్రాడు బుద్ధిమంతుడూ అని నన్నిచ్చి పెళ్ళిచేశారుగాని ఆస్తిపాస్తులున్నా యని కాదు. వాటిమీద మీ తాతయ్యకి ఆస క్తిలేదు"

"ఇప్పుడు మనకేమేం ఆస్తిపాస్తులున్నాయి మమ్మీ"

"ఈ ఇల్లూ, ఒక అపార్టుమెంటూ, పల్లెలో పదెకరాల పొలం, ఊరవతల పన్నెండెక రాల ద్రాక్షతోట, నాలుగైదు ఇళ్ళస్థలాలూ వున్నాయి. పది లక్షలదాకా రొక్కం వుంది. దాంతోనే ఆనంద్ చేత వ్యాపారం చేయిద్దా మని చూస్తున్నారు. నీకు లోటు చెయ్య

ర్లేరా. నువ్వు చదువుకోవాలిగాని విదేశాలకి వెళ్తానన్నా పంపిస్తారు మీ డాడీ"

"డాడీకి జీతమెంత వస్తుంది?"

"అన్నికటింగులూ పోను తొమ్మిదివేలో ఎంతో వస్తుంది"

"అది ఇంటి ఖర్చులకే చాలదు. క్లబ్బుకీ, కారుకీ బోల్డంత ఖర్చు అవుతుందికదా. ఏం మమ్మీ"

"అవుతాయేమోలే. అవన్నీ మనకెందుకు లేరా. మనం సుఖంగా వుండాలనేకదా అన్నీ తెచ్చిపడేస్తున్నారూ..."

"ఎలా తెస్తున్నారు? ఎక్కడ్నుంచి తెస్తున్నారు? ఇన్ని ఆస్తులెలా సంపాదించారు?"

"గాంధీ!"

"గాంధీనే ప్రశ్నిస్తున్నాను. ఇవన్నీ కేవలం జీతంలో సంపాదించారంటే నేనేకాదు ఎవరూ నమ్మరు. చెప్పు మమ్మీ. ఇంకెలా సంపాదించారు?" తీవ్ర స్వరంతో ప్రశ్నించాను.

"లంచాలు తీసుకుని!"

ఆ సమాధానం వచ్చినవైపు తిరిగాను.

డాడీ!

ఆగ్రహోద్రేకంతో వూగిపోతున్నారు.

"చెప్పరా. ఏం చేస్తావో చెప్పరా. ఈ ఇల్లూ, ఈ ఫర్నిచరూ మీ మమ్మీ మెడలోని నగలూ నీ ఒంటిమీద బట్టలూ నీకు కట్టిన ఫీజులు ఆఖరికి నువ్వు తిన్న తిండీ అంతా లంచంతో వచ్చిందేరా. నేనేకాదు ఈ దేశంలో నూటికి తొంభైమంది అధికారులి లాగే బతుకుతున్నార్రా. ఏం చేస్తావురా. చెప్పు. ఇది తప్పు అని మా అందరికీ నీతి పాఠాలు చెబుతావా? అవినీతి బురదని కడుక్కోండని బతిమాల్తావా? ఏసీబీ వాళ్ళకి చెప్పి పట్టిస్తావా? చెప్పరా. కమాన్ టెల్మీ" నామీదికొచ్చి మరీ ప్రశ్నించారు.

"మీరు చేస్తున్నది తప్పు. ఆత్మద్రోహం. ప్రభుత్వం దగ్గర జీతం తీసుకుంటూనే ప్రభుత్వాన్ని వంచిస్తూ ప్రజల్ని దోచుకోవడం ఘోరం! హేయం!"

"యస్. యూఆర్ కరెక్ట్. కాని నలుగురు నడిచిందే దారి. ఆ దారిలోనే పోతున్నాన్రా. నలుగురితో నారాయణ అంటున్నాన్రా..."

"మీరెంతో సిన్సియర్ ఆఫీసరనుకున్నాను. మీ కష్టార్జితంతో ఇవన్నీ సంపాదించారని గర్విస్తున్నాను. మీరు... మీరు... తులసివనంలో గంజాయిమొక్క అనుకోలేదు"

"మైడియర్ గాంధీ. ఊహల్లో విహరించకు. ఇదీ వాస్తవం అని చెబుతున్నాగా. ఇప్పుడైనా గ్రహించరా. ఇవాళ ఈ దేశం పవిత్ర తులసివనం కాదురా గంజాయి వనం. అందులో అక్కడో ఇక్కడో నీలాంటి ఒక తులసిమొక్క వుంటుంది. గంజాయి ఘాటుకి ఉక్కిరి బిక్కిరై మాడిమసవుతుంది..."

"చాలా దారుణంగా మాట్లాడుతున్నారు..."

"నాకేం పచ్చకామెర్ల వ్యాధి రాలేదు. నువ్వే రంగు కళ్ళజోడు లోంచి చూస్తున్నావు. దేశం అంత గొప్పది, ఇంత గొప్పది, పుణ్యదేశం, పవిత్రదేశం, వేద భూమి, సత్యాహింసల భూమి అంటూ పుస్తకాల కబుర్లు వల్లిస్తున్నావు. నువ్వనుకుంటున్నదేదీ నిజంకాదు. దేశంలోని నాయకులూ, కాంట్రాక్టర్లూ, అధికారులూ, వ్యాపారులూ, ఉద్యోగులూ వాళ్ళూ వీళ్ళూ అని కాదు ఆస్తులు సంపాదించిన ప్రతీవాళ్ళూ అవినీతి మార్గాన సంపాదించారని ఖచ్చితంగా చెప్పగలను. నీళ్లు ప్రవహించనిచోట కూడా అవినీతి జీవనదియై ప్రవహిస్తోందని ఘంటాపథంగా చెప్పగలను"

ఆపాదమస్తకం కంపిస్తోంటే కొత్త మనిషిని చూసినట్టు చూశాను. డాడీలో నాకు తెలీని కొత్తమనిషి దాగున్నాడని ఆ మనిషికి పశ్చాత్తాపం అనేదే తెలీదని గ్రహించి నివ్వెరపోయాను.

"వాడేదో అన్నాడని మీరలా రెచ్చిపోతా





రెందుకండీ. ఊరుకోండి" అంటూ ఆందోళ నపడుతూ అడ్డొచ్చింది అమ్మ.

పరిస్థితి ఎక్కడికి దారితీస్తుందోనని ఆమె భయం!

"నిన్నకాక మొన్న కళ్లు తెరిచిన పిల్లకా కివి. కంబళిలో అన్నం తింటూ వెంట్రుకలొ చ్చాయేవిటని ఆశ్చర్యపడేస్థాయి నీది. ఆవే శమూ ఆదర్శాలూ కూడు పెట్టవు. నీ వయ స్సులో నేనూ నీలాగ ఎగిరినవాడినే. ఉద్యోగం కోసం లంచాలెందుకివ్వాలి, సిఫా రసులెందుకు చేయించాలని వాదించిన వాడ్నే. యువరక్తపు వేడి కాస్తా చల్లారేక ప్రపంచరీతి తెలిసొచ్చాక ప్రశ్నించుకోవడం మానేసి సుఖపట్టం నేర్చుకున్నాను. ఒక్క సంగతి తెలుసుకో చాలు. మనం జీవిస్తున్న వ్యవస్థ వుందే ఇదో విషపుచట్రం. ఇందు లోంచి బయటపడి బతకలేం. ఇందులోనే బతకాలంటే చూసీ చూడనట్టు పోవాలి. మంత్రులకీ, పైఅధికారులకీ తాళం వెయ్యాలి. నైవేద్యాలు సమర్పించాలి. అందుకోసం కిందివాళ్ళ నుంచి ఫలహారాలు స్వీకరించాలి. కాకుల్ని కొట్టి గద్దలకి వేస్తూ మధ్యలో బాగుపడ్డవాడే బతకనేర్చినవాడు. వాడే నాలాగా పైకొస్తాడు. వెధవాలోచ నలూ పనికిరాని ఆదర్శాలూ మాని బుద్ధిగా చదువుకో. పైకొస్తావు..."

పిల్లకాకిని చూసి నవ్వినట్టు నవ్వి వెళ్తోంటే డాడీని ఆపాను.

"మీరు నీతిగా నిజాయితీగా వుండలేరా? నెత్తురు కూడు తినకుండా బతకలేరా?"

"బతకొచ్చు రోడ్డుపక్కన గుడిసేసుకుని బతకాలనుకుంటే మారాజులాగా బతకొచ్చు"

"మీరో బాధ్యతాయుతమైన స్థానంలో వున్న అధికారి..."

"అందుకే. నా అవసరం పదిమందికి వుంది గనుకే అంతా నా చుట్టూ తిరుగుతు న్నారు. లంచాలిస్తున్నారు. లేకపోతే నా వంక చూడరు. రూపాయి విదల్చరు. స్థానాన్ని బట్టే విలువ వుంటుంది. దేవుడి కైనా అంతే నాయకుడికైనా అంతే ఉద్యోగి. కైనా అంతే"

"మిగతావాళ్ళ సంగతలా వుంచండి. మీరెందుకు అవినీతికి పాల్పడుతున్నారు డాడీ. మీకేం తక్కువని? మా డాడీ అని మేం గర్వించేట్లు మీరెందుకుండకూడదు?"

"ఈ వ్యవస్థ వుండనివ్వదురా. ప్రమోషన్లకీ ట్రాన్స్ఫర్లకీ అయిన దానికీ కాని దానికీ నైవే ద్యాలు సమర్పిస్తూనే వుండాలి. లేకపోతే గొర్రెతోక గుమస్తాగా వుండిపోవాలి. కోరిన తిండీ, నచ్చిన బట్టా లేక ముక్కుతూ మూల్గుతూ లైఫ్ని ఈడ్చాలి. అది నావల్ల కాదు. కేవలం నేనొక్కడ్నే సుఖపడాలని నేను బల్లకింద చెయ్యి పెట్టడం లేదు. మీ అందరి కోసం మీకు విలాసవంతమైన చక్కని జీవితం ఇవ్వడంకోసం సమాజంలో మీకు గౌరవప్రదమైన స్థానం కల్పించడం కోసం చేశాను, చేస్తున్నాను. అంతే తప్ప నేనేదో బావుకుందామనీ అంతా మూటగట్టు కుని చచ్చేక నాతో పట్టుకుపోదామనీ కాదు"

"దారి దోపిడీలూ హత్యలూ ఎందుకు చేస్తున్నావని నారదుడు ప్రశ్నిస్తే వాల్మీకి ఇచ్చినలాటి సమాధానమే మీరు చెబుతు న్నారు"

"ఏకాలంలోనైనా అదే సత్యంరా"

"మేం కూడా వాల్మీకి భార్యలాగా జవా బిస్తే? మీ పాపంలో మాకు భాగం లేదంటే ఏం చేస్తారు?"

"వాల్మీకిలా రుషిగా మాత్రం మారను" నవ్వేరాయన.

"డాడీ! ప్లీజ్! అయ్యిందేదో అయ్యింది. ఇకనుంచైనా నీతిగా బతుకుదాం. నిజాయి తీగా వుందాం. మంచం వున్నంత మేరే కాళ్ళు చాపుకుందాం. అత్యాశకి పోవద్దు. సుఖలాలసకోసం అర్రులు చాచొద్దు. ఉన్న దాంతో తృప్తిగా జీవిద్దాం. నా మాట వినండి ప్లీజ్. మమ్మీ నువ్వైనా చెప్పు. అందరికీ ఆదర్శంగా ఎందరికో గర్వకార ణంగా వుండటంలో ఎంతో తృప్తి వుంది.

సుఖం వుంది. శాంతి వుంది. అనుక్షణం భయపడుతూ అందరికీ సలాములు కొడుతూ దేబిరిస్తూ బతికే ఈ బతుకొద్దని చెప్పు మమ్మీ. తాతయ్య కూడా ఎంతో గర్విస్తారు. పొంగిపోతారు మమ్మీ" ప్రాధేయపడ్డాను.

"మీ తాతయ్య కూడా నీలాగే చెప్పి బతిమాలి భంగపడి నా ఇంటికి రావడం మానుకున్నార్రా గాంధీ. నువ్వు నాకు చెప్పేంతవాడివి కాలేదుగాని నీ గొడవ నువ్వు చూసుకో. నువ్వు చెప్పినట్టు నువ్వు బతికి చూపించు. నువ్వప్పుడు ఆనందంగా వుంటే చూసి సంతోషిస్తాం. ప్రవాహంలో పడ్డవాడికే తెలుస్తుందిరా అందులోంచి బయటపడటం ఎంత కష్టమో!"

"మీరు మారరా డాడీ?"

"మారాలని లేదు. నిజంగా మారాలనుకున్నా మారలేను. ఈ వ్యవస్థ నన్ను మారనివ్వదు. వేటాడి మరీ చంపుతుంది"

"ఏవండీ. అవేం మాటలండీ" ఏడ్చేసింది అమ్మ.

"ఓకే డాడీ. మీరు మారలేరు. నేనూ మారలేను. మీరు పెట్టే అవినీతి కూడు తినలేను. నేను తిన్నదీ పీల్చింది అవినీతిమయం అని తెలిసినప్పట్నుంచి నామీద నాకే అసహ్యం వేస్తోంది.. అన్నప్రాసన నాటినుంచీ తిన్నదంతా కక్కెయ్యగలిగితే బాగుణ్ణనిపిస్తోంది. లంచాల తిండితో పెరిగిన ఈ శరీరాన్ని చీల్చేసుకుని పరిశుద్ధుడ్నవ్వాలనిపిస్తోంది. ఇంక నేనీ ఇంట్లో వుండలేను. మీ నీడని కూడా భరించగల శక్తి లేదు. బై డాడీ గుడ్‌బై" విసురుగా బయటికి నడిచాను.

"గాంధీ! ఆగరా ఎక్కడికి కెళ్తావురా" రోదిస్తూ పిలుస్తోంది అమ్మ.

"వెళ్ళనీ. నాల్రోజులు మాడితే ఆ తిక్క కుదుర్తుంది. తిన్నగా ఇంటికొస్తాడు"

"గాంధీ... ఒరే గాంధీ..."





అమ్మ పిలుపుని పట్టించుకోకుండా బైక్ దగ్గరికెళ్లాను.

దాన్ని ఎందరు చిరువ్యాపారుల్ని "పిండి" కొన్నారో అన్పించింది. గిరుక్కున వెనుదిరిగి రోడ్డుమీద పడ్డాను.



బయట చీకటి. బస్సులో చీకటి... నా గుండెల్నిండా చిక్కని చీకటి.

బస్సు రొదచేస్తూ పరుగెడుతోంది. ప్రయాణీకులు నిద్రతో జోగుతున్నారు. కొందరేకంగా గురకపెడుతున్నారు.

నాకు మాత్రం పొడికళ్ళుపడ్డాయి.

కొద్ది గంటలక్రితంవరకూ నేను ఓ అధికారి పుత్రుడ్ని. ధనవంతుల బిడ్డని. చీకూ చింతా లేకుండా ఎం.సి.ఏ. చదువుతున్న వాడ్ని.

ఇప్పుడు నేను కేవలం గాంధీని. జేబులో కొద్ది రూపాయలూ ఒక ఉంగరం, వాచీ తప్ప మారు జత కూడా లేనివాడ్ని.

జాతిపిత గాంధీజీ వదలివెళ్లినవి కళ్ళజోడూ, కాలి చెప్పులూ జేబువాచీ. అదే భారతీయత, అదే పరమార్థం అంటారు తాతయ్య.

మదర్‌థెరిస్సా ఆస్తి చేతిసంచీ, ఓ జత బట్టలూనట!

డ్రైవర్ సడన్ బ్రేకు వేశాడు. ముందుకి తూలిపడ్డాను. నుదురు బొప్పికట్టింది.

డ్రైవర్ని కొందరు తిట్టారు. మరి కొందరు ఏవయ్యిందోనని ఆత్రంగా చూశారు.

నక్క రోడ్డుకడ్డం పడిందని చెప్పేడు డ్రైవరు.

మెల్లగా సర్దుకుని పడుకుని మళ్ళీ నిద్ర లోకి జారుకున్నారంతా.

మళ్ళీ ఆలోచనల ఊబిలో దిగబడ్డాను.

నేను మంచివాణ్ణి. డిస్టింక్షన్తో పాసవు తాను. చక్కని ఉద్యోగం రావొచ్చు కూడా. అయినా తనని పెళ్ళాట్టానికి విముఖత చూపింది సహజ.

కారణం? కేవలం తనకి అమెరికా వెళ్ళి డాలర్లు ఆర్జించే ఆలోచనలేదని!

ఆ ఒక్క కారణంతోనే తనని తిరస్కరిం చింది. ఇన్నాళ్ళ ప్రేమని గాలికొదిలి మురారి వెంటబడింది.

ప్రేమకన్నా మనిషికన్నా మనసుకన్నా డబ్బెక్కువని రుజువుచేసింది సహజ!

ప్రభుత్వ ఉద్యోగం, ఆఫీసరు హోదా, చక్కని జీతం వున్నా సరే డాడీ అవినీతికి పాలుపడుతున్నారు.

కారణం? డబ్బు. డబ్బు తెచ్చిపెట్టే ఆస్తులూ, సుఖాలూ, హోదాలూ!

నీతికన్నా, నిజాయితీకన్నా, సంస్కారం కన్నా డబ్బు ఎక్కువని గొంతెత్తి మరీ చెప్పారు డాడీ.

నా కెంతో కావాల్సిన నా వాళ్ళు నా రెండు చెంపల్నీ వాయించారు!

వాటెపిటియబుల్ థింగ్!

ఇన్నాళ్ళూ నా చుట్టూ వున్న ప్రపంచం ఎంతో పచ్చనిదీ అందమైనదీ అనుకు న్నాను. కొన్ని అపస్వరాలున్నా కొన్ని అన ర్థాలు జరుగుతున్నా కొన్ని లోపాలూ దోషాలూ దోపిడీలూ వున్నా మొత్తానికి రిపేరబుల్ స్థాయిలోనే వున్నాయి సమా జమూ దేశమూ అనుకున్నాను.

అంతా చేతులు కలిపితే అందర్లో అవగా హన పెరిగితే కొందరైనా విచక్షణని విని యోగిస్తే నా దేశం ప్రపంచానికే మార్గద ర్శకం అవుతుందనుకున్నాను.

కాని నా ఆశలన్నీ పేకమేడల్లా కుప్పకూ లిపోయాయి.

డాడీ అన్నట్టు ఈ వ్యవస్థ కుళ్ళిపో యింది. కుష్టువ్యాధి గ్రస్తమైంది. అలా అని దాని వేళ్ళు నరికవెయ్యలేనంతగా శరీర మంతా వ్యాపించింది!

ఇక ఈ వ్యవస్థ నెవరు శుద్ధిచెయ్యగలరు!? ఈ దేశాన్నెవరూ బాగుచెయ్యలేరు.

ఏ మహాప్రళయమో వస్తే తప్ప కలియు గాంతమైతే తప్ప మరో ఆశేమీలేదు.

డిప్రెషన్తో కృంగిపోతున్నానని తెలుసు. విరక్తి వేల చేతులు చాపుతోందని తెలుసు. చీకటి మింగేస్తోందనీ తెలుసు.

అయినా ఏమీ చెయ్యలేని అశక్తుడ్ని! పరాజితుడ్ని!

ఇటువంటి స్థితిలో కూడా కన్నీళ్ళు రాక పోవడమే చిత్రాతిచిత్రం!

మళ్ళీ సడన్ బ్రేకు వేశాడు డ్రైవరు.

"ఈసారి గాడిద అడ్డొచ్చిందేంట్రా" ఎవరో కోపంగా అడిగారు.

బస్సు తలుపులు బాదారు కొందరు. డ్రైవర్ని బయటికి లాగారింకొందరు. డ్రైవర్ పక్కనున్న డోర్లోంచి ఓ ఇద్దరు లోపలి కొచ్చి బస్సు డోర్ తీశారు. మరికొందరు లోపలికొచ్చారు.

లైట్లు వెలిగాయి.

ముసుగు మనుషుల్ని చూసి విస్తుబో యామంతా. ఆడవాళ్ళైతే ఏడుపందుకు న్నారు.

"ష్... త్వరగా మీ దగ్గరున్న డబ్బూ నగలూ అన్నీ ఇచ్చెయ్యండి. నకరాలు చేశారో ఖతం..." తుపాకితో బెదిరించాడొ కడు.

ఒక డబ్బా చూపుతూ "వెధవ్వేషాలేస్తే ఈ డబ్బా లోని పెట్రోలు గుమ్మరించి అగ్గి గీస్తా. మాడి మసై పోతారంతా" అన్నాడిం

కొకడు.

చావు భయం ఒక్కసారిగా చుట్టేసిందం దర్నీ.

నగల్ని ఒలిచి ఇచ్చారు. డబ్బుని దోసి ళ్లలో పోశారు.

దాచుకోజూసిన ఇద్దరు ముగ్గురి తలమీద తుపాకి మడమతో మోదారు. తల చిట్లి రక్తం చిందింది. అది చూసి మిగతా వాళ్ళు బెంబేలుపడిపోయి ఏడుస్తూనే తమ దగ్గరు న్నదంతా ఇచ్చేశారు.

ఇదివరకైతే ఎదిరించేవాడ్ని. ఇది అన్యాయం, నేరం అంటూ వాదించే వాడ్నేమో కు ా. కానిప్పుడు నిర్వికారంగా చూస్తూ కూర్చున్నాను. మా డాడీ చేసిన దోపిడీ ముందు ఇదెంతనీ!

డాడీ టక్ చేసుకుని టైకట్టుకుని కారులో తిరుగుతూ సలాములందుకుంటున్నారు.

వీళ్ళు ముసుగు వేసుకుని రాత్రివేళ బస్సునాపి ఎంతో రిస్కుతీసుకుని మరీ దోపిడీ చేస్తున్నారు.

"ఏంట్రా అలా చూస్తున్నావ్. త్వరగా ఇయ్యి" నా వాలకం చూసేసరికి ఒళ్ళు మండిందేమో గద్దించాడొకడు.

"నాదగ్గరేమీలేదు"

"ఉన్నదే ఇవ్వవోయ్..."

జేబులోని పర్సు తీసిచ్చాను. గబుక్కున నా చేయిపట్టుకుని "వీటిని నీ బాబుకిస్తా వేంట్రా... తియ్" అన్నాడు.

వాచీ, ఉంగరాలని అతడి చేతిలో పెట్టాను.

తమ పని ముగించుకుని వెళ్ళిపోయారు దొంగలు.

ఘొల్లుమన్నారు జనం. నానా శాపనా ర్థాలు పెట్టారు. అసలు బస్సునెందుకాపా వని డ్రైవర్ని నిలదీశారు కొందరు. బస్సు బయల్దేరిన వేళ మంచిది కాదని ఒకరంటే అసలీవాళ ప్రయాణమే చేయకూడదని పంచాంగంలో రాశారన్నారింకొకరు. తమ ప్రారబ్ధం అని కొందరు విలపిస్తే ఎరువు నగలంటూ వాపోయారింకొందరు.

అంతామాత్రం వెంటనే దగ్గర్లోని పోలీస్ స్టేషన్లో రిపోర్టివ్వాలన్న ఏకాభిప్రాయాన్ని వ్యక్తపరిచారు.

బస్సు పోలీస్‌స్టేషన్ ముందాగింది.

గతుక్కుమన్నారు కొందరు.

ఇక్కడి స్టేషన్లో రిపోర్టిస్తే మాట మాటకీ ఈ ఊరు రాలేమన్నారు కొందరు. కోర్టులచుట్టూ తిరగలేమన్నారు మరికొం దరు. రిపోర్టివ్వాల్సిందే అన్నారు నగలు పోగొట్టుకున్న ఆడవాళ్ళు.

రిపోర్టిచ్చి ప్రయోజనం లేదు. నగలు దొరకవు. ఒకవేళ దొరికినా మన చేతికిరా నీకుండా పోలీసులే మింగేస్తారన్నారు కొందరు. ఇన్సూరెన్సు చేయించి ఉండాల్సిం దని బాధపడ్డారొకరు.

ఈలోగా డ్రైవరూ కొందరు ప్రయాణీ కులూ దిగి వెళ్ళి యఫ్. ఐ. ఆర్. రాయిం చారు.

ఎస్సై వచ్చి "మీరంతా కిందికి దిగి వచ్చి ఏమేం పోయాయో రాసివ్వండి. చుట్టు పక్కలి స్టేషన్లకి మెసేజ్ ఇచ్చాను. దోపిడీ దొంగల్ని పట్టెయ్యడం ఖాయం. మీమీ వస్తువుల్ని మీకు అప్పజెబుతాం" అన్నాడు.

బిలబిలమంటూ దిగి వెళ్ళి రిపోర్టు రాసి చ్చారంతా.

వారిలో నేనూ ఉన్నాను.

ఆడవాళ్ళు ఎస్సై చుట్టూచేరి ఎలాగైనా దొంగల్ని పట్టుకుని తమ ఆభరణాలు అప్ప గించమని అర్థించారు. మంగళవారంపూట మంగళసూత్రాలు లాక్కుపోయారని కొంద రేడిస్తే పుట్టింటివారు పెట్టిన నగలని ముక్కు చీదారు కొందరు.

అన్నీ వింటూ అందర్నీ చూస్తూ స్టేషన్ అరుగుమీద కూర్చున్న నా దగ్గరికొచ్చాడొకా యన.

సిగరెట్టు వెలిగించుకుని గాఢంగా పొగ పీల్చి వదుల్తూ అన్నాడు "వీళ్ళ పిచ్చిగానీ ఏం లాభం లేదు"





నేను మాట్లాడలేదు.

"గాలికెగిరిన పేలపిండి కృష్ణార్పణం. దొంగలెత్తుకెళ్ళిన సొమ్ము పోలీసార్పణం..."

అప్పటికీ నేను మాట్లాడకపోయేసరికి "నేనేదో గొప్ప అనుభవంతో చెబుతోంటే బెల్లం కొట్టిన రాయిలా ఉలకవూ పలకవూ ఏంటబ్బాయ్" అన్నాడు.

"ఏం చెయ్యమంటారు"

"ఊకొట్టొచ్చుగా"

"ఊ కొడుతూ వినడానికి నా మూడ్ బాగోలేదు. నన్ను నా మానాన వదిలెయ్యండి"

"నీ మూడ్ మాత్రమే కాదోయ్ అందరి మూడ్సూ పాడుజేశారా దొంగరాస్కెల్సు. నా దగ్గర పిస్తోలు లేకపోయిందిగాని లేకపోతే పిట్టల్ని కాల్చినట్టు కాల్చేవాడ్ని"

"నా దగ్గరుంది ఇమ్మన్నారా?"

"నీ దగ్గరెందుకుంది? కొంపతీసి నువ్వు నక్సలైటువా ఏంటి ఖర్మ?" అంత పెద్ద మనిషీ పిట్టలా మారిపోయి అన్నాడు.

"నక్సలైటా? ఎవరూ ఎక్కడా?" తుపాకిని పొజిషన్లో పట్టుకుని మరీ దూసుకొచ్చాడో పీ.సీ.

"నక్సలైట్లు ఇక్కడెందుకుంటారు. ఉంటే అడవుల్లో లేదా జైళ్ళల్లో" అన్నాను.

"బస్సుని దోచింది దొంగలేనా లేక నక్సలైట్ల హస్తం వుందనిపించిందా?"

"ఎవరో ఎలా తెలుస్తుంది?"

"వెళ్ళేప్పుడు నినాదాలేమైనా చేశారా?"

"లేదు"

"అయితే వాళ్ళు నక్సలైట్లు కాదు"

పీ సీ వెళ్ళిపోయాడు.

సింహం కలలోకొస్తే ఏనుక్కి పిచ్చెక్కుతుందిట. నక్సలైట్ అన్న పదం చెవిన బడితే చాలు వీళ్ళు వెర్రెత్తిపోతూంటారు" అన్నాడా పెద్దమనిషి.

"ప్రాణభయం అందరికీ ఒకటే కదా"

"వీళ్ళకి ప్రాణభయం ఏవిటీ. వాళ్ళని ఎన్‌కౌంటర్ చేసి పతకాలూ ప్రమోషన్లూ కొట్టేద్దామని చూస్తూంటారంతే"

"ఇంతకీ నువ్వు నక్సలైట్ల సానుభూతిపరుడివా?" రహస్యంగా అడిగాడాయన.

"కాదు లెండి భయపడకండి"

"నాకు భయమేవిటి. ఇలా సామాన్యంగా కన్పిస్తున్నానుగానీ మా ఊళ్ళో నేను మహా పెద్దమనిషిని. నా మాటంటే మా ఊరికి వేదవాక్కనుకో. అసలు ఇంత దోపిడీ జరిగినందుకు వీళ్ళు గనుక ఇలా రిపోర్టులు రాసిస్తున్నారుగానీ ఇదే మా ఊళ్ళో అయితే ఇలా చెయ్యను"

"ఏం చేసేవారేమిటి?"

"అందరి దగ్గరా తలో వందా రెండొందలూ వసూలు చేసి ఇన్‌స్పెక్టర్ చేతిలో పెట్టేవాడ్ని. తెల్లారే సరికి మన వస్తువులన్నీ మన చేతుల్లో కొచ్చిపడేవి. నీకు తెలీదు కానబ్బాయ్. వాళ్ళకి, వీళ్ళకి చాలా లింకులుంటాయి. వాటా లుంటాయి. ఈశ్వరుడికి తెలీకుండా చీమైనా కుడుతుందేమో గాని వీళ్ళకి తెలీకుండా చిన్న దొంగతనం కూడా చెయ్యరంటే నమ్ము"

"ప్రస్తుతం ఈడ్చి తన్నినా ఎవరి దగ్గరా పైసా లేదు"

నా మాటలకి ఒళ్ళు మండిందో ఏమో అదోలా చూసి సిగరెట్టు విసిరి కాండ్రించి ఉమ్మి వెళ్ళి బస్సెక్కేడు.

మరో అరగంటకి బస్సు కదిలింది.

★ ★ ★

పల్లెలో బస్సు ఆగింది.

బస్సు దిగి చుట్టూ చూశాను.

ఏడాదిక్రితమే వచ్చాను. అయినా ఈ కొద్దికాలంలోనే ఎంతో మార్పు వచ్చింది. పట్నపు నడకలు నేర్చుకొంటోంది.

కేబుల్ కనెక్షన్లూ, ఫోన్లూ, రాజ్‌దూత్‌లూ...!

అన్ని గ్రామాల్లోనూ మంచినీళ్ళు దొరకవు. కాని బ్రాందీ విస్కీలు దొరుకుతాయి. సరైన రోడ్లు వుండవు. కాని కేబుల్ కనెక్షన్లుంటాయి. స్కూళ్లలో పిల్లలు కూర్చోడానికి

బెంచీలుండవు. కాని పేకాట క్లబ్బులుంటాయి.

ఒకప్పుడు పచ్చని పరిసరాలకీ స్వచ్ఛమైన మనస్సులకీ ఐకమత్యానికీ ప్రతీకగా వుండే పల్లెలిప్పుడు పార్టీల పుణ్యమా అని చీలిపోయాయి. హెచ్చుతగ్గుల దృష్ట్యా విడిపోయాయి. కలుషిత సంస్కృతి ప్రభావంతో డబ్బువెంట, షోకులవెంట, సరదాలవెంట పరుగులు మొదలయ్యాయి.

నిట్టూర్చి తాతయ్య ఇంటివైపు అడుగువేశాను.

తాతయ్యది పాతకాలపు పెద్ద లోగిలి. అయినా ఎంతో దృఢంగా వుంటుంది. ఎందరికైనా చోటిచ్చేంత విశాలంగా వుంటుంది.

తాతయ్య వయస్సు డెబ్బైఅయిదు పైమాటే. అయినా ఈ కాలపు నడివయస్సు వారికన్నా ఆరోగ్యంగా వుంటారు.

ఇంటర్మీడియట్ చదువుతూండగా గాంధీజీ పిలుపునందుకుని చదువుకి స్వస్తి చెప్పి స్వాతంత్రోద్యమంలోకి దూకారు. క్విట్ ఇండియా ఆందోళనలో పాల్గొన్నారు. లాఠీ దెబ్బలు తిన్నారు.

స్వాతంత్ర్యం వచ్చాక యువకులంతా పల్లెలకి తరలివెళ్ళాలన్న గాంధీజీ ఆశయం మేరకు ఈ పల్లెకొచ్చి స్థిరపడ్డారు.

గ్రామంలో అంటరానితన నిర్మూలనకీ, మద్యపాన నిషేధానికీ స్త్రీ విద్యకీ, రైతు కూలీల సంఘస్థాపనకీ కృషిచేశారు.

తాతయ్యకి ముగ్గురు కొడుకులూ ఇద్దరు కూతుళ్లూ.

అందరి పెళ్ళిళ్ళూ అయ్యాయి. ఉద్యోగ వ్యాపారాల్లో స్థిరపడ్డారంతా.

ఇహ ఆస్తిపాస్తుల్ని పంచిచ్చి కృష్ణా రామా అనుకుంటూ కూర్చుంటారని ఆశించారు కొడుకులు.

కాని తాతయ్య వారి ఆశల్ని అడియాశలు చేశారు.





ఆస్తి అంతా స్వార్జితమనీ తనలాగే ఎవరికి వారు సంపాదించుకోవాల్సిందేనని తెగేసి చెప్పారు.

స్వంత ఇల్లు తప్ప స్వంత ఆస్తి అంటూ ఎవరికీ వుండకూడదనీ, వున్నా దాన్ని పేదలకి పంచాలిగాని కొడుకులకి పంచివ్వకూడదన్నది తన నిశ్చితాభిప్రాయమని తెగేసి చెప్పారు. ఆస్తికి వారసత్వపు హక్కు కలిగి వుండటమే విపరీత స్వార్థానికి కారణమని తను విశ్వసిస్తానన్నారు.

అందుకని గాంధీమహాత్ముడు చెప్పినట్టు ఆస్తికి తను ధర్మాధికారిగా వుండి దాన్ని అనాథ బాలబాలికల కోసం వెచ్చిస్తానన్నారు.

కోపించి శపించి కొడుకులు వెళ్ళిపోయారు. మళ్ళీ ఎన్నడూ తల్లీతండ్రీ ఎలా వున్నారోనని తొంగిచూసిన పాపాన పోలేదెన్నడూ.

కూతుళ్ళు మాత్రం చుట్టపు చూపుగా వచ్చి పోతూంటారు ఎప్పుడైనా. వారికి వాత్సల్యం తప్ప కానుక లివ్వకపోయేసరికి వారి రాకపోకలూ బహు అరుదయ్యాయి.

అమ్మమ్మ అక్షరాలా తాతయ్యకి తగ్గ ఇల్లాలు. ఏనాడూ ఆయన్ని ఎదిరించలేదు. ప్రశ్నించలేదు. కష్టమైనా నిష్ఠూరమైనా ఆయన తోడిదే తనజీవితమనుకుంది. ఆయన అడుగులో అడుగువేసి నడుస్తూనే వుంది గత అరవై ఏళ్ళనుంచీ.

తాతయ్య ఇల్లు ఎందరో అనాథలకి కల్పతరువు అని చెప్పాలి.

ఊళ్లోనే కాదు. చుట్టుపక్కలి ఊళ్ళల్లోని అనాథల్నీ, అభాగ్యుల్నీ, అపరకర్ముల్నీ చేరదీసి ఆశ్రయమిస్తారు తాతయ్య. వారందర్నీ కులమతాల కతీతంగా స్వంత బిడ్డల్లా పెంచుతున్నారు అమ్మమ్మా తాతయ్యా.

ఇంట్లోకెళ్ళాను.

మండువాలో సుమారు పాతిక మంది వివిధ వయస్సుల పిల్లలూ బారులుతీరి కూర్చున్నారు. తాతయ్యా అమ్మమ్మ కలిసి వారికి ఇడ్లీలు వడ్డిస్తున్నారు.

పిల్లలంతా ఇస్త్రీదుస్తులు ధరించి ముచ్చటగా ఆరోగ్యంగా వున్నారు. బహుశా స్కూలుకెళ్ళడానికి తయారైనట్టున్నారు.

చప్పుడుచెయ్యకుండా వెళ్ళి బంతి చివర కూర్చున్నారు.

పక్క కుర్రాడు వింతగా చూసి ఎవరన్నట్టు సైగజేశాడు.

మాట్లాడొద్దని పెదాలమీద వేలుపెట్టి చెప్పాను.

అందరితోబాటే నాముందూ ఆకువేసి ఇడ్లీలు పెట్టిన వారల్లా నన్నుచూసి ఆశ్చర్యబోయారు. బోలెడు ఆనందపడిపోతూ "నువ్వట్రా గాంధీ, చడీచప్పుడుకాకుండా ఎప్పుడొచ్చి దూరేవురా. ఇదిగోనేవ్ ఎవరొచ్చారో చూడు"

చెట్నీ వడ్డిస్తున్న అమ్మమ్మ నన్ను చూసి పరమానందపడిపోతూ గబగబా వచ్చింది.

"నాక్కూడా వడ్డించు అమ్మమ్మా ఇక నేనూ వీళ్ళూ ఒకటే"

ఎందుకో నా స్వరం నాకే వింతగా అన్పించింది!

"ఎంతసేపయ్యిందిరా వచ్చీ మీ అమ్మ ఎలా వుందీ" ఆప్యాయంగా పలకరించింది అమ్మమ్మ.

"ఓ... బాగుంది. ఆఫీసరుగారి భార్యాయె. ఆవిడకి లోటేవిటి" కావాలనే అన్నాను.

"కూత మారిందేవిటి గాంధీ. అమ్మకూచికి అమ్మ ఆఫీసరుగారి భార్యగా ఎప్పుడు మారిందిట? " అడిగారు తాతయ్య.

తలదించుకున్నాను.

"సామాన్లేవిరా"

"తెచ్చుకోలేదు"

"ఇంట్లో చెప్పి వచ్చావా? "

"ఊఁ..."

"అలిగి వచ్చావేంట్రా" కంగారుపడింది అమ్మమ్మ.

"అహహ... అదేంలేదు. మిమ్మల్ని చూడాలన్పించి..."

చూట్టానికొచ్చిన వాళ్ళు కట్టుబట్టల్తోరారు. సరే ముందు టిఫిన్ కానియ్"

తాతయ్యకి దగ్గులు నేర్పక్కర్లేదని అర్థమైంది.

పిల్లలు టిఫిన్ తిని, పాలు తాగారు. పుస్తకాల సంచీలు తీసుకుని టాటా చెప్పి స్కూలుకెళ్లారు.

"ఒక తల్లి బిడ్డలు కూడా ఇలా వుండర్రా. నువ్వూ మీ అన్నయ్యా ఒకేరకంగా వుంటున్నారా చెప్పు? వీళ్ళువుంటున్నార్రా. ఒకరంటే ఒకరికెంత ఆపేక్షో చెప్పలేను. మీ అమ్మమ్మ వాళ్ళకి అమ్మ కాదు అమ్మరూపంలో వున్న దైవం"

"ఏజన్మలో చేసుకున్న పుణ్యమో ఇందరు బిడ్డల చేత నోరారా అమ్మా అని పిలిపించుకోగల్గుతున్నాను" కళ్ళనుండి ఆనంద బాష్పాలు రాలిపోతోంటే అంది అమ్మమ్మ.

"నిన్ను చూస్తోంటే ప్రతీ ఇంటా దేవుడు అమ్మ రూపంలో కొలువుంటాడన్నది అక్షర సత్యమన్పిస్తోంది అమ్మమ్మా"

"మాటలు నేర్చావుగాని స్నానంచేసిరా. రాత్రంతా ప్రయాణం చేసి అలసిపోయి వుంటావు"

వేడి నీళ్ళ స్నానం చేసి తాతయ్య పంచెని లుంగీలా కట్టుకుని, తాతయ్య ఖద్దరు బనీను తొడుక్కున్నాను.

"ఇప్పుడు గాంధీ గాంధీలా దేశీయంగా వున్నాడు" అన్నారు తాతయ్య.

హాయిగా నవ్వేను "మీ ఆరోగ్యం ఎలా వుంది తాతయ్యా"

"నాకేంరా. దుక్కలా వున్నాను. చీకూ చింతా లేవు. ఆరాటం లేదు. నిట్టూర్పుల్లేవు. అటు వ్యవసాయమూ ఇటు పిల్లలూ తప్ప మరో వ్యాపకంలేదు. వచ్చిన పంట తల్లీ, వెన్నెల నవ్వుల పిల్లలూ మా జీవితాన్ని సుజలాం సుఫలాం సస్యశ్యామలం చేశార్రా. ఎలాంటి లోటూ దిగులూ లేకుండా తృప్తిగా వున్నాం. మా ఆరోగ్యం కూడా దివ్యంగా వుంది"



"కామక్రోధ మద మాత్స ర్యాలని జయిం చిన మహర్షిలా కన్పిస్తున్నారు తాతయ్యా"

"బాగా చెప్పావు. ఒక వయస్సు వచ్చాక రాజ్యపాలనని వారసుల కప్పగించి గృహస్థా శ్రమధర్మం స్వీకరించాలని మన పురాణాలు చెబుతున్నాయి. మేమూ అలాగే చేశాంరా. పెళ్ళయ్యాక కొడుకుల్నీ కూతుళ్ళనీ ఒకర కంగా విడిచిపెట్టేశాం. ఆశ్రమాని కెళ్ళకపో యినా ఇంటినే ఆశ్రమంగా మార్చి పదుగు రికి ఏదో ఇంత సేవచేస్తూ సుఖంగా గడిపే స్తున్నాం. భోగలాలసగాని, ధనాపేక్షగాని, అధికులమన్న గర్వంగాని లేవు. ఇక అరిష డ్వర్గాలు మమ్మేల్నేం చెయ్యగలవు చెప్పు"

"మీకు శుశ్రూష చెయ్యగల భాగ్యం దక్కితే బావుణ్ణన్పిస్తోంది తాతయ్యా"

"నీలాంటి యువకులు చేయాల్సిన సేవా, శుశ్రూషా నాక్కాదు. ఈ దేశానికీ జనానికి చెయ్యాలి"

"తాతయ్యా!"

"హిమాలయ పర్వతమంత ఆత్మవి శ్వాసం, ఏ సమయంలోనైనా సరే ఒంట రిగా ముందుకి దూసుకుపోగల ఆత్మస్థైర్యం యువకులకి సొంతంరా. ప్రజాజీవితంలో కలిసి పోవడం ప్రజలతోనే జీవితం అనుకో వడం మన వ్యక్తిత్వానికి నిదర్శనం రా. మన జీవితమే మన సందేశం అనగల ధీమంతులం కావాలిరా"

అవునన్నట్టు తలాడించాను.

"దేశానికి జవాన్నీ జీవాన్నీ ఇచ్చి ప్రగతి పథంలో చైతన్యరథాన్ని నడిపించి, సమస్త జనావళికి శుభాన్ని చేకూర్చగల శక్తి మంతులు యువతీ యువకులే. వాళ్ళంతా ఆత్మవిశ్వాసాన్నీ ఆత్మస్థైర్యాన్ని పెంచుకుని మా జీవితమే మా సందేశం అన్న స్థాయికి ఎదగాలన్నది నా ఆశ, ఆశయం, స్వప్నం, సందేశం!"

మెరుపులు కురుస్తోన్న తాతయ్య కళ్ళల్లోకి ఆరాధనగా చూస్తూండిపోయాను.





★ ★ ★

వారం రోజులు ఎట్లా గడిచిపోయాయో నాకే తెలీదు.

సరికొత్త ప్రపంచంలోకి వచ్చిపడినట్టుగా వుంది. మోసాలూ ద్వేషాలూ డబ్బాశలూ దోపిడీలూ ఏమీలేని మరో ప్రపంచం. పిల్లల ప్రపంచం ఇది.

సుమారు పాతిక మంది పిల్లలు, ఎక్కడ పుట్టేరో ఎవరికి పుట్టారో ఏ కులంలో ఏ మతంలో ఏ ప్రాంతంలో పుట్టారో తెలీని పిల్లలు ఒకే కప్పుకింద తోడబుట్టిన వాళ్ళలా కలిసి వుంటున్నారు. ఒకర్నొకరు అభిమా నంగా చూసుకుంటున్నారు. ఒకరికొకరు సాయంచేసుకుంటున్నారు. ఒకరి నొకరు నోరారా అన్నా అక్కా చెల్లీ తమ్ముడూ అని పిలుచుకుంటున్నారు.

పెద్ద పిల్లలు చిన్నపిల్లల స్నానాలూ బట్టలూ తలదువ్వటాలూ హోంవర్కు చేయించడాలూ చెయ్యడమేగాక ఇంటి పనుల్లో వంటా వార్పుల్లో అమ్మమ్మ, తాత య్యలకి సాయపడ్తున్నారు. వాళ్ళనీ తమతో బాటు తినమని మారాం చేస్తున్నారు. ఒడిలో చేరి గారాలు పోతున్నారు. కథలు చెప్పమని వేధిస్తున్నారు. తమ మాటల్తో చేష్టల్తో మురిపిస్తున్నారు.

తాతయ్య వాళ్ళకి పెట్టిన పేర్లు కూడా చిత్రమైనవే. వాళ్ళందరికీ కూడా రుషుల పేర్లూ రుషి పత్నుల పేర్లూ పెట్టేరు. వశిష్ఠ, విశ్వామిత్ర, అత్రి, బృహస్పతి, అరుం ధతి, అనసూయ, గౌతమి... ఇలా!

ఒకసారి ఆ పేర్ల గురించి తాతయ్యని అడిగాను.

"పూర్వం జనగణాలకి అధిపతులుగా రుషులుండేవారు. అంటే ఆ గణానికి గురు వుగా మార్గదర్శిగా వుండే వారన్నమాట. వారి పేర్లతోనే గోత్రాలు ఏర్పడ్డాయి. అలాగే రేపు వీళ్ళంతా సమాజంలోకెళ్ళేక వీళ్ళ పేర్లతో కొత్త గోత్రాలూ గణాలూ కుటుంబాలూ ఏర్పడాలని సమాజంలో కొత్త మార్పు తీసుకురావాలని పెట్టాను"

"బానేవుందిగాని తాతయ్యా అది ఒక

మతాన్ని సమర్థిస్తున్నట్టు లేదూ? "

"భక్తి పేరుతో మతం పేరుతో దేశాన్నీ దేశ ప్రజలనూ విడదీసే వాళ్ళే దేశానికి నిజమైన శత్రువులు. వారిపట్ల అప్రమత్తంగా వుండండి. ఈ మాటలన్నది ఎవరో తెలుసా? వివేకానందుడు. అయన్ని కూడా ఓ మతస్తులు స్వంతం చేసుకున్నారు. అలాటి వాళ్ళపట్ల అప్రమత్తంగా వుండటం అవసరం"

"ఆయన మాటలే మాకూ మా పిల్లలకీ శిరోధార్యం"

ఒక పని వెనుకనున్న భావజాలాన్నీ లక్ష్యాన్నీ తెలుసుకోకుండా వంకలు పెట్టడం, విమర్శించడం ఎంత అనుచితమో తెలిసొచ్చింది.

అమ్మమ్మ ఓర్పు సహనం, అనురాగం చూస్తోంటే చెయ్యెత్తి మొక్కాలన్పిస్తోంది. తాతయ్యింకా పొలమూ పశువులూ అంటూ తిరుగుతారు తప్ప అమ్మమ్మ ఇంట్లోనే వుంటుంది. ఇరవై నాలుగ్గంటలూ పిల్లల తోడిదే ఆమె లోకం.

వారిలో ఎవరికి ఏ మాత్రం అనారోగ్యం చేసినా ఆఖరికి పాలు తాగకుండా వెళ్ళినా నొచ్చుకుంటుంది.

ఆ వయస్సులో అంతమంది పిల్లల ఆలనా పాలనా చూడటం చాలా కష్టం. అయినా మొఖాన చిరునవ్వు చెదరనీకుండా సేవలుచేస్తోంది.

మానవ జన్మకి ఇంతకంటే సార్థక్యం లేదేమో అన్పించింది.

పిల్లలని చదివిస్తూ హోంవర్కు చేయిస్తూ కథలు చెబుతూ హేపీగా గడిపేస్తున్నాను.

ఇక తాతయ్యతో మాట్లాడటం అంటే అదే ఓ ఎడ్యుకేషన్.

కానీ ఒంటరిగా వున్నప్పుడు, నిద్రకుపక్రమించినప్పుడు ఏదో తెలీని నిరాశా నిస్పృహలు నన్నావరిస్తూనే వున్నాయి. తమలోకి లాక్కుంటూనే వున్నాయి.

డాడీ అన్నట్టు తులసి వనంలో గంజాయి మొక్కలుంటే వాటిని తేలిగ్గా పీకి పారెయ్యొచ్చు గంజాయి వనంలో కాసిని తులసిమొక్కలున్నాయి. ఎన్ని గంజాయి మొక్కల్ని పీకగలం?

దేశంలో పైనుంచి కిందివరకూ అవినీతి అలుముకునివుంది. జనజీవితంతో విడదీయరానంతగా మమేకమైంది.

ప్రతీవారికీ డబ్బు కావాలి. లక్షలూ కోట్లూ కావాలి. కోట్లకి పడగెత్తిన నాయకులకీ పరిశ్రమాధిపతులకీ వ్యాపారులకీ కూడా మరిన్ని కోట్లు కావాలి. అందు నిమిత్తం ఏమైనా చేస్తారు. ప్రపంచ బ్యాంకునుంచి అప్పులు చేస్తారు. మాఫియాలతో విదేశీ గూఢచారులతో చేతులు కలుపుతారు. మేచ్ ఫిక్సింగులకీ దళారీ పనికీ పూనుకుంటారు. వారెవరికీ జనం అక్కర్లేదు. జనం ఎన్ని కష్టాల పాలవుతున్నారో అక్కర్లేదు. తాము బాగుంటే చాలు. తమ ఆస్తులూ స్విస్ బ్యాంకుల్లో నిధులూ పెరిగితే చాలు.

పైస్థాయివారిని చూసి కిందిస్థాయివారూ పైకెగబ్రాకాలని తాపత్రయపడుతున్నారు. లంచాలకోసం అర్రులు చాస్తున్నారు. బంధుప్రీతి ప్రదర్శిస్తున్నారు. ఆశ్రిత పక్షపాతంలో ముందుంటున్నారు. ఆస్తుల్నీ అంతస్థుల్నీ పెంచుకుని భోగభాగ్యాలతో తులతూగాలనుకుంటున్నారు. ఆధునిక సౌకర్యాలన్నీ సమకూర్చుకుని విలాసాల కులాసాల తేలియాడాలని చూస్తున్నారు.

ఆఖరికి వైద్యం కూడా ఫక్తు వ్యాపారమైపోయింది. తలపోటు, కడుపు నొప్పిలాటి వాటిక్కూడా స్కానింగులూ, బ్లడ్ టెస్టులూ అంటూ వందలూ వేలూ గుంజుతున్నారు.

ఇంకా చిత్రమేమిటంటే రౌడీలూ, గూండాలూ ఇస్త్రీ బట్టలు ధరించి నాయకులుగా చెలామణీ అవుతున్నారు. కాంట్రాక్టర్లుగా అవతారమెత్తుతున్నారు. అవినీతి అధికార్ల అడుగులకి మడుగులొత్తడానికి ఎందరెందరో పోటీపడుతున్నారు.



తమ పని అయితే చాలు, తమ పబ్బం గడిస్తే చాలు. అనుకుంటూ ప్రతీ వాళ్ళూ లంచాలు మేపుతున్నారు. అక్రమ పద్ధతుల్ని ప్రోత్సహిస్తున్నారు. ఇదేం న్యాయం ఇదేం దారుణం అని నిలదీయలేనంత నిర్వీర్యులైపోయారు జనం!

చదువుకున్న యువతీయువకులు కూడా డాలర్ డ్రీమ్స్ వెంట పరుగెడుతున్నారు తప్ప నా దేశం నా జనం అన్న అభిమానంలేదు. నా పుట్టుకకీ పెరుగుదలకీ అభివృద్ధికీ కారణం ఈ గడ్డేనన్న విశ్వాసం లేదు. దేశాన్ని తిట్టడం ఓ ఫాషన్‌గా భావిస్తున్నారు. ఎప్పుడెప్పుడు ఈ దేశాన్ని విడిచి వెళ్ళిపోదామా అని అర్రులు చాస్తున్నారు.

కడకి ప్రేమికులు కూడా ఆ ప్రవాహంలో కొట్టుకుపోతున్నారు. ఎంత దారుణం!

ఇక ఈ దేశాన్ని ఎవరు మాత్రం బాగుచెయ్యగలరు? ఈ జనాన్ని మేల్కొల్పటం ఎవరి తరమూ కాదుగాక కాదు!

ఎన్నో ఆలోచనా సుడిగుండాలు!

మరెన్నో బాధాకర అగ్నిశిఖలు!

ఫలితం-అశాంతి! డిప్రెషన్! విరక్తి! నిద్రపట్టక దొర్లుతోంటే జోలపాట చెవిన పడింది. చటుక్కున లేచి వెళ్ళాను.

"జో అచ్యుతానంద జోజో ముకుందా
లాలిపరమానంద రామగోవిందా జో జో..."

చిన్నపిల్లల్ని చిచ్చికొడుతూ శ్రావ్యంగా పాడుతోంది అమ్మమ్మ. తాతయ్య కూడా పిల్లల దగ్గరే వున్నారు. వెళ్ళి ఆయన పక్కన కూర్చున్నాను.

అన్నమయ్య పాట! తేట తెలుగు తియ్యందనాలు అద్దుకున్నపాట! వెంకటేశ్వరుడా పాటకి మైమరిచాడంటే మరవడా మరి!

తెలుగునాట ప్రతి ఇంట్లో ప్రతి తల్లీ పాడే పాట. ఏళ్ళు గడిచినా మాధుర్యం కోల్పోని పాట. అన్నమయ్య నిజంగా ధన్యుడు.

అమ్మని 'మమ్మీ' అని పిలవమని కట్టడి చేసిన డాడీ గుర్తొచ్చారు. 'అమ్మ' పదంలో ఎంత మాధుర్యం వుందీ. బలవంతాన మనస్సుని మళ్ళించాను.

పాట పూర్తయ్యింది. పిల్లలు నిద్రలోకి జారుకున్నారు.

"నిద్రరావటం లేదా గాంధీ" తాతయ్య అడిగారు.

"ష్... పిల్లలు లేస్తారు. మండువాలోకి పదండి" అంది అమ్మమ్మ.

"అమ్మమ్మ పాట వినేసరికి మనస్సంతా సేదదీరినట్టు ఎంతో హాయిగా వుంది. వెళ్ళి పడుకుంటాను"

తాతయ్య చూపుల్ని తప్పించుకుంటూ వెళ్ళి పడుకున్నాను. వెంటనే నిద్రపట్టేసింది.

★ ★ ★

"అన్నయ్యా. నీకు ఉత్తరం" ఒక కుర్రాడు తెచ్చిచ్చాడు.

"నా కెవరు రాశారబ్బా" అనుకుంటూ తెరిచాను.

పోలీస్‌స్టేషన్నుంచి వచ్చింది. బస్సు దోచిన దొంగల్ని పట్టుకుని డబ్బు బంగారాలని స్వాధీనం చేసుకున్నారట. నేనొచ్చి నా వస్తువుల్ని గుర్తుపట్టి తీసుకెళ్ళమని రాశారు.

నా కళ్లని నమ్మలేక మళ్ళీమళ్ళీ చూశాను.

"ఏవిట్రా అన్ని సార్లు చూస్తున్నావు. ఉత్తరం ఎక్కడ్నుంచేవిటి? " అడిగారు తాతయ్య.

"సిటీనుంచి వస్తోంటే దారిలో బస్సు దోచేశారని చెప్పేనుకదా తాతయ్యా! ఆ దొంగలు దొరికారట. సొమ్ములూ స్వాధీనం చేసుకున్నారట. నన్నొచ్చి నా సరుకులు తీసుకెళ్లమన్నారు"

"చాలా మంచి వార్త చెప్పేవురా. నగలు పోయాయని పాపం ఆడవాళ్లంతా ఎంతగా విచారించారో"

"పోలీసులు దొంగల్ని పట్టుకోవడమేగాక డబ్బూ బంగారాల్ని కూడా పట్టుకోవడం నమ్మలేని వింతగా లేదూ? "

"లేదు"




"తాతయ్యా"

"అన్నిచోట్లా వున్నట్టే పోలీసుల్లోనూ అవినీతి పరులుండొచ్చు కాని అంతా అవినీతి పరులని అందర్నీ ఒకే గాట కట్టడం సరికాదు. రక్షించాల్సిన వాళ్లే భక్షిస్తున్నారు గనుక వారి తప్పు రెట్టింపయ్యే మాట నిజమే. అందుకు వారిని నిందించాల్సిందే. అలా అని పోలీసుల్లో బాధ్యతల్ని సక్రమంగా నిర్వర్తించేవారూ నిజాయితీపరులూ లేరనడం తగదు. హింసని అరికట్టడంలో చట్టాన్ని పరిరక్షించడంలో దొంగల్ని పట్టుకోవడంలో వారి పాత్ర బహుధా ప్రశంసనీయం. రాజకీయ నాయకుల ప్రమేయం లేనట్లయితే వాళ్లు మరింత చక్కగా తమ బాధ్యతల్ని నిర్వర్తిస్తారు. కానీ మన నాయకులు ఏ ప్రభుత్వోద్యోగినీ తన పని తనని చేసుకోనివ్వరుకదా"

"మీ కెవరి మీదా కోపం రాదా తాతయ్యా? " ఆయన ధోరణికి విస్తుబోతూ ప్రశ్నించాను.

"కావాల్సింది కోపం కాదు అవగాహన"

★ ★ ★

నే వచ్చి పదిరోజులయింది.

ఉండటమా వెళ్లటమా అన్న ఆలోచన మొదలైంది.

వెళ్లదలిస్తే ఎక్కడికి వెళ్లాలన్నది కోటి రూపాయల ప్రశ్న.

ఇంటికెళ్లలేను. ఫ్రెండ్సు దగ్గరికెళ్లాలి. ఇంకో మూడు నెలల్లో పరీక్షలున్నాయి. కానీ చదువంటే ఆసక్తి నశించిందే!

ఏమీ చేయాలన్పించటంలేదు. ఇక్కడెక్కడా వుండాలన్పించటం లేదు.

ఎక్కడికో ఎవరూ లేని చోటుకి, ఈ మనుషులకీ సమాజానికీ దూరంగా ఏ ఋషీకేశో, హిమాలయాలకో వెళ్తే బావుణ్ణన్న కోరిక మొలకెత్తి ఒక రూపాన్ని సంతరించుకోసాగింది.

నా ఆలోచనల్ని పసిగట్టినట్టు "అలా కాలువగట్టుకెళ్లి మాట్లాడుకుందాం రారా" అన్నారు తాతయ్య.

వెంటనే బయల్దేరాను.

నేనెందుకు కట్టుబట్టల్తో వచ్చిందీ తాతయ్య అడగలేదు. అయినా ఇంట్లో జరిగిన గొడవ తెలిసే వుంటుందని నా నమ్మకం. డాడీ పట్టించుకోకపోయినా తప్పనిసరిగా అమ్మ నా కోసం నా ఫ్రెండ్సుందరికీ ఫోన్ చేసివుంటుంది. ఎక్కడా లేకపోయేసరికి ఇక్కడికొచ్చి వుంటానని ఇక్కడికి ఫోన్ చేసే వుంటుంది.

నా క్షేమ సమాచారం తెలిసేదాకా ఆ తల్లి మనస్సు కుదుటపడదని ఊహించగలను.

పొలంగట్లంట నడుస్తూ "ఈసారి పంటలెలా వున్నాయి తాతయ్యా" అనడిగాను.

"వరి బాగానే పండింది. కానీ ధాన్యం కొనే నాధుడే లేకపోయాడు. చూస్తోంటే ప్రపంచ ఆర్థిక విధానాలు రైతుల కడుపు కొడతాయేమోనని భయంగా వుందిరా"

"కడుపున్నంత వరకూ నాగలి పట్టాల్సిందేకదా"

"నిజమేరా! కాని మనక్కావాల్సిన తిండి గింజలు మనదేశపు రైతే పండించాలని లేదుకదా! విదేశాల్లో అభివృద్ధి చెందిన టెక్నాలజీతో చవుకగా ధాన్యాలు పండించి మన దేశానికి పంపిస్తే ఏమవుతుంది? మన రైతు నోటమట్టేకదా! కేవలం ధాన్యాలే కాదు అన్ని రకాల పారిశ్రామిక ఉత్పత్తులూ మనదేశాన్ని ముంచెత్తనున్నాయి. బహుళ జాతి సంస్థల ప్రవేశంలో దేశంలో చిన్న, మధ్యతరహా పరిశ్రమలన్నీ నిలువునా కూలిపోవడం ఖాయం"

"ప్రభుత్వం సరైన చర్య ఎందుకు తీసుకోలేకపోతోంది తాతయ్యా? "

"కోట్లకొద్దీ అప్పుకోసం ప్రపంచ ఆర్థిక సంస్థల చుట్టూ ప్రదక్షిణలు చేస్తున్నాయి మన ప్రభుత్వాలు. అంచేత ఋణదాతలు విధించే అన్నిరకాల షరతులకీ తలాడించేస్తున్నారు"



"చాలా దారుణం సుమా"

"దారుణమే. ఒక దేశాన్ని లొంగదీసుకో వాలన్నా, చెప్పుచేతల్లో ఉంచుకోవాలన్నా పూర్వకాలంలోలా ఆ దేశం మీద దండెత్త క్కర్లేదు. యుద్ధంచేసి జయించక్కర్లేదు. ఆ దేశానికి అప్పిస్తే సరిపోతుంది. దోపిడీకి లైసెన్సిచ్చి తలుపులు బార్లా తెరిచేస్తారు!"

"అన్నట్టు తాతయ్యా! ధాన్యాన్ని ఫుడ్ కార్పొరేషన్‌వారు కొనేలా ముఖ్యమంత్రి కేంద్ర ప్రభుత్వంమీద ఒత్తిడి తీసుకొచ్చాడు కదా"

"తీసుకొచ్చాడని పేపర్లు రాశాయి. ఆచర ణలో మాత్రం ప్రగతి కన్పించట్లేదు. ఫుడ్ కార్పొరేషన్ వాళ్లు ఒకటి చెబుతున్నారు. రైస్‌మిల్లర్లు ఇంకోటి చెబుతున్నారు. కేంద్ర ప్రభుత్వం మరోటి చెబుతోంది. రాష్ట్ర ప్రభుత్వం ఇంకోటి చెబుతోంది. వీరందరి మధ్యా ఊపిరాడక కొట్టుకుంటున్నాడు రైతు. పండిన పంటకి ధరాలేదు కొనే వాడూ లేడు. ఇలాంటి స్థితి ఎన్నడూ ఎదు రవ్వలేదు"

"సిటీలో మాత్రం బియ్యం ధర ఆకాశాని కంటుతోంది"

"అవునలాగే వుంది. ఆరుగాలం పండించే రైతుకేమీ మిగలదు. వినియోగదారుడికీ మిగలదు. మధ్యన దళారులు సొమ్ము చేసు కుంటున్నారు. స్వాతంత్ర్యం వచ్చి ఇన్నేళ్లు గడిచినా సరైన పంపిణీ వ్యవస్థని నెలకొల్ప కోలేకపోయాం. అయినా ఏరువాక అంటే తెలీని అధికారులు ఢిల్లీలో ఏసీ రూముల్లో కూర్చుని ధాన్యానికి ధర నిర్ణయిస్తున్నారు. ఇంతకంటే సిగ్గుచేటు ఏముంటుంది చెప్పు?"

"ఏం చెప్పను తాతయ్యా! ప్రజలకోసం ప్రభుత్వాలు కాదు ప్రభుత్వాల కోసం ప్రజ లన్నట్టుగా తయారయింది పరిస్థితి"

"బాగా చెప్పేవు. వివిధ అధికారులున్న దెందుకుచెప్పు? పరిపాలన సాగేట్టు చూట్టా నికీ, ప్రజోపయోగకరమైన కార్యాల్ని నిర్వ ర్తించటానికీ పన్నులూ, వగైరాలు వసూలు చెయ్యడానికేకదా! కాని ఏ అధికారైనా జనా నికి సేవకుడన్నట్టు ప్రవర్తిస్తున్నాడా చెప్పు? ప్రవర్తించడు. జనాన్ని పురుగుల్లా చూస్తారు తప్ప ఆ జనంకోసం వున్నామనీ వారు చెల్లించే పన్నుల్తో బతుకుతున్నామనీ గ్రహించరు"

తలాడిస్తూ కాలువ గట్టు ఎక్కాను.

మురుక్కాలువ నిజంగానే మురికిగా వుంది. దుర్గంధం ముక్కుపుటాల్ని అదరగొ డుతోంది.

"కాలువ ఇది వరకిలా వుండేది కాదుకదా తాతయ్యా"

"ఈమధ్యనే ఇలా అయ్యింది. దిగువున ఓ ఎంపీగారి బంధువులు అట్టల ఫ్యాక్టరీ కట్టార్లే. దాన్నుంచి కలుషిత నీరంతా కాలు వలోకి వదిలేస్తున్నారు. కాలువనీ పరిసరా లనీ కాలుష్యం చేసేస్తున్నారు"

"పొల్యూషన్ కంట్రోలు బోర్డువారు చర్య తీసుకోవచ్చునే"

"తీసుకోవచ్చు. కానీ తీసుకోవట్లేదు. మొన్నామధ్య జరిగిన జన్మభూమి కార్యక్ర మంలో అధికారుల్ని నిలదీశాం. నీళ్ల నమూల్తో ఫైలు పైకి పంపేం అన్నారు"

"జన్మభూమి కార్యక్రమం మీద నీ అభి ప్రాయం తెలుసుకోవాలని ఉత్సుకతగా వుంది తాతయ్యా. కొందరు గొప్ప పథక మని పొగుడుతోంటే అంతా ప్రచారార్భాట మని తెగడుతున్నారు ఇంకొందరు..."

"రెండిట్లోనూ సత్యముంది. పథకం మంచిదే. ప్రజలక్కావాల్సిన పనులు చెయ్యడం, ప్రజలు పాల్గొనేలా చెయ్యడం, అధికారుల్ని ప్రజలకి బాధ్యుల్ని చేయడం మంచిదే. కానీ ప్రచారం మీద వున్న శ్రద్ధ కార్యక్రమం మీద లేదు. ఏయే పనులు చేప ట్టాలన్నది ఎక్కడో కూర్చుని అధికారులూ నాయకులూ నిర్ణయించడంగాక ఆ బాధ్య తని పూర్తిగా పంచాయితీలకిచ్చేయాలి. కంట్రాక్టర్లకి పనులప్పగించకూడదు.





గ్రామాల్ని స్వయంపోషకం చేసేదిగా పంచాయితీలకి మరిన్ని అధికారాలూ అవసరమైన సొమ్మూ ఇవ్వాలి. అప్పుడు గ్రామాభివృద్ధిలో, తద్వారా దేశాభివృద్ధిలో ప్రతివారూ పాల్గొనే అవకాశం కల్గుతుంది. నిధుల దుర్వినియోగం తగ్గుతుంది"

"ఇలా చేస్తే బాగుంటుందని ప్రభుత్వానికి సూచిస్తే బావుణ్ణుకదా"

"మన సూచనలూ, సలహాలూ ఎవరు వింటారయ్యా! గాంధీజీ గ్రామస్వరాజ్యం గురించి చెప్పిందోసారి తిరగేస్తే చాలు. కానెవరికీ అంత ఓపికలేదు. దాన్నే తిరగేసి, మరగేసి విదేశీ నేతలు చెబితే ఆహా ఓహో అంటూ ఆయా దేశాల్ని భుజాన వేసుకుని మోసేస్తారు. ఒకసారి కొరియా అంటారు. ఇంకోసారి బంగ్లాదేశ్ అంటారు. మరోసారి అమెరికా, జపాన్, చైనా ఇలా మార్చుకుంటూ పోతారు. అన్ని చోట్లనుంచి ఒకటి రెండు ముక్కలు తీసుకుని కలగాపులగం చేసి కొత్త పదార్థమేదో వండాలని ప్రయత్నిస్తున్నారు. అది ఎలా వుంటుందో ఎలా మారుతుందో ఎవరికీ తెలీదు"

"మంచి ఎక్కడున్నా నేర్చుకోవడంలో తప్పులేదుకదా తాతయ్యా!"

"చిత్తశుద్ధి, కార్యదీక్ష వుంటే తప్పులేదు. అవి వున్నాయా లేదా అన్నది ఎవరికి వారు ఆత్మవిమర్శ చేసుకోవడం మంచిది. ఆ చెట్టుకింద కూర్చుందాం పదరా"

రావిచెట్టు మొదలు దగ్గర కూర్చుంటూ "రారా గాంధీ, ఇలా కూర్చో ఇప్పుడు చెప్పు నీ సంగతేమిటీ? నీ కథా కమామీషా ఏవిటీ? " అనడిగారు.

"మమ్మీ ఫోన్ చేసిందా? "

"చేసిందిలే, తనేం చెప్పిందన్నది వదిలేసి నువ్వేమంటావో చెప్పు. నాలుగైదు రోజుల్నుంచీ మరీ అశాంతిగా ఆందోళనగా వుంటున్నావు. అసలేం జరిగిందిరా? "

"ఎక్కడికైనా పారిపోవాలన్పిస్తోంది" తలొంచుకున్నాను.

"ఎక్కడికి? "

"హిమాలయాలకో హరిద్వార్, ఋషీకేశ్ లకో... ఎక్కడికో చాలా దూరానికి. ఎవరూ లేని చోటుకి"

"వెళ్లి ఏం చెయ్యాలని? "

నేను మాట్లాడలేదు. ఏం చెయ్యడమన్నది నాకే స్పష్టం కాలేదు!

"తపస్సు చేస్తావా? "

"ఆహా... అబ్బే..."

"పూర్వం ఋషులలాగే అడవులకో హిమాలయాలకో వెళ్ళి తపస్సు చేసేవారట. వాతావరణం ప్రశాంతంగా వుంటే తప్ప తపస్సు నిరాటంకంగా సాగదని వారి అభిప్రాయం కావొచ్చు"

మౌనముద్ర విడువకుండా తలొంచుక్కూర్చున్నాను.

"అసల్నువ్వు జనాన్ని వదలి దూరంగా ఎందుకు పారిపోవాలనుకుంటున్నావురా? "

"పారిపోవడం కాదు"

"దాన్ని పారిపోవడమనే అంటారు. పలాయన మంత్రం పఠించడమే అంటారు"

"నాకిక్కడేం బాగోలేదు తాతయ్యా"

"ఏం బాగోలేదు. మనుషులా? పద్ధతులా? పరిపాలనా? "

"అన్నీను. ఉపద్రవాలు, ఉగ్రవాదాలు, ఉద్విగ్న వేళలు సమాజాన్ని చుట్టుముడుతున్నాయి. పాశ్చాత్య వ్యామోహాలు, పాశవిక చర్యలు పడగలెత్తి మృగత్వాన్ని దువ్వుతున్నాయి. స్వచ్ఛత, సభ్యత, సఖ్యత తరిగిపోతున్నాయి. నీతీ నిజాయితీ మట్టిగొట్టుకుపోతున్నాయి. ఎటుచూసినా అక్రమాల విశ్వంఖలత్వం. చుట్టూ అవినీతి తిమిరం. అన్నిట్లో అందర్లో విపరీతమైన స్వార్థం. ఎలాగోలా ధనికుడైపోవాలన్న ధనాకాంక్ష, సుఖాలని జుర్రుకోవాలన్న భోగలాలస. ఎదుటివాడి సమాధుల మీద పునాదులు నిర్మించుకోవాలన్న అత్యాశ, ఆరాటం. రోజు రోజుకీ దిగజారుతున్న విలువలు. భారమవుతోన్న సామాన్యుల బతుకులు. ఇవన్నీ



కళ్లప్పగించి చూస్తూ నోరు మూసుక్కూర్చో వడం నాకు సాధ్యం కాదు. అసలు వాటిని భరించగల శక్తి నాకు లేదు. నేనీ వ్యవస్థలో ఇమడలేకపోతున్నాను తాతయ్యా! అందుకే దూరంగా వెళ్లిపోవాలని వుంది"

"సరే వెళ్తావు, వెళ్లి ఏం చేస్తావు. నీకు నువ్వైనా ఉపయోగపడగలవా చెప్పు? లేదే. ఇతరులకి ఉపయోగపడగలవా? అదీ లేదే. నీ ఉనికే వ్యర్థమయ్యే పనికి పూనుకు నేకన్నా ఇక్కడే వుంటే మంచిదికదా"

"ఈ కల్మషాన్ని, దుర్గంధాన్ని భరించడం నావల్లకాదు"

"ఎందుక్కాదు? ఇన్నాళ్లూ నువ్వున్నదీ పెరిగిందీ ఇక్కడకాదూ?"

"ఇక్కడే కానీ అప్పటి పరిస్థితులు వేరు"

"ఎందుకని భిన్నమైనవో చెప్పు వింటాను"

"అప్పుడంతా పచ్చగా కన్పించింది. ఉత్సా హపూరితంగా వుంది. స్నేహితులూ కుటుం బసభ్యులూ చదువులూ తెలిసీ తెలీని సమా జమూ...! అటు విద్యార్థులుగాని ఇటు జనమూ ఉద్యోగులూ గానీ ఎవరు తప్పుదా రిన నడచినా వేలెత్తి చూపేవాడ్ని. ఇది మంచి పనికాదని నచ్చచెప్పేవాడ్ని. రైలు ఆలస్యంగా వచ్చిందని రిపోర్టు చేస్తే రైల్వే మంత్రి చర్య తీసుకున్నారు. సబ్ రిజిస్ట్రార్ ఆఫీసులో ఏసీబీ గురించి బెదిరిస్తే పనులు సవ్యంగా చేసి పెట్టారు. కారణరహితంగా ఆందోళనలు తగదంటే విద్యార్థులు నాకు వత్తాసుగా నిలిచారు"

"మరింకేంరా... చాలా మందిలా వ్యవ స్థని తిడుతూనో, ఈ దేశం బాగుపడదని నిట్టూరుస్తూనో కూర్చోకుండా ఏదో చర్య చేపట్టావు. అవి సవ్యంగా నడచినంతకాలం నీకంతా బాగానే అన్పించింది. వాటికి బ్రేకు పడేసరికి నిరాశతో డీలా పడిపోయావు. అసలేం జరిగిందిరా. నాకు చెప్పకూడదా?"

"చెప్పకూడదని కాదు"

"అయితే చెప్పు"

క్షణకాలం కళ్లు మూసుకున్నాను. ఏం చెప్పాలి? ఎంతవరకూ చెప్పాలి?

"ఒకమ్మాయిని ప్రేమించాను. ఆ అమ్మాయీ నన్ను ప్రేమించింది. కానీ నేను అమెరికా వెళ్లదలచలేదని తెలుసుకుని మనస్సు చంపుకుని మరొకరి వెంటబడింది"

"మంచిదేకదా! పెళ్లయ్యాక ఆమె అంత రంగం బయటపడివుంటే నీ వైవాహిక జీవితం ఛిన్నాభిన్నమయ్యేది. ఇంకా... ఇంకేం జరిగిందో చెప్పరా"

"మా డాడీ అంటే ఎంతో గౌరవం వుండేది. అహం, కోపం అధికంగావున్నా ఆయన అందర్లాంటి అధికారి కాదనీ సిన్సి యర్ అనీ భావించేవాడ్ని. కానీ ఆయన అవినీతికి ప్రతిరూపమని తెలిసింది. మా ఆస్తులూ నేను తిన్న తిండీ అన్నీ లంచాల పుణ్యమే అని తెలిసింది. అందుకనే ఆ ఇంట్లో వుండలేకవచ్చేశాను"

"నీ పరిస్థితిని అర్థం చేసుకోగలను. మీ నాన్న మొదట్లో బాగానే వుండేవాడురా. అందుకనే నా కూతుర్నిచ్చి పెళ్లిచేశాను. తర్వాత్తర్వాత మారిపోయాడు. అప్పట్నుంచీ నా మొహంలోకి చూడటానికే భయపడుతు న్నాడు మీ నాన్న. ఇప్పటికీ అంతే నా వంక చూడాలంటే ఏదో భయమూ బెరుకూనూ. తప్పుదారిపట్టవద్దని చెప్పేను. హెచ్చరిం చాను. విన్లేదు. అందుకనే మీ ఇంటికి రావటం మానుకున్నాను. చూడాలనిపించిన ప్పుడు మీ అమ్మే వచ్చి వెళ్తూంటుంది"

"అలాటి తండ్రి కడుపున పుట్టినందుకు చాలా సిగ్గుగా వుంది తాతయ్యా"

"నీ పుట్టుక నీ చేతుల్లో లేనప్పుడు నువ్వు సిగ్గుపడాల్సిన అవసరం లేదు. హిరణ్యకశి పుడి కడుపున ప్రహ్లాదుడు పుట్టలేదా చెప్పు? చుట్టూవున్న అవినీతినీ, అశాంతినీ, సమస్యల్నీ చూసి పారిపోవటం పరిష్కారం కాదు"

"ఇది వరకు నేనూ అలాగే చెప్పేవాడ్ని. కానీ ఇప్పుడు దారుణంగా ఓడిపోయినట్లు, ఈ సమాజంలో ఫిట్ కాలేనట్టూ వుండి,





నైరాశ్యం నన్ను నిలువునా నమిలేస్తోంది తాతయ్యా" బేలగా అన్నాను.

"ఓడిపోవడం నిరాశకు కారణం కాకూడదు. గెలుపుకు నాందీకావాలి. సంకల్ప బలంతో నిరంతర ప్రయత్నం చేసేవారికి ఏదీ అసాధ్యం కాదనీ విజయానికి గల ఏకైక సూత్రం అదేననీ అన్నారు పెద్దలు. అఖండమైన ఉత్సాహం, అపరిమితమైన ధైర్యం, అన్నిటికంటే పరిపూర్ణమైన విధేయత మొదలైన లక్షణాలే ఒక దేశాన్నిగానీ మనిషినిగానీ పునరుజ్జీవింపచేస్తాయన్నారు"

"వాళ్లు మహానుభావులు. పైగా అప్పటి పరిస్థితులు వేరు. ఇప్పటి స్థితిగతులు వేరు. అప్పటికీ ఇప్పటికీ మనిషి మరింత పతనమయ్యాడు తాతయ్యా! విలువల వలువలూడదీసి విశృంఖల నృత్యం చేస్తున్నాడిప్పుడు"

"మనిషిలో సమాజంలో ఇలాంటి ఎన్నో మార్పులొస్తాయనీ మనిషి ఆధ్యాత్మిక భావన విడిచి భౌతిక సుఖాల కోసం వెంపర్లాడతాడని మనుషులెప్పుడో వేల ఏళ్ల క్రితమే ఊహించార్రా. దీనికి కలికాలమని ఎప్పుడో పేరు పెట్టారు. స్వార్థం వెర్రితలలు వేసిన మనిషే రాక్షసుడు. ఆ రాక్షస వధకి ఒకప్పుడు ఆయుధాన్ని ఉపయోగించాడు భగవంతుడు. ఏ అవతారంలోనూ ఏ అసురుడ్నీ సహరించకుండా వదల్లేదు. గుర్తుచేసుకో. కాని ఈనాటి భగవత్స్వరూపుడైన గాంధీజీ అహింస అనే ఆయుధంతో రవి అస్తమించని బ్రిటీషు సామ్రాజ్యవాదుల్ని తోకముడిచేలా చేశాడు. సత్యాగ్రహం ఎంత శక్తివంతమైందో జగతికి చాటి చెప్పాడు. ఈనాటి సమాజంలోని రాక్షసుల్ని హతమార్చమని ఆయన బోధించలేదు. హతమార్చి కొత్తవ్యవస్థని సృష్టిస్తామని అడవులకెళ్లిన ఆవేశభరిత యువకులు శలభాల్లా మాడిపోవడం మనం చూశాం. మనం నడవాల్సింది అహింసామార్గాన్నే అన్నది మరోసారి ఋజువైందిరా. మనిషిని మార్చాలి. అతడిలోని దుర్గుణాల్ని చంపాలి. ఈ కాలపు రాక్షసుల్లో సైతం మార్పు తెచ్చి మంచి మనుషులుగా తీర్చిదిద్దాలి. అదే గాంధీజీ చేసిన ఉద్బోధ. సర్వులకూ శిరోధార్యం అది"

"అది అసాధ్యం తాతయ్యా. చదువుకున్న వాళ్లే వికృతంగా ప్రవర్తిస్తున్నప్పుడు ఇక నిరక్షరాస్యుల సంగతేం చెప్పాలి. ఈ జనం గొర్రెల్లాంటి వాళ్లు. వాళ్లని మార్చడం, మంచి వైపు మరల్చడం ఎవరికీ సాధ్యం కాదు"

"అసాధ్యం కావచ్చేమోగాని అసంభవం కాదు. మత్తు మందు భాయిలను విప్లవోన్ముఖుల్ని చేశాడు మావో"

తుళ్లిపడి చూశాను.

"చరిత్ర సృష్టించిన మహాత్ముల జీవిత కథలు చదవాలిరా. అప్పుడే ఎన్నో జీవిత సత్యాలు తెలుస్తాయి. అలాగే ఏ విజేత జీవితాన్నైనా సరే పరిశీలించు. ఎవరూ రాత్రికి రాత్రే ఉన్నతుడు కాలేదనీ ఆ స్థాయికి చేరుకోడానికి రేయింబవళ్లు కష్టించి ఫలితం సాధించాడని అవగతమవుతుంది"

"నిజమే మహాత్ముల చరిత్రల్ని ప్రతి యువతీ యువకుడూ చదవాలి. అవెంతో స్ఫూర్తినిస్తాయికూడా. కానీ కాంపిటీటివ్ బుక్స్ తప్ప ఇతర సాహిత్యాన్ని చదవాలన్న ఆసక్తి ఎందర్లో వుందీ? "

"నువ్వన్నట్లు జనమూ, సమాజమూ కూడా రకరకాల రుగ్మతల్తో సతమతమవుతోంది. ఒక గూండా ఖద్దరు ధరించి నాయకుడిగా చెలామణీ అవుతోంటే నువ్వు గూండావి అని చెప్పగల దమ్ములెవరికీ లేవు. అవినీతిపరుడికి దండవేసి సన్మానాలు చెయ్యడానిక్కూడా సిద్ధపడుతున్నారు తప్ప నువ్వు చీడపురుగువని వేలెత్తి చూపలేకపోతున్నారు. అయోగ్యులూ, అసమర్థులూ అధికార పీఠమెక్కితే హారతులుపడుతూ జైజైలు కొడుతున్నారు తప్ప నువ్వు ఫలానా అని చెప్పగల సత్తా ఎవరికీలేదు.

కళ్లెదుట అన్యాయాలూ అక్రమాలూ జరుగుతున్నా ఇదేమని ప్రశ్నించలేనంత పిరికివాళ్లుగా మారిపోయారు"

"యదార్థం చెప్పేవు. నా చిన్ని పొట్టకు శ్రీరామరక్ష అనుకునే జనాన్ని, అన్యాయం జరిగితే ఖర్మ అని సర్దిచెప్పుకునే జనాన్ని, పక్కవాడు ఏమైపోతే నాకేం నేను బాగుంటే చాలనుకునేవాణ్ని ఎవరు మాత్రం చైతన్యపరచగలరు తాతయ్యా"

"పైకి కన్పిస్తున్నంత నిరాశాజనకంగా లేదురా పరిస్థితి. కంప్లయింట్ చేస్తే పట్టించుకునే నాయకులున్నారు. రైళ్లని సమయానికి నడిచేట్లు శ్రద్ధ తీసుకునే అధికారులున్నారు. ఏసీబీ వారి భయంతోనే అయినా పని చేసి పెట్టే ఉద్యోగులున్నారు. నేరస్తుల్ని పట్టుకుని చోరీ సొత్తును రికవరీచేసి అప్పగించే పోలీసులూ వున్నారు. నీతినిజాయితీలకి మారుపేరుగా నిలిచే ఉద్యోగులున్నారు. చైతన్యపరిస్తే సారాగుండాలపై ధ్వజమెత్తగల మహిళాజనమూ వున్నారు. ఒప్పుకుంటావా లేదా? "

అంగీకార సూచకంగా తలాడించాను.

"నిరాశానిస్పృహల్ని దరిచేరనీయవద్దురా గాంధీ. నిస్పృహని నిన్ను స్పృశించనివ్వొద్దు. నీలాంటి యువకులు సంకల్పిస్తే ఈ దేశాన్నే కాదు మొత్తం ప్రపంచాన్నే ఇంకా బాగా తీర్చిదిద్దగలరు. ఆలోచించి చూడు"

తిరిగి తనే అన్నారు.

"గాంధీజీ మనకి స్వాతంత్ర్యం మాత్రమే తేలేదురా! మనల్ని గర్వించే జాతిగా తీర్చిదిద్దాడు. మన కాళ్లకి బలాన్ని, గుండెకి ధైర్యాన్నీ ఇచ్చాడు. ఆలోచనలకి సిద్ధాంత బలం ఇచ్చాడు. ఇలా జాతికి ఇంత ఆస్తినిచ్చిన జాతిపిత మరొకరులేరురా. కానీ ఆ ఆస్తిని చేజేతులా పాడుచేసుకుంటున్న సంతానం మనం. సిద్ధాంతాలు మన కాళ్లకే బంధం వేస్తాయేమోనన్న భయంతో దూరంగా జరుగుతోన్న జనం మనం!

ఇప్పుడు గాంధీజీ కొందరికి విమర్శకి ఒక పేరు, పిల్లలకి విచిత్ర వేషధారణకి ఒక పాత్ర. నాయకులకు ఒక ఊతపదం. ప్రజలకు ఊరిలో ఒక కాలనీ పేరు. విద్యాసంస్థలకి సెలవుదినం. ఆలనాపాలనా లేక కూడలిలో నిరాశగా చూసే ఒక మొండి విగ్రహం. ఇప్పుడు మన దుస్తులూ, వస్తువులూ, మాటలూ, ఆలోచనలూ అన్నీ విదేశీవే. మన చూపులన్నీ ఆకాశంలోకే. మనం నేలకేసి చూట్టమేలేదు. అందుకే నిలబడలేకపోతున్నాం. గాంధీజీ మనల్ని మనల్నిగా చేసిపోతే మనం మనకి కాకుండా పోతున్నాం. ఎంత ఘోరం"

తాతయ్య మాటలకి నాలో ఏదో తెలీని మార్పు, సంచలనం రాసాగింది. ఏదో చేసెయ్యాలన్నంత బలమైన కెరటం ఉవ్వెత్తున లేచి పడసాగింది. నా రక్తంలో ఏదో తపన వేడెక్కసాగింది.

"వివేకానందుడు యువతకిచ్చిన సందేశం ఏమిటో తెలుసా గాంధీ? " ఊపిరి పీల్చుకోడానికన్నట్టు ఓ క్షణం ఆగి తిరిగి చెప్పసాగారు.

"మీరు ప్రేమించండి. పేదలపట్ల, అనాయకులపట్ల, అట్టడుగు జనంపట్ల, దరిద్రనారాయణులపట్ల మనస్ఫూర్తిగా స్పందించండి. ఇతరులకు మేలు చేసే ప్రతి చిన్న సాయం మీలో అపారమైన శక్తిని నింపుతుంది. అదే అజేయమైన శక్తిగా రూపుదిద్దుకొంటుంది. మంచి చెయ్యడమే దైవత్వం. ఆత్మవిశ్వాసం వున్న కొద్దిమంది చరిత్ర ప్రపంచ చరిత్ర అని మరువకండి. నిష్క్రియాపరత్వంతో అలమటించే మేధావుల కన్నా పిడికెడు మెతుకులు సృష్టించే కర్షకుడి జీవితమే ఔన్నత్యభరితమని గుర్తించండి. పల్లెకు వెళ్లండి. శ్రమైక జీవన సౌందర్యాన్ని గమనించండి. మీరు ఆ రైతుల సేద్యంలో భాగస్వాములుకండి. స్త్రీపురుష భేదాలు, కులమత వివక్షతలు స్వార్థపరుల సృష్టి. వారి సంకెళ్లలో మీరు




బందీలు కాకండి. భక్తి పేరుతో, మతం పేరుతో దేశాన్ని, దేశప్రజలను విడదీసే వాళ్లే దేశానికి నిజమైన శత్రువులు. వారి పట్ల అప్రమత్తంగా ఉండండి"

"అరె అంత స్పష్టంగా చెప్పిన వివేకానందుడ్ని తమ వాడంటూ కొందరు స్వంతం చేసుకోవడం చిత్రంగా వుంది తాతయ్యా"

"అందుకనే యువత ఇతరుల మెదళ్లతో ఆలోచించడం, ఇతరుల కళ్లతో చూడటం, ఇతరులను గుడ్డిగా అనుసరించడం మానేసెయ్యాలి. వెన్నెముక లేని యువత జాతికీ దేశానికీ ఒరగబెట్టేదేమీ వుండదు. నీవు క్రీస్తు మాదిరిగా ఆవేదనచెందు, బుద్ధుని వలె కన్నీరు కార్చు, సజీవమైన దైవం నీలోనే ఉన్నట్టు అన్నాడు వివేకానందుడు. ఆయన సందేశాన్ని యువత ఆచరిస్తే వసుధైక కుటుంబం ఆవిర్భవించి తీరుతుంది"

"వివేకానందుడికీ గాంధీజీకీ నీకూ యువత మీదగల అచంచల విశ్వాసాన్ని తలచుకుంటే నా ఒళ్లు గగుర్పొడుస్తోంది తాతయ్యా. నేను సైతం ఏదో చేసెయ్యాలన్పిస్తోంది. 'నేను సైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతివ్వాలనీ విశ్వసృష్టికి అశ్రువొక్కటి ధారబోయాలనీ భువనఘోషకు వెర్రిగొంతుక వెచ్చించాలనీ అన్పిస్తోంది. నేను సైతం ప్రపంచాబ్జపు తెల్లరేకై పల్లవించాలనీ విశ్వవీణకు తంత్రినై స్వరార్చనైపోవాలనీ భువన భవనపు బావుటానై పైకిలేవాలనీ' వుంది తాతయ్యా" ఉద్వేగ్నుడ్నై వూగిపోతూ అన్నాను.

లేచివచ్చి నన్ను ఆప్యాయంగా కావలించుకున్నారు. వెన్ను నిమిరారు.

"నీ తాతయ్యనైనందుకు గర్విస్తున్నాన్రా గాంధీ!"

"నన్నేం చెయ్యమంటావో చెప్పు తాతయ్యా! ధర్మోపదేశం చెయ్యి తాతయ్యా"

"సత్యం, అహింస, తపస్సు, దానం ఈ నాలుగూ ధర్మదేవత పాదాలు. వాటిమీద ఆధారపడిందే ధర్మపాలన. ఆ పాలనలోనే సర్వజనులకీ శుభమూ, సుఖమూ, శాంతీ, తృప్తీ లభిస్తాయి. అందుకేం చెయ్యాలో ఎలా చెయ్యాలో నువ్వే ఆలోచించుకో. నీ మార్గాన్ని నువ్వే తీర్చిదిద్దుకో. ఆ మహత్తర కార్యక్రమం ఒక్కరోజులో సాధించలేం. ఒక్కరివల్ల సాధ్యమవుతుందన్న భ్రమా లేదు. ఆ దిశగా జనాన్ని చైతన్యపరిస్తే వారిలో కదలిక తెస్తే వారి చేత ఒక్క అడుగు వేయించగలిగితే నీ జన్మ ధన్యమవుతుందిరా గాంధీ"

"ఒకే తాతయ్యా! ఇంకెప్పుడూ వెనుకడుగు వేయను. పలాయన మంత్రం వల్లించను. నిరాశ, నిస్పృహలకి లోను కాను. ఆశావహమైన భవిష్యత్తులోకి అచంచల ఆత్మవిశ్వాసంతో అడుగు వేస్తాను. బుద్ధుడికి బోధి వృక్షంకింద జ్ఞానోదయమయిందిట. నాకీ రావివృక్షం కింద అయ్యింది తాతయ్యా! అర్జునుడికి కృష్ణుడు గీతోపదేశం చేస్తే నువ్వు నాకూ, నాలాంటి యువతకీ అభినవ గీతాన్ని ఉపదేశించావు తాతయ్యా" ఆనందోత్సాహాలతో అన్నాను.

"నాకు తెలుసురా నీలో ఇంత మార్పు వస్తుందనీ నువ్వందరిలాంటి వాడివి కాదనీ నాకు తెలుసు. నీకేముహూర్తాన గాంధీ అని పేరు పెట్టానోగాని ఆ పేరుని సార్థకం చేసుకుంటావన్న నమ్మకం చిక్కిందిరా" ఆనందబాష్పాలు చెంపలమీంచి జలజలరాలిపోతోంటే అన్నారు తాతయ్య.

"ఇక నాకు శలవు ఇవ్వు తాతయ్యా"

"విజయోస్తు, చివరిగా ఒక్కమాట. హృదయాలను స్పందింపచేసే శక్తి, చైతన్యాన్ని జ్వలింపచేసే సత్తువ, మనస్సులను కదలించే ప్రేరణ త్యాగానికి మాత్రమే ఉంటుందనడానికి వివేకానందుని జీవితమే నిదర్శనం"

★ ★ ★

సిటీలో అడుగు పెడుతూనే కొత్తగా ఫీలయ్యాను.

నాకు నేను కొత్త మనిషిలా అన్పించసా

గింది. కుబుసం విడిచినట్టు, మరో అవతారం ఎత్తినట్టుగా వుంది. జమ్మిచెట్టులో దాచిన అస్త్రాలని తీసుకున్న అర్జునుడిలా ఫీలవుతున్నాను.

ఒకరకంగా అది నిజమేనేమో. లక్ష్యాన్ని గ్రహించాను. కార్యసాధనార్థినై వచ్చాను.

యువత వెన్నుతట్టి వారి శక్తుల్ని ప్రోది చేసి జనం కోసం, దేశం కోసం ఉపయోగించేలా చెయ్యాలి. జనంలో కదలిక పుట్టించి చైతన్యవంతుల్ని చేసి తమ హక్కుల్ని సాధించుకునేందుకు తోడుండాలి.

అవినీతినీ అలసత్వాన్నీ రెడ్ టేపిజాన్నీ ఎదుర్కొని జన జీవితం బాగుపడేందుకు కృషిచెయ్యాలి.

ఆ దిశగా ఒక్క అడుగు వేయించగలగినా నా జీవితం ధన్యమైనట్టే. నా పుట్టుకకు సార్థకత చేకూరినట్టే. చటుక్కున అమ్మ గుర్తొచ్చింది.

నాకోసం కలవరిస్తూ దిగులుతో మంచం పట్టిందేమో అన్పించింది.

పరుగున వెళ్ళి అమ్మని చూడాలని బలంగా అన్పించింది.

మనసుని కంట్రోలు చేసుకున్నాను. ఆ ఇంట్లో మళ్లీ అడుగుపెట్టకూడదు. అక్కడి గాలి పీల్చి మైలపడదల్చుకోలేదు.

నిట్టూర్చి తిన్నగా కుమార్ రూంకెళ్లాను.

నన్ను చూసి ఆశ్చర్యమూ ఆనందమూ జంటగా చుట్టెయ్యగా "రారా... రా! ఇన్నాళ్లూ ఏమైపోయావురా! అన్నిచోట్లా నీకోసం ఎంక్వైరీ చేశాం. శిరీష ఏకంగా మీ ఇంటికే వెళ్ళి అడిగేసింది" అన్నాడు.

"శిరీషా? "

"వూ... శిరీషేరా. నువ్వేమత్తు జల్లేవోగాని నువ్వంటే పడిచస్తోంది. నీకోసం అనుక్షణం కలవరిస్తోందంటే నమ్ము" నవ్వుతూ చెప్పేడు.

శిరీష రూపం కళ్లముందు కదిలింది.

ఆమె మాటలు, ముఖ్యంగా చెడుని ఎదుర్కోడానికి ఒక వేదిక నెలకొల్పమన్న అభ్యర్థన గుర్తొచ్చింది.

నేను సహజ, డాడీల గొడవలో పడి మరచిపోయానుగాని అప్పట్లోనే ఏదో చెయ్యాలన్న తపన నాలో వేళ్లూనిందన్నమాట. దానికి తాతయ్యవల్లగాని ఒక రూపూ ఒక రేఖా రాలేదు.

"అయిపోయింది, గోవిందా!"

"ఏమైందిరా"

"పడిపోయావు. మళ్లీ ప్రేమలో పడిపోయావు"

"ఛా.. అదేం లేదురా"

"లేకపోవడమేమిటి? నువ్వు బుకాయించినా సరే నీ పరధ్యానం నిజం చెప్పేసింది. గుండెల్లో సహజ బొమ్మ తీసేసి శిరీష బొమ్మ పెట్టేశావన్నమాట. గుడ్, విష్యూ ఆల్ ద బెస్ట్"

"ఆ గొడవకేంగాని నీ రూంలో వుందామనొచ్చాను. ఇంకోరూం దొరికేవరకూ వుంటాను. నీకేం అభ్యంతరంలేదుకదా"

"సినిమా సెట్టింగులాంటి ఇంటి నొదిలేసి ఈ బుల్లి గదిలో వుండాల్సిన ఖర్మ నీకే మిత్రా"

"దీన్ని ఖర్మ అనుకోవడంలేదు. ఒక అవకాశంగా ఒక అవసరంగా భావిస్తున్నాను"

"సరేరా! నువ్వెప్పుడూ నాకు అర్థంకాని పజిల్ వే. చచ్చేలోగా నిన్నర్థం చేసుకుంటానన్న నమ్మకం కూడా లేదుగాని నీ ఇష్టమొచ్చినన్నాళ్లూ వుండు"

తాతయ్య ఇచ్చిన డబ్బు కొద్దిగా వుంది. అతి జాగ్రత్తగా వాడితే ఒక నెలరోజులకి సరిపోవచ్చు ఈలోగా పార్ట్‌టైం జాబేదన్నా చూసుకోవాలి. ఇంకొక్క రెండు నెలలు కష్టపడితే ఎంసిఏ పూర్తైపోతుంది.

"చిన్న జాబ్ పార్ట్‌టైమ్‌ది చూసుకోవాలి. నీకు తెలిసిన చోటెక్కడైనా వుంటే చెప్పరా కుమార్"

నా మొహంలో మొహం పెట్టి వింతగా చూశాడు.

"నీలో చాలా మార్పు కన్పిస్తోందిరా"





"మారిపోయానుకదా"

"హాయిగా డాడీ సంపాదన జేబులో కుక్కుకుని హీరోలా బైక్‌మీద తిరుగుతూ అమ్మాయిలకి సైట్ కొడుతూ డాన్స్‌చేస్తూ చికెన్‌బిర్యానీలూ చికెన్ సిక్స్టీఫైవ్‌లూ లాగిస్తూ జల్సా చెయ్యక ఎందుకొచ్చిన తిప్పల్రా ఇవీ. హేపీగా వుండాలనుకున్న వాడెవడూ పంతాలకీ పౌరుషాలకీ పోకూడదు. నీకు మొహం చెల్లకపోతే చెప్పు నేను తీసుకెళ్లి మీ ఇంట్లో అప్పగిస్తాను"

"థాంక్స్. ఆ ఊసింక ఎత్తొద్దు" బాత్‌రూంలోకెళ్తూ అన్నాను.

"వీడిహ మారడు. ఒకవేళ్దైనా మార్పు తేవాలంటే అది శిరీషకే సాధ్యం"

నా వెనుక వాడనుకున్న మాటలు నా చెవినపడ్డాయి. నవ్వుకున్నాను.

కుమార్‌తో కలిసి సిటీ బస్సులో కాలేజీకెళ్లాను.

ఏమైపోయావు, ఎక్కడికెళ్లేవంటూ చుట్టుముట్టేశారంతా.

"మిమ్మల్ని వదలి వుండలేక తిరిగొచ్చేశాన్రా" నవ్వుతూ అన్నాను.

"నువ్వు సరదాకి అన్నా ఆ మాట మాకెంతో ఆనందాన్నిచ్చిందిరా చెప్పరా! ఏం చెయ్యమంటావో చెప్పు చేసేస్తాం" అన్నాడు కరుణానందం.

"మీ అందరి సహాయసహకారాలూ కావాలి. అవేమిటో త్వరలోనే చెబుతాను"

"నీమీద మాకు నమ్మకం వుంది గాంధీ. దేన్నికైనా సరే మేం రెడీ" అన్నాడు షాజహాన్.

"ముందు పెళ్లి చేసుకో నాయనా" గోపాల్ అన్నాడు.

"త్వరగా తాజ్‌మహల్ కట్టించడానికా? " కుమార్ నవ్వేడు.

"ఒరే షాజహాన్! నువ్వు పెళ్లిచేసుకుంటే మాత్రం మాకో ఫేవర్ చెయ్యాల్రా" కరుణానందం అన్నాడు.

"ఫస్ట్‌నైట్ ఎక్స్‌పీరియన్స్ వర్ణించి చెప్పాలా? " మరెవరో అన్నారు.

నవ్వులు పువ్వులై పూస్తోంటే అన్నాడు కరుణానందం "అదేం కాదురా! గిఫ్ట్‌లివ్వడానికి మన దగ్గర పింగులుండవుకదా"

"అందుకని ఎదురు డబ్బిమ్మంటావా? "

"దారుణంగా మాట్లాడకోయ్! మనం ఫ్రెండ్సుంరా! గిఫ్టు ఇవ్వడం మన ధర్మం"

"నీకో దండంగాని నీ ఫేవరేంటో చెప్పి పుణ్యం కట్టుకో"

"నీ మేరేజ్‌కి ఎంతో కొంత చదివిస్తాం గాని దయచేసి క్రెడిట్ కార్డ్ యాక్సెప్ట్ చెయ్యరా నీకు పుణ్యం వుంటుందిగానీ" గెడ్డం పట్టుకుని మరీ అన్నాడు.

ఘొల్లుమన్నారంతా.

మా పక్కన మారుతి ఆగింది. అందులోంచి దిగారు సహజా, మురారీ. ఇద్దరూ ఎంతో అందంగా వున్నారు. ఆనందంగా వున్నారు. ఒకరితో ఒకరు పోటీ పడేలా వున్నారు.

సహజ నన్ను కాదన్నదనిగానీ మురారిని వరించిందనిగానీ నాకిప్పుడే కోశానా బాధగా లేదు. ఆమె మీద ఎలాంటి కోపమూలేదు.

ఆమెకన్నా ప్రేమకన్నా ముఖ్యమైనవి చాలా వున్నాయని గ్రహించడం దానిక్కారణం కావొచ్చు.

"హాయ్ సహజా! హౌఆర్యూ"

నవ్వుతూ పలకరించేసరికి షాకయ్యారంతా. సహజ మరీనూ.

"నేనంటే నీకు కోపంగాలేదా? " అపనమ్మకంగా చూస్తూ ప్రశ్నించింది.

"ఏమీ లేదు. నీ జీవితం నీ ఇష్టం. నువ్వాసించింది నీకు దక్కాలని మన స్ఫూర్తిగా కోరుకుంటున్నాను. బైదిబై మీరు త్వరగా మేరేజ్ చేసుకోవడం అన్నివిధాలా మంచిది. ఆలోచించండి"

"నేను స్టేట్స్‌కెళ్లి సెటిలయ్యాక వచ్చి మేరేజ్ చేసుకుని సహజని తీసుకెళ్దామనుకుంటున్నాను" అన్నాడు మురారి.

"నీ దృష్ట్యా ఒకే కాని సహజ దృష్టిలో

ఆలోచిస్తే అది మంచిది కాదు. తర్వాతే మైనా జరగొచ్చు ఇప్పటి మీ తిరుగుళ్ల దృష్ట్యా మీ మంచి కోరి చెబుతున్నాను"

"థాంక్యూ. ఛలో సహజా! ఉడుకుమోత్త నంతో చెబుతున్నాడు. వాడి మాటలు పట్టించుకోకు" ఆమెని తీసుకెళ్తూ అన్నాడు.

"మా గురుడిగురించి ఇంకోసారి అలా కూశావంటే వూరుకోను" కాలుదువ్వాడు కుమార్.

"కుమార్! లీవ్ హిమ్. వాళ్లు చదువు కున్న సంస్కారులు. చెప్పడం మనధర్మం గనుక చెప్పేం. ఆ తర్వాత వాళ్లిష్టం"

మురారి మొహం ముటముటలాడించు కుంటూ వెళ్తుంటే సాలోచనగా అనుసరిం చింది సహజ.

"నిన్నమొన్నటిదాకా ఆడపిల్ల మాటకోసం, వాలుచూపుకోసం తపస్సు చేసిన ఆ మురా రిగాడివాళ పెద్ద హీరోలా ఫోజు కొడుతు న్నాడు చూడు. నువ్వాపకపోయివుంటే వాడికో పంచ్ ఇద్దునుగురూ" అన్నాడు కుమార్.

"వాడికో లెసన్ చెప్పాల్సిందే. ఆ వీసా వచ్చినప్పట్నుంచీ వాడి కళ్లకి మనం పురు గుల్లా కన్పిస్తున్నాం" అన్నాడు షాజహాన్.

"ఇలాటి పోచికోలు కబుర్లకి స్వస్తి చెప్పి నిర్మాణాత్మకమైన కార్యం చేబడదాం. మన ఖాళీ సమయాన్ని పదుగురి కోసం వెచ్చిస్తూ సద్వినియోగం చేసుకుందాం"

నా మాటలకి "గుడ్ ఐడియా" అంటూ "నీవెంటే మేముంటాం" అని నా చేతిలో చేయివేశారంతా.

ఆఖర్న చేయి వేసింది శిరీష మరెప్పుడొ చ్చిందోగానీ.

"శిరీషా! నువ్వెందుకేశావో తెలుసా? "

"నువ్వు చేబట్టే ఏ కార్యక్రమానికైనా నా చేదోడు వుంటుంది"

"అవినీతినీ అధర్మాన్నీ ఎదిరించడానికి, బాధితులకి సహాయసహకారాలందించడా నికి ఒక వేదిక కావాలనీ నన్ను ఏర్పాటు చెయ్యమనీ ఇదివరకోసారి కోరావు గుర్తుందా? "

"గుర్తుండటమే కాదు ఇప్పటికీ ఆ మాట లకి కట్టుబడి వున్నాను"

"ఆ పని చెయ్యాలని నిశ్చయించుకు న్నాను. అందుకు యావత్ యువత చేదో డుగా నిలుస్తుందని నా నమ్మకం. మనమీ వ్యవస్థని మార్చలేకపోయినా మార్పుకి విత్తనం నాటగలమని నా విశ్వాసం. అనంత తిమిరాన్ని తరమలేకపోయినా ఒక చిన్న దీపాన్ని వెలిగించాలన్నది నా ఆకాంక్ష. అందుకు మీరంతా కలిసి చేతుల డ్డుపెట్టి జ్యోతికి కాపుకాస్తారని నా ఆశ"

"మేం రెడీ" మళ్లీ అంతా నా చేతిలో చేతులువేశారు.



"ఇన్నాళ్ళూ ఏమయ్యావు ఎక్కడున్నావు గాంధీ? "

లంచ్‌బెల్ మ్రోగగానే క్లాస్‌రూంలోంచి బయటికొస్తోంటే వెనకే వచ్చి అడిగింది శిరీష.

"మా తాతయ్యగారి పల్లెకెళ్ళాను..."

"ఇంట్లోవారి మీద కోపగించి వెళ్ళావుట. మీ అమ్మగారు చెప్పారు..."

"నువ్వు మా ఇంటికెళ్ళేవని కుమార్




చెప్పాళ్ళే. మా మమ్మీ ఎలా వుంది శిరీషా? "

"అలా అడుగుతావేమిటి? నువ్వింటి కెళ్ళలేదా? "

"వెళ్ళే ఉద్దేశంలేదు"

"మరిప్పుడెక్కడున్నావు? "

"కుమార్ గదిలో. చిన్న రెంట్‌హౌస్‌లాం టిది దొరుకుతుందేమో వెదకాలి. ముమ్ముందు నా కార్యక్రమాల్లో పాల్గొనటా నికి పదిమంది వస్తే మేడమీద కూర్చోడా నికి, సమావేశమవడానికి అనుకూలంగా వుంటుంది"

"అయితే మీ అమ్మగార్ని కలవనే లేదన్న మాట. చాలా దిగులుగా, బెంగగా వున్నారు. ఒకసారెళ్ళి కన్పించి రాకపో యావా? "

"ఆ ఇంటికెళ్ళడానికి మనస్కరించటం లేదు. మా డాడీకి నాకూ మధ్య గొడవ యింది"

"ఆ మాత్రానికే..."

ఆమెని మధ్యలోనే ఆపుతూ "అలా అనొద్దు. రేపదే పోరాటంగా మారినా మారొచ్చు" అన్నాను.

నా వంక తేరపారి చూసి వూరుకుండిపో యింది. రెట్టించి ప్రయోజనం లేదనుకుని వుంటుంది.

"నీ వెహికిల్ ఏది? " వెహికిల్స్ స్టాండ్ వంక చూస్తూ అంది.

"నా కాళ్ళే నా వాహనం..."

"బైక్‌ని కూడా వదిలేశావా? "

"ఇది అవినీతి కూడు తిన్న శరీరమే అని బాధపడుతున్నాను. వీలైనన్నిసార్లు రక్త దానం చేసి శుద్ధి చేసుకోవాలనుకుంటు న్నాను"

"మరీ ఎక్కువగా ఫీలవుతున్నావేమో"

"నా మనస్సంఘర్షణ గురించి ఏమాత్రం తెలిసినా నువ్వలా మాట్లాడవు. గాడ్‌ప్రామి స్‌గా చెబుతున్నాను. డాడీ లంచగొండి అని నాకు తెలీదు. తెలిసిన మరుక్షణం నా తనువూ, మనస్సూ కూడా భగభగమండా యనుకో. ఆ షాక్‌ని భరించలేక దూరంగా పారిపోవాలనుకున్నాను. రెండో ఆలోచన వచ్చి మా తాతయ్య దగ్గరికెళ్ళానుగాని లేక పోతే నువ్వెప్పుడైనా ఋషీకేశ్ వస్తే అక్కడ కన్పించేవాడ్నేమో"

"థాంక్‌గాడ్. నా గురించే వచ్చివుంటావు" అని నవ్వేసి "లంచ్ సంగతేమిటి? " అంది.

"ఏ కాకా హోటల్లోనో రొట్టెలతో సరిపెట్టే ద్దామనుకుంటున్నాను..."

ఆమె కళ్ళల్లో సన్నని కన్నీటిపొర కది లింది.

"భోంచేద్దాం రా...గాంధీ" తన కెనెటిక్ హోండాని బయటికి తీస్తూ అంది.

"సారీ శిరీషా. సానుభూతిని భరించ లేను"

"ఛాఛా. అదేంకాదు. ఇవాళ నా బర్త్‌డే. అందుకని పార్టీ ఇస్తున్నాను"

ఆమెవంక పరిశీలనగా చూశాను. తల స్నానం చేసింది. కొత్త చుడీదార్ ధరిం చింది. నిజమేనేమో అన్పించింది.

"విష్యూ మెనీ హేపీ రిటర్న్స్ ఆఫ్‌ద డే"

"థాంక్యూ. ప్రతి బర్త్‌డే నీతో కలిసి జరు పుకోవాలని వుంది"

"నేను తెగిన గాలిపటాన్ని"

"దారాన్ని నా కొంగుకి ముడివేస్తాన్లే" నవ్వుతూ వెహికిల్ స్టార్ట్ చేసింది.

భోంచేస్తున్నంతసేపూ ఏదేదో చెబుతూనే వుంది శిరీష. ఆమె మాటలేవీ నా చెవికెక్క డంలేదు. నా దృష్టంతా నాలుగు టేబుల్స్ అవతల కూర్చునున్న సులోచనమీదే వుంది.

ఒకప్పుడెంతో చలాకీగా వున్న ఆమె, మరెంతో ధైర్యంగా మా ఇంటికొచ్చివెళ్ళి సంగతి ఇంట్లో చెప్పిన ఆమె ఇప్పుడెంతో డల్‌గా వుంది. నిరాశగా వుంది.

నా చూపుల్ని గ్రహించింది శిరీష. "ఆమె నీకు తెలుసా? "

"మా వదిన"



"వ్వాట్" అరిచినంత పనిచేసింది.

అంతా మా వంక ఆశ్చర్యంగా చూశారు. సులోచన కూడా చూసింది.

చేయికడుక్కుని తిన్నగా వదిన దగ్గరికెళ్ళి పలకరించాను.

"ఎలా వున్నావు వదినా? పెళ్లెప్పుడు చేసుకోబోతున్నారు? "

ఆమె కళ్లల్లోకి కన్నీళ్లు పొంగివచ్చాయి.

"అరెరె... ఏవయింది? "

"నా రాత తారుమారయ్యింది"

"ఏం జరిగింది? "

"కూర్చో చెబుతా" దగ్గర్లో ఎవరూ లేరని నిర్ధారణ చేసుకున్నాక అంది. "మీ అన్నయ్య నన్ను తప్పించుకుతిరుగుతున్నారు"

"గొడవ పడ్డారా? "

"వూహూ. నేనంటే మోజు తీరినట్టుంది"

"మీరు పెళ్లి చేసుకున్నారుగా"

"అందుకనే చింతిస్తున్నాను. సిఏ పూర్తికాకుండా పెళ్లంటే ఇంట్లో ఒప్పుకోరంటే నిజమే అనుకుని మా ఊరి రిజిస్ట్రారాఫీసులో పెళ్ళి చేసుకున్నాం. అప్పుడు నువ్వూ వున్నావుగా. తర్వాత నెల తప్పింది. పది మందిలో పెళ్ళి కాకుండా పిల్లలు పుడితే పరువు పోతుందని మీ నాన్నగారంటే అబార్షన్ చేయించుకున్నాను. మా వాళ్ళతో మాట్లాడతాం. పెళ్ళికేర్పాటుచేస్తాం అన్న వాళ్ళు అబార్షన్ చేయించుకున్నా ఆ ఊసే ఎత్తడం మానేశారు. ఎలాగోలా నన్ను వదిలించుకోవాలని చూస్తున్నారు మీ అన్నయ్య..."

"మా బ్రదర్ జల్సామనిషే కాని ప్రేమించి పెళ్ళి చేసుకున్న నీకు అన్యాయం చేసేమనిషి కాదు"

"మొదట్లో నేనూ అలాగే అనుకున్నాను. కాని నిన్ననే తెలిసింది. రియల్ ఎస్టేట్ వ్యాపారి రామనారాయణతో కలిసి కోఆపరేటివ్ బ్యాంక్ ప్రారంభిస్తారట. వారమ్మాయిని పెళ్ళి చేసుకుంటారట"

కర్చీఫ్‌ని అడ్డుపెట్టుకున్నా దుఃఖం ఆగలేదు. బాత్‌రూంలోకెళ్ళి అయిదునిమిషాల కొచ్చింది.

ఉబ్బిన ఆమె కళ్లు చూసి కదిలిపోయాను.

"నువ్వేం అధైర్యపడకు వదినా. మీది చట్టబద్ధంగా జరిగిన వివాహం. విడాకుల కంగీకరిస్తూ నువ్వు సంతకం చేసిచ్చేదాకా అన్నయ్య మరో పెళ్ళి చేసుకోలేడు"

"కొత్త బ్యాంకుల్లో షేర్లు కేటాయిస్తానంటూ ఖాళీపత్రాలమీద సంతకాలు తీసుకున్నారు..."

"చూస్తోంటే అంతా ఓ పథకం ప్రకారం చేసినట్టే వుంది" మా సంభాషణంతా విన్న శిరీష అంది.

"ఏంచేసినా నీ స్థానాన్నెవరూ కాదన్లేరు వదినా. నువ్వు ధైర్యంగా వుండు. నీకు అండగా మేమంతా వున్నాం"

అర్థంకానట్టు చూసింది.

★ ★ ★

షాజహాన్ బండిమీద బతకమ్మకుంట వెళ్ళాం.

ఆ బస్తీలో దాదాపు నాలుగువందల కుటుంబాలున్నాయి. వారిలో ఎక్కువమంది పూటగడవనివాళ్ళే. పురుషులు రిక్షా తొక్కడం చిన్నాచితకా పనులు చేస్తే మహిళలు ఇళ్ళల్లో పాచిపనులు చేస్తూంటారు.

గత మూడేళ్ళనుంచీ అక్కడ సారా అమ్మకాలు జోరుగా సాగుతున్నాయి. ఉత్తిచేతుల్తో వచ్చినవాళ్లు సారా లాభాలతో భవంతులు కొనేస్థాయికెదిగారట. కాని తాగిన వాళ్ళ బతుకులు మరింత దిగజారాయిట.

దాంతో సారాని రూపుమాపాలని మహిళలంతా నిశ్చయించుకున్నారట. ఆబ్కారీశాఖగాని, పోలీసులుగాని సాయం రాకపోయినా గుడంబాపై మహిళలదండు దాడిచేసింది. సారా అమ్మకాలని నిలిపివేసింది. దొంగచాటుగా సారా ప్రవహించకుండా రాత్రివేళల్లో సైతం మహిళలు గస్తీతిరి




గారు.

బస్తీలో సారాను అమ్ముకోనిస్తే నాలుగు లక్షలిస్తామంటూ మగాళ్లతో బేరాలు పెట్టా రట. దాంతో అపరకాళికలయ్యారంతా.

"నాలుగు లక్షలుకాదు నాలుగు కోట్లి చ్చినా వెనకడుగు వేసేది లేదు. ఎవ్వడన్నా మళ్ళీ సారా అమ్మాడంటే ఎడమచెప్పుతో కొడతాం. చెప్పులదండ వేసి నడిపిస్తాం" అన్నారు ఆవేశంగా.

తమ బతుకుల్ని బాగుజేసుకోడానికి తమది తాగుబోతుల, తిరుగుబోతుల అడ్డా కాదని నిరూపించుకోడానికి అభిమానధ నులై ఉద్యమించిన మహిళల్ని మనస్ఫూ ర్తిగా ప్రశంసించాను.

"మీ ఐక్యతని మించిన శక్తిలేదు. గెలుపు మీదైతీరుతుంది. మీరు కొండంత అండగా నిలబట్టానికి మేమున్నాం" అని వత్తాసు పలికాను.

వాళ్ళు ఉద్యమించిన తీరు ఉత్తేజకరంగా ఉంది.

★ ★ ★

తలుపు చప్పుడయింది. వెళ్ళి తలుపు తీశాను.

అమ్మ, ఆమె వెనుక శిరీష.

"మమ్మీ..."

"నీకు నేను గుర్తులేకపోయినా నిన్ను చూడాలని నేనే వచ్చాన్రా"

"ఛా... అదేంమాట మమ్మీ. నీ గురించి శిరీషని కూడా అడిగాను... నిన్ను చూడా లని వున్నా ఆ ఇంటికి రాలేక..."

"ఇలా ఎన్నాళ్ళు పంతం పట్టి కూర్చుంటా వురా? "

"డాడీ మారేవరకూ"

"మారలేనంతగా మారిపోయారాయన"

"అయితే ఎప్పటికీ ఇలాగే ఉంటాను"

"నా కెందుకీ కడుపుకోతరా? " కన్నీళ్ల చిప్పిల్లుతోంటే అంది అమ్మ.

"ఒక అవినీతిపరుడి భార్యనైనందుకు"

"హు... నువ్వు కఠినుడివిరా"

"అవును మమ్మీ. అయినవాళ్లైనా సరే అధర్మంగా ప్రవర్తిస్తే ఎదిరించేంత వజ్రసం కల్పుడ్ని అవ్వాలని ఆశీర్వదించు మమ్మీ".

"కన్నతండ్రితోనే కయ్యానికి కాలుదువ్వు తావన్నమాట"

"సత్యం, ధర్మం, నీతి, నిజాయితీ నాకు ముఖ్యం. వాటి కోసం ఏం చెయ్యడానికైనా వెనుదీయను. ప్రహ్లాదుడి కథ రిపీట్ అవ్వ కూడదంటే డాడీని మారమని చెప్పు మమ్మీ. అక్రమంగా సంపాదించిందంతా అనాధాశ్ర మాలకిచ్చేద్దాం. ఇకనుంచి నీతిగా పరువుగా బతకొచ్చు... ప్లీజ్... మమ్మీ... నువ్వుచె బితే డాడీ తప్పకుండా వింటారు..."

"వినర్రా. ఎదురు నీ దగ్గరికొచ్చినందుకు తిట్టి పోస్తారు. మారేవారైతే మొక్కగా వున్నప్పుడే మీ తాతయ్య మాటల్ని వినే వారు. ఇప్పుడు మ్రానయ్యారు. ఎవరి మాటా వినరు. ఎవర్నీ లెక్కచెయ్యరు"

"సరే. ఆయన కర్థమయ్యే భాషలో పాఠం చెబుతాలే. అన్నయ్య సంగతేం టమ్మా. రామనారాయణగారమ్మాయిని పెళ్ళి చేసుకుంటానంటున్నాట్ట. సులోచన చెప్పింది"

"పెళ్లి మాటలు జరుగుతున్నాయి. నెత్తీనోరూ కొట్టుకొంటున్నా నా మాటెవరూ విన్పించుకోవట్లేదు"

"విన్పించుకోడానికి మేమున్నాం మమ్మీ" చిన్నగా నవ్వుతూ అన్నాను.

★ ★ ★

"యాభైమూడేళ్లకాలం. వేలకోట్ల రూపా యల ధనం. ఎన్నో ప్రణాళికలు. ఎందరో ప్రధానులు అయినప్పటికీ అందరికీ కనీసం అన్నాన్నీ అక్షరాన్నీ అందివ్వలేకపోయాం. ఇప్పటికీ ఆకలి కేకలు వీధుల్లో ప్రతిధ్వని స్తూనే వున్నాయి. ఎన్నెన్నో గ్రామాల్లోని జనానికి తాగునీరు లేదు. చలినుండి వేడి మినుండి శరీరాన్ని కాపాడుకోడానికి తగి నంత గుడ్డలేదు. మనిషికి ప్రాథమికావసర మైన గూడులేక రోడ్లపక్క పేవ్‌మెంట్లమీద



ఎందరెందరో ఊసురోమని బతుకుతున్నారు. ఇదేనా మనం సాధించిన ప్రగతి? ఇందుకోసమేనా అలనాడు స్వాతంత్ర్య సమరయోధులు పోరాటాలు చేసి, లాఠీల దెబ్బలు తిని, ఉరికంబాల ఉయ్యాలలూగి ఆస్తుల్నీ, ఆప్తుల్నీ మాతృభూమికర్పించింది? మనమంతా ఆత్మపరిశీలన చేసుకోవాల్సిన సమయం వచ్చింది"

రోజూ పేపర్లలో చదువుతూనే వున్నాం. దొరికినచోట్లల్లా వేల కోట్ల రూపాయల విదేశీఋణం తెస్తున్నారు. ఆ సొమ్ముని ఎవరు ఎలా ఎందుకు వినియోగిస్తున్నారో లెక్కలు కావాలి. మనల్ని ఋణదాస్యంలోకి నెట్టుతోన్న నేతలకి పల్లెల్లో మరుగుదొడ్లు లేక అవస్థ పడుతోన్న మహిళల దౌర్భాగ్యస్థితి ఎందుకు కన్పించడం లేదని నిలదీయాల్సిన సమయం వచ్చింది.

నేటి మన వ్యవస్థ స్థితిగతులు మీ అందరికీ తెలుసు. ఎటుచూసినా అవినీతి, అధర్మం, ఆశ్రితపక్షపాతం, బంధుప్రీతి, అలసత్వం, జవాబుదారీ లేనితనం, గూండాయిజం, మాఫియాల విహారం, రైతులమ్ముకునే పంటనుంచి మనం కొనే సరుకులవరకూ దోపిడీ దళారీల విన్యాసాలు, వీటికి తోడు ప్రపంచీకరణ పేరుతో దేశాన్ని ముంచెత్తుతోన్న బహుళజాతి సంస్థల ఉత్పత్తులు, శాటిలైట్ ఛానెల్స్ ద్వారా మన సంస్కృతిపై దాడి. సామాన్యుల గోడు ఎవరికీ విన్పించదు. వారికి రక్షణగా ఒక్కరూ నిలవరు. లంచగొండిని లంచగొండి అని, గూండాని గూండా అని చెప్పలేని బలహీనత. వారిని చీడపురుగుల్లా చూడలేని అసహాయత. జాతి ఇంతగా ఎందుకు దిగజారిందో, ఇంత నిర్వీర్యం ఎందుకయిందో మనం ఆలోచించితీరాల్సిన పరిస్థితి వచ్చింది..."

ఉపన్యాసం ఆపి సభని కలియజూశాను. పిన్‌డ్రాప్ సైలెన్స్.





సిటీ నలుమూలల్నుంచీ "వందేమాతరం' ' ప్రారంభోత్సవానికి విచ్చేసిన యువతీయువకులూ, సిటిజన్లూ, సీనియర్ సిటీజన్లూ, మేధావులూ, పత్రికా విలేఖర్లూ, టీవీ ఛానల్స్‌వారూ ఆసక్తిగా నావంకే చూస్తున్నారు. చూస్తూ ఆలోచిస్తున్నారని నాకు తెలుసు.

"మీరు చెప్పింది బాగానే వుందండీ. మీరేం చేస్తారో, ఏమేం చెయ్యదలిచారో అది చెప్పండి" ఒక విలేఖరి లేచి ప్రశ్నించాడు.

"అది చెప్పడానికే మిమ్మల్నందర్నీ ఆహ్వానించాం. మీ అందరి సహకారమూ మాక్కావాలి. అప్పుడే మా ఆశయం జనంలోకెళ్తుంది 'వందేమాతరం' జనానికి అసలైన వేదిక అవుతుంది" క్షణకాలం ఆగి తిరిగి ప్రారంభించాను.

"వందేమాతరం వాచ్‌డాగ్స్‌లా పనిచేస్తుంది. కొన్ని పత్రికల్లా పెట్‌డాగ్స్‌లా కాదని గమనించప్రార్థన..."

అధికారుల అవినీతి లీలల్నీ, రౌడీరాజకీయాలనీ ఎండగడతాం. వారిమీదున్న కేసుల వివరాలు ప్రజలకి చెప్పి ఇలాంటివారిని ఎన్నుకోవద్దని బహిరంగ విజ్ఞప్తి చేస్తాం. అవినీతి రాజ్యమేలుతోన్న ప్రతిచోటా నిఘా వేయిస్తాం. అవినీతిపరుల్ని పట్టిస్తాం. ప్రభుత్వ కార్యాలయాల్లో ప్రజలకన్యాయం జరక్కుండా చూస్తాం. విద్య, వైద్య సౌకర్యాలన్నీ అందేందుకు కృషిచేస్తాం. మహిళలపై, దళితులపై వివిధరకాల దాడుల్ని ఎదుర్కొంటాం. వరకట్న వేధింపుల్నీ, అక్రమ వ్యాపారాల్నీ, ప్రజాధన దుర్వినియోగాన్నీ అది ఇది అని లేదు జనానికి కీడుచేసే ప్రతిదాన్ని ఖండిస్తాం. సరిదిద్దేలా ప్రయత్నిస్తాం. ఇంతేకాదు. అవినీతిపరుల బండారాల్ని బయటపెట్టి వారు నివాసముంటోన్న ప్రాంతంలో ప్రచారంచేసి వారికి సంఘంలో గౌరవం లభించకుండా, పరువు లేకుండా చేస్తాం. నీస్థానం ఇది అని జనం చేత వేలెత్తి చూపింపజేస్తాం. అలాటివారిలో మార్పు తీసుకురావడానికి కృషి

చేస్తాం. అలాగే గూండానాయకుల్ని, బ్లాక్ మార్కెటర్లనీ భూఆక్రమణదారుల్నీ, బడా కాంట్రాక్టర్లనీ అందర్నీ కూడా ఉతికి ఆర వేస్తాం. ఏమాత్రం గౌరవాభిమానాలున్నా సరే వారిలో వారు కుళ్ళిపోయేలా ఇకవద్దీ వెధవబతుకు అనుకునేలా చెయ్యాలన్నది మా తపన. అందుకు మీ అందరి సహాయ సహకారాలు వందేమాతరంకి కావాలని సవినయంగా విన్నవిస్తున్నాను"

ముకుళిత హస్తాలతో చెప్పాను.

హర్షధ్వానాలు మిన్నుముట్టాయి.

ఒక వృద్ధమూర్తి మనవడిచేతి ఆసరాతో అతికష్టంమీద స్టేజీమీద కొచ్చారు.

"నేను రెండు మాటలు చెబుదామనొచ్చాను. మన వేదాలూ, పురాణాలూ చెప్పిన బాటలో చిరంజీవి గాంధీ, అతడి మిత్రులూ నడుస్తున్నందుకు నాకు చాలా ఆనందంగా వుంది. అసతోమా సద్గమయ, తమసోమా జ్యోతిర్గమయ, మృత్యోర్మా అమృతంగమయ, సర్వేజనా సుఖినోభవంతు- అన్నారు పెద్దలు. అంటే అసత్యంనుంచి సత్యానికి, చీకటినుంచి వెలుగులోకి, మృత్యువునుండి అమరత్వంలోకి సాగమన్నారు. సర్వమానవాళి సుఖంగా వుండాలన్నారు. ఆ లక్ష్యంతో కృషిచేస్తున్న వీరందర్నీ ఆశీర్వదిస్తున్నాను. చుట్టూవున్న చీకటిని తిడుతూ కూర్చోకుండా వీళ్ళు ప్రయత్నమనే చిరుదీపాన్ని వెలిగిస్తున్నారు. ఈ దీపం అఖండ జ్యోతి అయ్యేలా చూడమని ఆ భగవంతుణ్ని ప్రార్థిస్తూ ఈ కృషికి నా వంతుగా వందరూపాయలు విరాళం ఇస్తున్నాను"

చప్పట్లు మార్మోగాయి.

గబుక్కునెళ్ళి ఆయనకి పాదాభివందనం చేశాను.

"విజయోస్తు" నిండు మనసుతో ఆశీర్వదించారాయన.

"మీ సంస్థకి 'వందేమాతరం' అని పేరు పెట్టడంలో ఆంతర్యం ఏమిటో వివరిస్తారా? " సభికుల్లోంచి ఒకరు అడిగారు.

"వందేమాతరం అన్నది కేవలం కొన్ని అక్షరాల పదం కాదు. వందేమాతరం అంటే ఒక మహాసంగ్రామం. ఒక మహోద్యమం. మనశ్శరీరాలు రెండూ ఒక్కటై ఒక్కపెట్టున వినిపించే మధురమైన నినాదం. వందేమాతరం ఒక గీతం కాదు. ఒక చరిత్ర. ఒక సంస్కృతి. ఒక సంప్రదాయం. ఒక తిరుగుబాటు. జాతిజనులు పాడుకునే జప మంత్రం. అలాగే మా ఈ వందేమాతరం కూడా జనం గుండెచప్పుడు కావాలని, ప్రతి గుండె తలుపుని తట్టి ఉత్తేజపరచే జలపాతపు సవ్వడి కావాలని మా ఆశ. జాతి మూలుగుల్ని పిప్పి పిప్పి చేస్తున్న అవినీతి శృంఖలాలని ఖణేల్మని తెగతెంచి మానవతా శిరస్సుపైన కురిసే సుగంధపుష్పాల జడి కావాలని మా తపన!"

అయిదు నిమిషాలపాటు దిక్కులు పిక్కటిల్లేలా కరతాళధ్వనులు మార్మోగాయి.

"ఎవరికైనా ఇంకేమైనా సందేహాలుంటే నిర్భయంగా ప్రశ్నించవచ్చు" సభాధ్యక్షస్థానంలో కూర్చున్న శిరీష ప్రకటించింది.

"డా. జయప్రకాష్ నారాయణ్‌గారు స్థాపించిన లోకసత్తాలానే మీ సంస్థా అచిర కాలంలోనే ప్రజల ఆదరాభిమానాలు చూరగొనాలని ఆశిస్తున్నాను. నా సందేహం ఏవిటంటే సంస్థకి ఊపిరి గాంధీ అన్నది బహిరంగసత్యం. అయినప్పటికీ సంస్థ అధ్యక్షులుగా శిరీషని ఎన్నుకోవడంలో మతలబు ఏమైనా వుందా? "

విలేఖరి ప్రశ్నకి శిరీష నా వంక చూసింది.

"మహిళల కార్యదీక్షా దక్షతల గురించి అమ్మ ఉగ్గుపాలు తాగి పెరిగిన మనందరికీ తెలిసిన విషయమే. తప్పు చేసిన పిల్లల బుగ్గగిల్లి సన్మార్గంలో పెట్టే మహిళ ఇంటినే కాదు ఇలనీ తీర్చిదిద్దగలదని మా విశ్వాసం. ఓరిమికీ సహనానికీ నిస్వార్థసేవకీ స్త్రీ పెట్టింది పేరు. పైగా ఒక యువతి అధ్యక్షురాలిగా వుంటే ఎందరెందరో స్త్రీలు మా



# ఏరినముత్యాలు

★ నిజాయితీగల వ్యక్తి తన న్యాయమైన సందేహాన్ని ఎప్పటికీ వదులుకోలేడు

–బెర్నార్డ్‌షా

★ జాతి ఎలాంటిదైనా, జన్మ ఎలాంటిదైనా, నీతి ఒక్కటుంటే నెగ్గుకురావచ్చు

–బెంజిమన్ ఫ్రాంక్లిన్

★ ఉత్సాహమే స్వర్గము. నిరుత్సాహమే నరకము

–వివేకానంద

★ నిరాశావాదిగా ఉండటంకన్నా, ఆశావాదిగా ఉండటం మంచిది. కానీ అంతకంటే మిన్న వాస్తవవాదిగా ఉండటం

–డా. పాల్‌బ్రంటన్

★ మీ పేరు మలినం కాకుండా ఉండాలంటే, గుణవంతులతో కలసి తిరగాలి.

–జార్జివాషింగ్టన్

★ ఒక దేశం తయారుచేసే నాయకుల్నిబట్టి ఆదేశం గుర్తింపు పొందుతుంది.

–రూజ్‌వెల్ట్

★ మాట్లాడటం కంటే వినడానికి ఎక్కువ సహనం అవసరం

–నెహ్రూ

★ సమర్థతకు పాఠశాల లేదు

–టర్కీ సామెత

★ వివేకవంతుడెప్పుడూ నిన్నటికంటే, రేపటికంటే, నేడు తెలివిగా మసలుకుంటాడు.

–కోల్టన్

★ ఆప్త స్నేహితులను కాపాడుకోగల వ్యక్తి అదృష్టవంతుడు. ఎందుకంటే స్నేహం భగవంతుడిచ్చిన వరాలలో ఒకటి

–థామస్ హ్యూగ్స్

★ ఎవరిపట్లా ద్వేషం లేకుండా, అందరిపట్లా ఉదారంగా ఉండగలగాలి.

–అబ్రహాంలింకన్

★ అంతరాత్మ అనేది మానవునిలో దాగున్న దైవత్వం

–స్వీడన్‌బర్గ్

★ నీవు చేస్తున్న పని ధర్మ విరుద్ధము కాదని నీకు పూర్తిగా విశ్వాసము కలిగినప్పుడు ఆకర్మ సత్కర్మయే అవుతుంది.

–సోక్రటీసు

★ మనదేశంలోని మహానుభావులందరూ ధర్మోపన్యాసాల ద్వారాగాక ధర్మాచరణ ద్వారానే గుర్తింపబడ్డారు.

–వినోబాభావే

★ సౌకర్యాలు అతిథిలా వస్తాయి. క్రమక్రమంగా యజమానిని అదుపుచేస్తాయి. చివరకు దానిని బానిసగా చేస్తాయి.

–దలైలామా

సేకరణ: పి.వి.రమణకుమార్

సంస్థ అంటూ ముందు కొస్తారని మా నమ్మకం. మగవారిలోకన్నా మహిళల్లో ఎక్కువ చైతన్యం రావాలన్నది మా ఆకాంక్ష. ఎంచేతంటే రాబోయేకాలాన్ని నడిపించేది నిస్సంశయంగా మహిళే. ఇక మనం చవిచూడబోయేవన్నీ మహిళ విజయాలే. అందుకెన్నైనా ఉదాహరణ లివ్వగలను. మొన్న సారానిషేధ ఉద్యమం. నిన్న ఉత్తరప్రదేశ్‌లో పర్యావరణ పరిరక్షణ ఉద్యమం. నిన్నా నేటి నర్మదాబచావ్ ఆందోళన. నేడు గ్రామాల్లో నవచైతన్యం తెస్తోన్న డ్వాక్రా గ్రూపులు. వీటన్నిటికీ మహిళలే నేతలూ, మార్గదర్శకులూ..."

ఆడవారిలో కొందరమ్మాయిలు "హియర్ హియర్" అంటూ లేచి అరిచారు.

"మీరు అడక్కపోయినా మరో సంగతి మనవి చేయదలిచాను. మా సంస్థలో సభ్యత్వం . యువతకే పరిమితం చేశాం. అందుక్కారణం. నిస్వార్థత ఏదో చెయ్యాలన్న తపన, అన్యాయాన్ని ఖండించేతత్వం, ధైర్యం వారిలో ఎక్కువ ఉంటాయనే. అలా అని ఇతరుల సహకారాన్ని నిరాకరించబోవట్లేదు. అందరి సహకారం, ఆశీస్సులు మాక్కావాలి. వాలంటీర్లుగా అన్నివర్గాల వారూ ముందుకు రావాలని మా విజ్ఞప్తి. 'వందేమాతరం' నాదం అవినీతిపరుల గుండెల్లో సింహనాదమై ప్రతిధ్వనించేలా చెయ్యాల్సిన భారం, బాధ్యత మనందరిదీ అని గుర్తించమని ప్రార్థిస్తున్నా. సంస్థ కోసం ధనవంతుల్ని దేబిరించి చందాలు వసూలు చెయ్యం. ఇది ప్రజల సంస్థ. ప్రజల కోసం పనిచేసే సంస్థ. కులమత పార్టీల కలీతమైన సంస్థ. దీన్ని సక్రమంగా నడిపించే బాధ్యత జనానిదే. ఒక్కరూపాయినుంచి మీకు తోచిన విరాళాలివ్వాల్సిందిగా అర్థిస్తూ లంచం ఇవ్వకండి, అవినీతి జాడ మాకు చెప్పండని ప్రార్థిస్తూ సెలవు తీసుకుంటున్నాను. నమస్తే"

సభకి నమస్కరించి వచ్చి కూర్చున్నాను. శిరీష లేచి మైకు అందుకుంది.

"వందేమాతరం ప్రారంభోత్సవ సభకి విచ్చేసిన మీ అందరికీ వేనవేల నమస్కారాలు. అవినీతి గురించి ఆచూకీ ఇవ్వడమే గాక అవినీతిపరుల్ని పట్టివ్వడానికి, సాంఘిక బహిష్కరణ చెయ్యడానికి మీరంతా సహకరించాల్సిందిగా మనవి చేస్తున్నాను. ముఖ్యంగా ఆఫీసులూ అధికారులూ మనకి సేవచేయడానికున్నారు. ఆ హక్కుని నిలుపుకుందాం. లంచాలివ్వడం మానేద్దాం. మీకు అండగా మేమున్నాం. మా ఈ ప్రయత్నం మహోద్యమస్థాయికి చేరితే తప్ప జాతికి పట్టిన జాడ్యం వదలదు. నేను రెండు మాటలు చెప్పి ఈ సభని ముగిస్తాను.

ధనం, కామం, క్రోధం- ఇవే మనిషిలో నేరప్రవృత్తిని పెంచి పోషిస్తాయి. ఇందులో ఏ ఒక్కటి మనిషిని ఆవహించినా అతను సమాజపు కట్టుబాటును అతిక్రమిస్తాడు. ఇవి మూడూ సహరుగ్మతలే. ఒకటి మిగతా రెంటినీ ఇట్టే ఆకర్షిస్తుంది. వీటికి గురైన మనిషి తన భవిష్యత్తునే కాదు, తన ఆత్మీయుల జీవితాల్నే కాదు సమాజాన్ని సైతం అల్లకల్లోలం, అశాంతిమయం చేస్తాడు. వీటి బారినపడకుండా వుండటానికి మనం ప్రయత్నిద్దాం. ఈ రుగ్మతల్నుంచి బయట పడాలనుకునేవారికి చేయూతనిద్దాం. అందులోనే సుఖముందనుకునేవారి చెంపలు వాయగొట్టి, చెవులు మెలేసి దారిలో పెడదాం. మా పోరాటం రోగంమీదగాని రోగిమీద కాదని మనవి చేస్తూ వందేమాతరం జనంవాణిగా, జీవనాడిగా చేస్తారని ఆశిస్తూ ఇంతటితో ఈ సభని ముగిస్తున్నాను. నమస్కారం..."

మిన్ను ముట్టిన కరతాళధ్వనులు చెప్పాయి విజయం మాదేనని.



"వందేమాతరం"కి ఊహించనంత ప్రతిస్పందన లభించింది.

పత్రికలు చక్కగా ప్రచారం చెయ్యడమే గాక సూచనలూ, సలహాలూ ఇస్తూ విశ్లేష ణాత్మక వ్యాసాలు కూడా రాశాయి.

ఇక కుప్పతెప్పలుగా వచ్చిపడుతున్న ఉత్త రాల గురించి, ఫోన్‌కాల్స్ గురించి స్వయంగా వచ్చి చెప్పేవారి గురించీ ఎంత చెప్పినా తక్కువే అవుతుంది.

అదృష్టవశాత్తూ మా పరీక్షలు పూర్తవ డంతో మేమంతా పూర్తికాలాన్ని వినియోగిం చగలుగుతున్నాంగాని లేకపోతే వాటన్నిటికీ అటెండవటం అసాధ్య కార్యమయ్యేది.

వచ్చిన ఫిర్యాదుల్ని శాఖాపరంగా విడ గొట్టి సంబంధిత అధికారుల్ని కలిసి సమస్యా పరిష్కారానికి కృషిచేస్తున్నాం.

ప్రతివారిలో గూడుకట్టుకున్న భయం మా పనిని సానుకూలపరుస్తోంది. వందే మాతరం పేరు విన్పిస్తే చాలు వారికి చెమ టలు పడుతున్నాయి.

కొన్ని ఆఫీసుల్లో వివిధ కారణాలవల్ల ఫైళ్లు పెండింగులో ఉన్నప్పటికీ కేవలం లంచం ఇవ్వనందునే కావాలని పెండింగు పెట్టారని వాదించే కంప్లయింట్లు కూడా అధికంగా వచ్చాయి. ఉద్యోగులమీద జనా నికున్న దురభిప్రాయానికి నిదర్శనం ఇది!

ఈ అపప్రథ పోవడానికి ప్రభుత్వం సైతం చర్య తీసుకోకపోవడం దారుణం!

కొందరు ప్లీడర్లూ మహిళా ఉద్యమకారి ణిలూ సీనియర్ సిటిజన్లూ ఉద్యోగులూ, విద్యార్థులూ "వందేమాతరం"కి సాయపడ తామని ముందుకొచ్చారు. వస్తున్నారు. వారందరి సహకారంతో నిర్విఘ్నంగా ముందుకి సాగిపోతోంది వందేమాతర రథం.

★ ★ ★

టీవీలో ప్రసారమవుతోన్న తెహల్కాటేపుల్ని చూస్తోన్న మా శిరస్సులు సిగ్గుతో భూమిలోకి కృంగిపోయాయి.

ఈ దేశపు నేతలు, అత్యున్నత రక్షణాధి కార్లు, మరీ ఇంత అవినీతిపరులూ, దగాకో రులూ, మోసగాళ్ళూనా? డబ్బుకోసం ఎంతటి నీచానికైనా పాల్పడగల వీళ్ళు బేరంవస్తే దేశాన్ని కూడా అమ్మెయ్యడానికి సిద్ధపడరూ?

"ఓ మైగాడ్! ఎంత దారుణమో చూడండి. పావలాకీ పరక్కీ కక్కుర్తిపడేవా ళ్ళని చూసి లంచగొండులని ఈసడించుకుం టున్నాం. ఇక వీళ్ళని ఏమనాలి? వీళ్ళ గురించి చెప్పడానికి సరైన పదాలు తెలు గులో లేవేమో అన్పిస్తోంది" నిస్పృహగా అన్నాను.

"తెహల్కా డాట్‌కమ్‌వాళ్ళు లేని కంపెనీ పేరుతో వస్తేనే వారి మంచిచెడ్డలు సైతం తెలుసుకోకుండానే సాగిలపడిపోయారు. ఇక ఏ పాకిస్తాన్ గూఢచారులో మారువే షాల్లో వచ్చివుంటే ఏంజరిగేదో వూహించడా నికే భయమేస్తోంది" అంది శిరీష.

"ఈసరికే అలాటివి జరగలేదని నమ్మకం ఏమిటి చెప్పు? వీళ్ళ వరస చూస్తోంటే దేశ కీలకరహస్యాలని ఎప్పుడో అమ్మేసినట్లే వున్నారు. అంతా బద్మాష్‌లే. తోడుదొంగలే. దేశాన్ని నిలువునా దోచుకుతినేస్తున్నారు నాయాళ్ళు" తిట్లందుకున్నాడు షాజహాన్.

"మనం ఎన్ని తిట్లు తిట్టినా ఎంతగా శపించినా వాళ్ళు మారర్రా. ఎంచేతంటే కోట్లు మింగినట్లు రుజువైనా జయలలితా, లాలూయాదవ్ ఒక్కరోజైనా జైల్లో గడి పారా? చిప్పకూడు తిన్నారా? లేదే. బుల్లి నేరస్తులకి బెయిలు కూడా దొరకదు. రాజ కీయ నేరస్తులకి వారి జీవితాంతం బెయిలు లభిస్తుంది" నిరాశగా అన్నాడు కరుణా నందం.

"ప్రజల్లో చైతన్యం వచ్చేంతవరకూ ఈ పరిస్థితిలో మార్పు రాదురా. అవినీతిప రుల్ని, లంచగొండుల్ని, దోషుల్ని, ద్రోహుల్ని సంఘానికి పట్టిన చీడపురుగుల్లా చూడాలి. అసహ్యించుకోవాలి. సాంఘిక బహిష్కర ణకి గురిచెయ్యాలి. ఆ దిశగా మన వందే మాతర ఉద్యమాన్ని నడిపించాలి. అవినీ





తికి పాల్పడకుండా వుండటమేకాదు. అవినీతిని ప్రోత్సహించవద్దనీ, అవినీతిపరుల్ని గౌరవించవద్దనీ చెప్పి వారి తప్పు వారు తెలుసుకునేట్టుగా పశ్చాత్తాపపడేట్టుగా మనం చెయ్యాలి. ఇది మన యువతరం వల్లా వందేమాతరంవల్లా మాత్రమే సాధ్యమవుతుంది"

నా అభిప్రాయంతో ఏకీభవిస్తూ చప్పట్లు కొట్టారంతా.

వందేమాతరంతో మమేకం కావడానికి అవినీతికి వ్యతిరేకంగా సాగే మహాయజ్ఞంలో ఓ సమిధ కావడానికి సిద్ధంగా వున్నామంటూ ప్రతిజ్ఞ చేశారంతా.

శ్రీశ్రీ కవిత "నేను సైతం..." గుర్తొచ్చింది.

నా ఒళ్లు పులకరించిందొక్కసారిగా.



అన్నయ్యకోసం రెండ్రోజుల్నుంచి ప్రయత్నిస్తున్నాను. ఎలాగైనా సులోచనకి న్యాయం చెయ్యాలన్న పట్టుదలతో వున్నాం. కాని నా గొంతు వింటూనే లైన్‌కట్ చేస్తున్నాడు.

అమ్మకి ఫోన్‌చేసి చెప్పాను.

"నేనేం చెయ్యగ్లనా గాంధీ. నా మాటకి ఇంట్లో వీసమెత్తు విలువుంటేకదా" అని బాధపడింది.

"బ్రదర్‌కీ డాడీకి చెప్పు మమ్మీ. సులోచన ఫిర్యాదు వందేమాతరం చేపట్టింది. నేనిప్పుడు గాంధీగా కాదు వందేమాతరం కార్యకర్తగా మాట్లాడుతున్నాను. పరిస్థితి చేయిదాటితే నన్ను నిందించవద్దు. అటువంటి స్థితి రాకుండా ముందుగానే మేల్కొంటే అందరికీ మంచిది. అన్నయ్యకీ ముఖ్యంగా డాడీకి వాళ్లకర్థమయ్యేభాషలో చెప్పు మమ్మీ"

"చెబుతాన్లేగాని నువ్వు ఇంటికి రారా అన్నీ వుండి కూడా ఏమీలేనివాడిలా పరయిపంచన తలదాచుకోవడం బావోలేదురా లోకం ఏమనుకుంటుందో ఒక్కసారి ఆలోచించరా" ప్రాధేయపూర్వకంగా అంది.

"నేనిప్పుడు ఫ్రెండ్‌రూంలో లేను మమ్మీ. ఓ భవనం మీదున్న చిన్న రెంట్ హౌస్‌లో వుంటున్నాను. వందేమాతర కార్యాలయమూ అదే. మేడమీది ఖాళీప్రదేశమే మా మీటింగు ప్లేసు"

"తండ్రిమీద కోపగించి వెళ్ళావని అంతా చెప్పుకుంటున్నార్రా. అది నీకు మాత్రం జయమా చెప్పు. నామాట విని ఇంటికి తిరిగొచ్చెయ్యరా"

"తప్పకుండా వస్తాను మమ్మీ. మొదట డాడీని తన పద్ధతులు మార్చుకోమను. నీతిగా బతకమను"

నా వాక్యం పూర్తికాలేదు. ఇంతలో లైన్లోకొచ్చారు డాడీ.

"ఒరే. నలుగురు జులాయిల్ని పోగుచేసుకుని వీధెక్కి గొడవ చేసినంతమాత్రాన నువ్వు హీరోవి అయిపోవు. బ్లాక్‌మెయిలింగులు మానేసి ఉద్యోగం చూసుకుని చేసుకో. ఖర్మకాలి నీకు గవర్నమెంటు జాబ్ వస్తే అప్పుడు ముక్కుకి సూటిగాపోయి ముక్కు బద్దలు గొట్టుకో. అభినందిస్తాను. అంతేగాని ఈ కుక్క మొరుగుళ్లు కట్టిపెట్టెయ్"

"సారీ డాడీ... మేం మొరిగి వూరుకోం. కరుస్తాం కూడా"

"అందుకే నువ్వంటే చాలామంది ఉన్నతాధికార్లు కక్షగా వున్నారు. ఏ క్షణంలోనైనా ఏమైనా జరగొచ్చు ప్రాణాలకన్నా సిద్ధాంతాలు విలువైనవికావుగాని వెధవ్వేషాలు కట్టిపెట్టు. నీకు బెంగుళూరులో మంచి జాబ్ చూస్తాను. ఈ గొడవలకి దూరంగా వెళ్ళిపోయి సుఖపడు... నీ మేలుకోరి చెబుతున్నాను"

"థాంక్స్. తప్పులు అందరూ చేస్తారు. త్యాగాలు మాత్రం కొందరే చెయ్యగలరు. ఆ రెండో కోవలోకి చేరాలన్నది నా తాపత్రయం"

"నీలో ఇంత మూర్ఖత్వం గూడుకట్టుకుందనుకోలేదు"

"నా సంగతి వదిలేయండి. అన్నయ్యకి వేరే పెళ్లి చెయ్యాలని చూస్తే మీ ఆటలు సాగనివ్వను. ఇంకో సంగతి. మీ మీదా ఫిర్యాదులొస్తున్నాయి. మీరు మీ పద్ధతి మార్చుకోకపోతే పరిణామం తీవ్రంగా వుండొచ్చు గుర్తుంచుకోండి"

"యూ బ్లడీస్కౌండ్రల్... నామీదే ఎదురు తిరిగేంత మొనగాడివయ్యావట్రా. చేసుకోరా. నీ ఇష్టం వచ్చినట్టు చేసుకో. గాంధీ అనేవాడు చచ్చేడనుకుంటాను"

లైన్ కట్ చేశారు.

డాడీ బీపీ పెరిగి ఎంతగా అరుస్తారో, అమ్మ మీదెన్ని కేకలేస్తారో వూహించగలను.

"నువ్వు మాట్లాడింది మీ డాడీతోనా?" మా సంభాషణ విన్నది కాబోలు శిరీష అడిగింది.

తలూపాను.

నిమిషానంతరం తలొంచుకునంది "అంకుల్ మీద పరిశ్రమలవారూ వ్యాపారులూ ఫిర్యాదులు చేశారు. ఏంచేయాలో పాలుపోవట్లేదు"

"అలా మాట్లాడతావేంటి శిరీషా. అందరి విషయంలో చేసినట్టే చెయ్యి..."

"కాని అంకుల్ మీ డాడీ కదా..."

"ప్రతివాళ్ళూ వాళ్ళ పిల్లలకి డాడీ అవుతారు. అలాగని వారిమీద జాలి చూపిస్తున్నామా? లేదే. తన, మన అన్న బంధనాలనుంచి మనం బయటపడకపోతే ఇతరులని వేలెత్తి చూపే అర్హత మనకుండదు. వందేమాతరం అని ఉచ్ఛరించడానిక్కూడా తగం"

"సారీ గాంధీ... నువ్వు నా దృష్టిలో చాలా ఎత్తుకి ఎదిగిపోయావు..."

"పొగడ్తలొద్దు. మనం ప్రశంసలకోసమో సన్మానాలకోసమో ఈ పనులు చెయ్యటం లేదు. ఒక బాధ్యతగల యువతగా ఒక దీక్షా బద్ధులంగా చేస్తున్నామంతే. దేశం మాకేమిచ్చిందని ప్రశ్నించకుండా దేశానికి మేమేమిచ్చామన్న ప్రశ్నకి సమాధానంగా కృషిచేస్తున్నామంతే. ఇకపోతే ఇవాళ నేనూ మరి కొందరం కలిసి రామనారాయణని కలిసి వస్తాం. నువ్వు కొందర్ని తీసుకెళ్ళి ఆయన కూతుర్ని కలిసి సులోచన గురించి చెబితే బావుంటుంది. పెద్దవాళ్లు మూర్ఖంగా ప్రవర్తించినా చిన్నవాళ్లు అర్థంచేసుకుంటారని ఆశగా వుంది"

"ఓకే. సులోచన సమస్యనివాళ పరిష్కరించేద్దాం"

కుమార్, గోపాల్ తదితరుల్ని వెంటేసుకుని రామనారాయణ రియల్ ఎస్టేట్ ఆఫీసుకెళ్ళాను.

పెద్ద స్వంత బిల్డింగ్. సెంట్రలైజ్డ్ ఏసీ. కింది అంతస్థులో రియల్ ఎస్టేట్ ఆఫీసు. చిట్ ఫండ్ కంపెనీ, ఫైనాన్స్ కంపెనీ.

లోపలంతా పెద్ద పెద్ద సోఫాలూ, కార్పెట్లూ, ఇండోర్ ప్లాంట్లూ చాలా పోష్‌గా వుంది.

"ఇరవైఏళ్లక్రితం కట్టుబట్టల్తో సిటీకొచ్చాడు. కొందర్తో కలిసి ఊరి చివర్న భూమి కొని ప్లాట్లుగా వేశాడు. స్కీములూ, ప్రైజులూ పెట్టాడు. పార్ట్‌నర్స్ మధ్య గొడవొచ్చి ఎవడిష్టమొచ్చినట్లు వాళ్ళు ప్లాట్స్ అమ్మేశారు. ఎందర్నో ఎన్నో రకాలుగా





మోసగించారు. ఒక ప్లాట్‌నే ఇద్దరు ముగ్గురికి రిజిస్ట్రేషన్ చేసిన సందర్భాలూ వున్నాయి. కొనుక్కున్నవాళ్ళు కేసుల్తో వేగలేక వదులుకున్నారు. నోరున్నవాళ్ళు స్వాధీనం చేసుకుని ఇళ్ళు కట్టుకున్నారు. ఆ వెంచర్లో బాగా డబ్బు సంపాదించి స్వంతంగా తనే కంపెనీ పెట్టాడు. మరి వెనుదిరిగి చూడలేదు. ఇప్పుడు ఏ.సి. రూంలో కూర్చుని పెద్దమనిషిలా ఫోజులు కొడుతున్నాడు" కుమార్ చెప్పాడు.

"నీతిని నమ్మినవాడెవడూ కన్ను మూసి తెరచేలోగా ధనవంతుడైపోలేడు" అన్నాడు గోపాల్.

ఇంతలో మాకు పిలుపు వచ్చింది. లోపలికెళ్ళాం.

"ఎక్కడి ప్లాట్స్ కొనాలనుకుంటున్నారు? మీకు తెలుసుగా మావి నాలుగు ప్రెస్టేజియస్ ప్రాజెక్ట్సున్నాయి"

మేం జవాబిచ్చేలోగా సెల్‌ఫోన్ మోగింది. దానికి అటెండయ్యాక "ఒక నిర్ణయానికి రాకపోతే మా డెవలప్‌మెంట్ ఆఫీసర్తో మాట్లాడండి. అన్నీ వివరిస్తాడు" అన్నాడు.

"మీతోనే పనుండి వచ్చాం. ప్లాట్స్ పని కాదు. మేం వందేమాతరం నుంచి వచ్చాం"

అతన్లో చిన్న జెర్క్ వచ్చింది. అది మా దృష్టినుంచి తప్పించుకోలేకపోయింది.

నిటారుగా అయి అన్నాడు, "మాది వెల్ ఎస్టాబ్లిష్డ్ ఫర్మ్. మా మీద కంప్లైంట్సు రావు. చిన్నా చితకవి వస్తే చెప్పండి ఎడ్జస్టుచేస్తాను. మీరేమైనా మీటింగు పెట్టినా సావనీర్ ప్రచురించినా చెప్పండి మా సాయం మీకుంటుంది. నాకు అర్జంటు పనుంది" లేవబోతూ అన్నాడు.

"చందాలతో కొనగలిగింది కాదు వందేమాతరం. మీమీద ఆధారసహిత ఫిర్యాదు వస్తే ఇంతసేపు ఇంత శాంతంగా కూర్చునే వాళ్ళం కాదు. ఇక పోతే మేం వచ్చింది డీసీటివో గారబ్బాయి ఆనంద్‌కి మీ అమ్మాయినిచ్చి పెళ్లి చేయదలచిన విషయం గురించి"

చటుక్కున కోపం వచ్చేసిందతడికి. "అది నా పెర్సనల్ మేటర్"

"కరక్టే. కాని ఆనందకి పెళ్ళయ్యింది. భార్య వుంది. రెండో పెళ్లి చట్టరీత్యా నేరం"

"అదంతా కట్టుకథ"

"రిజిస్ట్రార్ ఇచ్చిన ఈ సర్టిఫికెట్ కూడా కల్పితమేనా?" సర్టిఫికెట్‌ని ముందుకి తోస్తూ అన్నాను.

అది చూసి అన్నాడు "బెదిరించడానికొచ్చారా?"

"మేం అహింసా వాదులం. నచ్చచెప్పడానికొచ్చాం"

"మీరు వెళ్ళొచ్చు"

"ఈ పెళ్ళి ఆపనంటారు"

"ఆపను"

"పర్యవసానం తెలిసే మాట్లాడుతున్నారా?"

"ష్... మొరుగుళ్ళొద్దు. కుక్క మొరిగేది భయంతోనేగానీ పరాక్రమంతో కాదని నాకు బాగా తెలుసు. గెటవుట్"

"యాజ్ యూ విష్. మీకు తెలుగులో చెప్పినా మా మాటలర్థంకాలేదు. చేతలు అర్థమవుతాయేమో చూద్దాం. బై..."

★ ★ ★

"హాయ్ గాంధీ"

ఆగి చూశాను. మారుతి జెన్‌లోంచి దిగాడు కాలేజీ మిత్రుడు దినేష్.

"హాయ్ దినేష్. ఎలా వున్నావురా. కన్పించి చాన్నాళ్లయింది" షేక్‌హేండిస్తూ అన్నాను.

"నాకేం... వెరీ ఫైన్. డాడ్ బిజినెస్ చూస్తూ హేపీగా గడిపేస్తున్నాను. బైదిబైనెక్ట్సు వీక్ నా మేరేజ్‌రా. నువ్వు తప్పకుండా రావాలి. మన ఫ్రెండ్సంతా వస్తారు. సరదాగా కలిసి స్పెండ్ చేసినట్టు కూడా వుంటుంది" వెడ్డింగ్ కార్డు ఇస్తూ అన్నాడు.

సెంటు గుబాళింపుని ఆస్వాదిస్తూ కార్డు

తెరిచాను. చాలా ఖరీదైన కార్డు. బహుశా వంద రూపాయలు పైనే వుండొచ్చు

"తప్పకుండా వస్తాన్రా"

"ఈమధ్య నీ పేరు పేపర్లలో మార్మోగిపోతోంది. ఏకంగా క్రూసేడర్ అని రాసేస్తున్నారు. పాలిటిక్స్‌లోకి జంప్‌చేస్తావా? "

"చెయ్యను"

"మరా గోలంతా ఎందుకు? ఎవర్ని ఉద్ధరించడానికిరా"

"చెప్పినా నీకర్థంకాదులే"

"ఎందుక్కాదు? "

"బంగారు పిచికవి కదా"

"జోక్ చెయ్యడం ఎప్పుడు నేర్చావురా. అన్నట్టొరేయ్ గాంధీ, మొన్న నీ ఎక్స్ గాళ ఫ్రెండ్ కన్పించిందిరా. పూర్‌గాళ్. దెబ్బ మీద దెబ్బ తగిలేసరికి తట్టుకోలేకపోతోందనుకో. బిలీవ్ మీ. తనని చూసి గుర్తుపట్టలేక పోయానంటే నమ్ము"

"ఎవరి గురించి చెబుతున్నావురా"

"ఎవరి గురించో అయితే నీ దగ్గరెందుకు చెబుతాన్రా. నీ గాళ్‌ఫ్రెండ్ సహజ సంగతి..."

"ఆమె కేవలం ఫ్రెండ్ మాత్రమే"

"మురారిని తగులుకోక మునుపు నీ గాళ్ ఫ్రెండే కదా, నీ చుట్టూ ఉపగ్రహంలా తిరిగేది. నీ భజనే చేసేది..."

"ఆ చాప్టరెప్పుడో చిరిగిపోయింది కదా"

"అఫ్‌కోర్స్. మురారితో కలిసి యు.ఎస్. చెక్కెయ్యొచ్చని కలలు కంది. చెట్టాపట్టాలేసుకుని తిరిగింది. ఇప్పుడా ఛాన్సు మిస్సయ్యింది"

"ఏమయ్యింది? ఆమెనొదిలేసి మురారి వెళ్ళిపోయాడా? "

"ఫ్లైట్ ఎక్కకముందే నీకో నమస్కారం అనేశారు"

"ఎవరు? "

"యు.ఎస్. కంప్యూటర్ ఫీల్డ్‌లో స్లంప్ వచ్చింది కదా. మన వాళ్ళు చాలామందిని ఉద్యోగాల్లోంచి పీకేశారు. కొన్ని వందల సాఫ్ట్‌వేర్ కంపెనీలు మూతపడ్డాయి. చాలా మంది ఎన్నారైలు పెట్టేబేడా సర్దుకు నొచ్చేశారు. మిగతావాళ్ళు తక్కువ జీతాలకి రాజీ పడిపోతున్నారు. మొత్తానికి ఐ.టి. రంగాన్నో కుదుపు కుదిపేసింది కదురా. నీకు తెలీదూ? "

"అది తెలుసులే. దానికీ సహజకీ సంబంధం ఏమిటంటావు? "

"మురారికి జాబ్ ఇస్తానన్న కంపెనీ బోర్డు తిప్పేసింది. సో- వాడి ప్రయాణం కొండెక్కింది. సహజ పల్లెకెళ్ళిపోయింది. మురారి ఓ ఎమ్మెల్యేగారమ్మాయి మెడలో తాళికట్టేశాడు. కథ కంచికి సహజ ఇంటికి!"

"వెరీ బేడ్. మురారి దగాచెయ్యడం ఏం బావోలేదు"

"సహజ తక్కువ తినలేదు కదా. నీకు హేండిచ్చి మురారి వెంటబడింది. వాడేమో ఆమెకి హేండిచ్చి మరొకర్ని చేసుకున్నాడు దట్సాల్" అదేదో సింపుల్ విషయం అన్నట్టుగా చెప్పాడు దినేష్.

"యువత ఎండమావుల వెంట పరుగెట్టడం మానాలి. మనమే విలువల వలువల్ని విప్పేస్తే ఇక పెద్ద వాళ్ళ సంగతి చెప్పేదేముంది? "

నావంక అదోలా చూస్తూ అన్నాడు, "నువ్వేమీ అనుకోనంటే ఓ మాట చెబుతాను."

"చెప్పరా"

"నీ మాటలే కాదు నువ్వూ అర్థంకావు. నువ్వెప్పుడూ ఓ పజిల్‌లా కనిపిస్తావురా నాకు. నీకు నువ్వైనా అర్థమవుతావో లేదో మరి. వస్తాన్రా. నా మారేజికి మాత్రం తప్పకుండా రా సుమా".

మారుతి జెన్ దూసుకెళ్ళింది.

చిన్నగా నవ్వుకున్నాను.

వెహికిల్ని స్టార్ట్ చెయ్యబోతోంటే ఒకతను నా దృష్టిలో పడ్డాడు.




అతడు శేషావతారం. ఈసీ కోసం సబ్‌రి జిస్ట్రార్ ఆఫీసుకెళ్ళినప్పుడు లంచమివ్వందే కాగితం ముట్టనన్నది అతడే.

ఎంతో దిగులుగా వున్నాడు. దిక్కుతోచని వాడిలా వున్నాడు. పక్కనే పదేళ్ళ అమ్మాయి వుంది.

ఏదైనా ప్రోబ్లం ఏమోననుకుని అతడి దగ్గరికెళ్ళి విష్ చేశాను.

"ఇలా వచ్చారేంటి? "

"నువ్వు..."

"మీ పాత కష్టమర్నిలెండి. ఈసీ కోసం వస్తే రెండు చెరువుల నీళ్ళు తాగించారు" నవ్వుతూ అన్నాను.

తల గోక్కుంటూ ఇబ్బందిగా నవ్వేడు.

"నేనేమైనా హెల్ప్ చెయ్యగలిగితే చెప్పండి చేస్తాను"

"పెద్ద సమస్య వచ్చి పడింది" బాధగా చెప్పాడు.

"కాస్త వివరంగా చెప్పండి"

"మా అమ్మాయి దీప... ఒంట్లో బావోటం లేదని మా ఊరి ఆసుపత్రిలో చూపించాను. మరెలా వచ్చిందో ఏమోగాని గొంతుకలో కేన్సరొచ్చిందన్నారు. ఇప్పుడి ప్పుడే మొదలయ్యిందట. వెంటనే సిటీ తీసుకెళ్ళి గవర్నమెంటాసుపత్రిలో చూపించ మన్నారు. కేన్సర్ కణాల్ని నాశనం చేస్తే నా బిడ్డకేం ఫరవాలేదన్నారు" కళ్ళు తుడు చుకున్నాడు.

"ఈ రోజుల్లో కేన్సర్ నయంకాని జబ్బేం కాదు. అయిదారు నెలలు ట్రీట్‌మెంటు తీసుకుంటే పూర్తిగా నయమైపోతుంది ధైర్యంగా వుండండి"

"ఆ నమ్మకంతోనే వచ్చాం. హాస్పటల్లో అడ్మిట్ చేసుకోడానికీ కరెంటు పెట్టడానికీ దానికీ దీనికీ బోల్డు డబ్బు కావాలంటు న్నారు. ఇవ్వందే బెడ్ కూడా కేటాయించ రట. పేరుకి ప్రభుత్వాసుపత్రి. ప్రతీదానికీ రేట్ల బోర్డు!"

అతడి కళ్ళల్లోకి సూటిగా చూశాను.

ఒకనాడు అతడూ అలా మాట్లాడినవాడే. తల దించుకున్నాడు.

"ఇప్పటికేమాత్రం ఖర్చయ్యిందేవిటి? "

"మా ఊళ్ళోనూ ఇక్కడా టెస్టులకే పదివే లదాకా ఖర్చయింది. ఇంకో పదిహేనువే లుంటేగాని పని జరిగేట్టులేదు. పీఎఫ్ కూడా డ్రా చేసేశాను. ఇంకేం చెయ్యాలో తోచడంలేదు"

నూరు గొడ్లు తిన్న రాబందు ఒక్కగాలి వానకి గోవింద అన్న సామెత గుర్తొచ్చింది. ఎందరో చిన్న చిన్న వాళ్లని పీడించి పదీ పరకా నొల్లుకున్నాడు. ఇప్పుడు మరొకరికి వేలల్లో సమర్పించాల్సొచ్చింది.

ప్రతీ ఆఫీసులోనూ ప్రతి ఉద్యోగీ తన ధర్మాన్ని తను నిర్వర్తిస్తే మీకిలాటి పరిస్థితి ఎదురయ్యేదికాదు. కానేం చేస్తాం. తమదాకా వస్తేగాని ఎవరూ తెలుసుకోరు. తెలిసినా తమనితాము సంస్కరించుకోరు"

గబుక్కున నా చేయి పట్టేసుకున్నాడు. "క్షమించుబాబూ, బుద్ధి గడ్డితిని నీ దగ్గర డబ్బులు తీసుకునుంటాను. అదేమీ మన స్సులో పెట్టుకోకుండా పెద్దాసుపత్రిలో నీకె వరైనా తెలిసిన వాళ్ళుంటే మాట సాయం చెయ్యి. నా బిడ్డకి ప్రాణ దానం చెయ్యి. చచ్చి నీ కడుపున పుడతాను"

"ఈ హాస్పిటల్ గవర్నమెంటుదండీ. అంటే మనందరిదీనూ. అక్కడ తెలిసిన వాళ్ళుండక్ఖర్లేదు. ఎవరం వెళ్ళి మన రేషన్ కార్డు చూపించినా మనకి వైద్యం చేస్తారు. పదండి వెళ్దాం"

"లాభం లేదు బాబూ. కాళ్ళావేళ్ళా పడ్డా గజ్జికుక్కని తరిమినట్టు తరిమేశారు. చేతిలో రూపాయలు పడందే మన మొఖం వంక కూడా చూడరు. నేనూ గవర్నమెంటు సర్వెంటునని చెప్పినా సరే ఆఖరికి వార్డు బోయ్ కూడా కసిరేస్తున్నాడు"

"నేనున్నాగా రండి చెబుతా"

సంకోచిస్తూనే అనుసరించాడు.

ఆసుపత్రిలోకి ప్రవేశించేముందు అతడి

జేబుకి 'వందేమాతరం' బ్యాడ్జి పిన్ చేశాను.

"ఇదేవిటి? "

"తర్వాత మీకే తెలుస్తుంది కదా. జిల్లా డాక్టరిచ్చిన రిపోర్టుల్నీ రేషన్‌కార్డునీ తీసు కెళ్ళి రిసెప్షన్ కౌంటర్లో చూపించండి"

"ఇంతక్రితం నన్ను కసిరింది ఆవిడే"

"ఇప్పుడు సాదరంగా ఆహ్వానిస్తుంది. చూడండి. మీరేం ఇదవ్వకండి. మీ వెనుకే నేనున్నాను కదా"

సంకోచిస్తూనే అతడా రిపోర్టులన్నీ చూపించాడు.

నర్సు రిపోర్టులు చూళ్ళేదు. అతడి జేబు కున్న బ్యాడ్జి మాత్రమే చూసింది. కూర్చో మని సైగచేసి లోపలికెళ్ళింది. ఒకరిద్దరు నర్సులూ వార్డుబోయ్, ఒక జూనియర్ డాక్టరూ వచ్చి చూసి వెళ్ళారు.

ఒక్కసారిగా వాతావరణం గప్‌చిప్‌గా మారిపోయింది.

నర్సు వచ్చింది. మర్యాదగా మాట్లా డింది. వివరాలు రాసుకుంది. స్వయంగా డాక్టరు దగ్గరకి తీసుకెళ్ళింది.

మొఖం వెలిగిపోతోంటే వచ్చి చేతులు జోడించి అన్నాడు. "మా దీపని అడ్మిట్ చేసుకున్నారు. బెడ్ కేటాయించారు. ఇవాల్టినుంచే ట్రీట్‌మెంట్ మొదలుపెడుతు న్నారు. మీ రుణం ఎలా తీర్చుకోవాలో తెలీ టంలేదు"

"ఈ గొప్పతనం నాది కాదు మీరు ధరిం చిన వందేమాతరంది"

"అవునిది నిజంగా గొప్పదే. మంత్రంలా పనిచేసింది. ఇదేంటి బాబూ"

"తారక మంత్రం!"

★ ★ ★

"మీ అన్నయ్యకీ రామనారాయణగార మ్మాయికీ వచ్చేనెల పదిన పెళ్ళంట"

పిడుగులాంటి వార్త చెప్పింది శిరీష.

"సులోచన వచ్చిందా? "

"ఊహూ తనని బాగా బెదిరించినట్టు న్నారు. తన ఫిర్యాదు పట్టించుకోవద్దనీ మీ అన్నయ్యకీ తనకీ పెళ్ళి కాలేదనీ రాసిచ్చింది"

"రామనారాయణేదో అస్త్రం ప్రయోగించా డన్నమాట. ఆయనకంత పట్టుదల దేనికో అర్థంకాదు. మా అన్నయ్యకన్నా మంచి వరుడు లభించడన్నట్టు మూర్ఖంగా ప్రవర్తి స్తున్నాడు"

"అది పట్టుదలాకాదు మూర్ఖత్వమూ కాదు. అహంకారం... తన మాటే చెల్లా లన్న అహంకారం. తనకి తిరుగులేదన్న ధనమదం"

"నువ్వెళ్ళి చెప్పినా ఆ అమ్మాయి కూడా పెళ్ళికి సిద్ధపడటం చిత్రంగా లేదూ? "

"పెళ్ళికి ముందు ఎన్నో ఎఫయిర్లుం టాయి. అవన్నీ హై సొసైటీలో ఎవరూ పట్టించుకోరు అంది రామనారాయణ కూతురు. ఏం చెప్పాలి చెప్పు"

"మనమేదో దారిచూడాలి. ఎలాగైనా సరే ఆ పెళ్ళి ఆపాలి"

పచార్లు చేస్తోంటే పరుగునొచ్చాడు గోపాల్.

"గురూ, దొరికేశాయి. రామనారాయణ భూకబ్జా ఆధారాలు దొరికేశాయి!"

"ఓ. గ్రేట్ గ్రేట్..." ఆనందోద్వేగంతో ఊగిపోయాను.

★ ★ ★

ఉదయంనుంచీ కంప్యూటర్ ముందు నుంచి లేవలేదు.

వచ్చిన ఫిర్యాదుల్నీ తీసుకున్న చర్యల వివరాలనీ చదువుతూ తీసుకోవాల్సిన చర్యల్ని సూచిస్తూ ఫీడ్ చేస్తూండిపోయాను.

శిరీష వచ్చింది. ఏదో చెప్పడానికి సంశ యిస్తున్నట్టు గమనించి "ఏంటి శిరీషా? " అనడిగాను.

"సరదాగా కాస్సేపలా తిరిగివద్దాం గాంధీ"

"బోర్ కొడుతోందా? "

"అహహ. పొద్దుట్నుంచీ దీక్షగా పనిచే స్తూనే వున్నావు. కాస్సేపు విశ్రాంతి అవ సరం. స్టూడెంట్ లైఫ్‌లో ఎంత ఫ్రీనెస్

ఎంజాయ్ చేశామో ఇప్పుడంత టైట్‌గా వుంది షెడ్యూలు" అంటూ నవ్వింది.

ఆ నవ్వు ఎంతో ముగ్ధమోహనంగా అన్పించింది.

"ఇన్నాళ్ళూ గమనించలేదుగాని నీ నవ్వు చాలా బావుంటుంది శిరీషా. మోనాలిసాలా విడీవిడని పెదాలతో చాలా గుంభనంగా సుందరంగా స్వచ్ఛంగా నవ్వుతావు"

"ఫరవాలేదే. నువ్వింకా జడపదార్థం అయిపోయావేమో అనుకుంటున్నాను. నీలోనూ స్పందనలున్నాయన్నమాట"

"శిరీష ఇవాళ నన్ను ఆట పట్టించాలని ఒట్టుపెట్టుకున్నట్టుందే"

"అట్సరే, నా మాటమీద గౌరవం వుంటే వెంటనే లేస్తావు"

"వందేమాతరం ఛైర్మన్‌వి. నీమాట మాకు వేదవాక్కు" అంటూ ఫీడ్ చేసిం దాన్ని సేవ్ చేసి ఫైలు క్లోజ్‌చేసి లేచాను "పని ఒత్తిడి, పని భారం అధికంగా వున్నా ఇందులో ఎంతో తృప్తి వుంటోంది శిరీషా. పదిమంది కోసం ఏదో చేస్తున్నాం ఎంతో కొంత చీకటిని మన చేతులతో పగలగొట్టి వెలుగుకు రోడ్డువేస్తున్నాం అన్న సంతృప్తి మరింత కష్టపడమని పురిగొల్పుతోంది"

"ఇతరులకి సేవ చెయ్యడంలో, ఇతరులకి సాయపట్టంలో ఇంత తృప్తి, ఆనందం వున్నాయని నాకింతవరకూ తెలీదు. నా ఈ ఆనందానికీ గౌరవానికీ సమాజంలో ఓ గుర్తింపు రావడానికీ నువ్వే కారణం గాంధీ. నేన్నీకు చాలా ఋణపడి వున్నాను"

"అన్యాయాల్ని ఎదిరించడానికి ఓ వేదిక కావాలనీ, దాన్ని నన్ను ఏర్పరచమనీ ప్రథమంగా చెప్పింది నువ్వే. అవాళ నువ్వు నాటిన బీజమే ఈనాడు వందేమాతరమనే మహావృక్షమైంది. సో... నేనే నీకు ఋణపడి వున్నాను"

"నిన్ను మాటల్లో గెలవలేం గాని పద పద..."

బైక్ స్టార్ట్ చేస్తూ "ఎక్కడికెళ్దాం" అన్నాను.

"నీతో కలిసి తిని చానాళ్ళయ్యింది. ఏ బేకరీలోనైనా కాస్త తిని పార్కులో కాస్సేపు గడిపి వచ్చేద్దాం"

"ఇప్పుడు పార్కుకెళ్ళడం అవసరమా?"

"నీతో పెర్సనల్‌గా మాట్లాడాలి"

ఆమె వంక చూశాను. కనురెప్పలు బరువుగా వాలిపోతూ ఏదో సంకేతమిచ్చాయి.

అయినా నేను తొందరపడదల్చుకోలేదు. సహజతోడి అనుభవం నన్ను మరింత జాగ్రత్తపడేలా చేసింది.

బేకరీలో పేస్ట్రీలు తిని పార్కుకెళ్ళాం.

కేరింతలు కొడుతూ ఆడుకుంటున్న పిల్లల్నీ, ఆనందవిహారం చేస్తున్న యువతీ యువకుల్నీ గతాన్ని నెమరేసుకుంటూ ప్రశాంతంగా వున్న వృద్ధుల్నీ చూసేసరికి ఎంతో ముచ్చటేసింది.

"జనమంతా ఇలా వుండగలిగితే ప్రపంచం ఇంత పచ్చగా వుంటే ఎంత బావుణ్ణో కదా శిరీషా"

"ఆశ మనిషిని జీవింపజేస్తుంది. దురాశ మనిషిని అధఃపాతాళానికి తోసేస్తుంది. మనిషిలోకి దురాశ జాడ్యం ప్రవేశించకుండా చూస్తేచాలు. సమాజం పచ్చగా మారుతుంది. టాల్‌స్టాయ్ కథ- మనిషికి ఎంత భూమి కావాలన్న కథ గుర్తుందా గాంధీ? చీకటి పడేలోగా నువ్వు చుట్టి రాగలిగినంత భూమిని నీకిస్తానంటే దురాశతో ఇంకా ఇంకా దూరం పరుగెట్టి సమయానికి తిరిగి రావాలన్న పట్టుదలతో వస్తూ ప్రాణాలు పోగొట్టుకుంటాడు. కడకతడిక్కావాల్సివచ్చింది ఆరడుగుల నేలే!"

"చాలా గొప్ప కథ. పాఠంగా చెప్పి కంఠోపాఠం చేయించాల్సిన కథ. హిరణ్యకశిపుడు "దిక్కులు గెలిచితినన్నియు, దిక్కెవ్వడురోరి నీకు దేవేంద్రాదులీ, దిక్కుల రాజులు వేరొక, దిక్కెరుగక కొలుతు రితడె దిక్కనినన్నున్" అంటూ విర్రవీగాడు. లోకాన్ని గెలిచావుగాని ఇంద్రియాలనీ మన

ష్నునీ గెలవలేకపోయావంటూ ప్రహ్లాదుడు చెప్పినా వినలేదు. కడకెలాటి చావు వచ్చిందో నీకు తెలుసు"

"బాగా చెప్పావు. మన అభిప్రాయాలు కలిశాయి. ఆశయాలూ కలిశాయి. వాటిని సాధించే మార్గమూ ఒకటే. ఆ కార్యక్రమమూ కలిసే చేస్తున్నాం. పైగా నువ్వంటే నాకు ప్రేమ, ఆరాధన. మనమెందుకు పెళ్ళి చేసుకోకూడదు గాంధీ? "

"చేసుకోవచ్చు. జీవితాంతం నువ్వు నాతోడుగా నీడగా వుండటానికైనా చేసుకోవాలి. కాని ఒక షరతు వుంది. దానికి ఏ ఆడ పిల్లా అంగీకరించదని నా అనుమానం"

"అదేమిటో బయటపెట్టకుండా అనుమానించడం మంచిదికాదు"

"మనం ఎప్పటికీ ఇలా నిస్వార్థంగా పని చెయ్యాలి. పిల్లలకోసం వాళ్ళని అందలం ఎక్కించడంకోసం వారికి ఆస్తులు సమకూర్చి ఇవ్వడంకోసం తాపత్రయపడకూడదు. మన శక్తిని వినియోగించకూడదు. అందుకనే సుందరయ్యగారు పెళ్ళికి ముందే ఫామిలీ ప్లానింగ్ ఆపరేషన్ చేయించుకున్నారట. ఆయన మహనీయుడు. నేనూ ఆ బాటలోనే నడవాలన్నది నా ఆకాంక్ష. అది అంగీకారమైతే..."

"గాంధీ!" గబుక్కున వాటేసుకుని ఏడ్చేసింది శిరీష.

"నువ్వు మనిషివికాదు గాంధీ-దేవుడివి"

"పిచ్చిదానా. మనిషి రాక్షసుడుకాకుండా వుంటే అంతే చాలు. ఇక వెళ్దాం"

"వూ... ఇకనుంచి మనిద్దరం ఒకరమే" నా చేతి చుట్టూ తన చేతిని పెనవేసి నడుస్తూ అంది.

"ఎస్. వుయూర్ ఒన్" ఆమె నుదుట ముద్దిడాను.

పశ్చిమాద్రిన సూర్యుడి మొఖం సిగ్గుతో ఎర్రబడింది.

"అన్నట్టు రాత్రి ఏదో పుస్తకంలో చదివాను శిరీషా. భారతీయుల గురించి స్వామీ చిన్మయానంద చేసిన వ్యాఖ్యానం నాకు బాగా నచ్చింది"

"నాకు చెప్పవూ"

"భ అనగా కాంతి. రతి అనగా మునిగి వుండుట. భారత అనగా వెలుగులో కాంతిలో జ్యోతిలో తన్మయుడై వుండేవాడు. భారతీయులనగా అంధకారాన్ని, అజ్ఞానాన్ని విడిచిపెట్టి కాంతిని, వెలుగుని, జ్ఞానాన్ని స్వీకరించేవారని అర్థం. అట్టి మనుషులుకల దేశం భారతదేశం"

"ఓహ్... చాలా గొప్పగా చెప్పారు. ఎప్పటికైనా సరే ప్రపంచంలో మన సంస్కృతే ఉత్కృష్టమైనదని ప్రపంచం ఒప్పుకుని తీరుతుంది. పాశ్చాత్యదేశాలకి మనదేశమే ఆధ్యాత్మిక వెలుగును చూపి మార్గదర్శకమవుతుంది. మన కుటుంబ వ్యవస్థవైపు అమెరికావాసులు ఆకర్షింపబడటం అందుకు నాందిగా భావించవచ్చు"

కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నాం.

పార్కులో ఒకచోట చీకటిగా వుంది. మేమంతగా పట్టించుకోలేదు. కానింతలో చెట్ల చాటునుంచి నలుగురు దుండగులొచ్చి నామీద దాడిచేశారు.

ఊహించని దెబ్బకి విస్తుబోయి అంతలోనే తేరుకుని ఎదురు తిరిగాను. శిరీష అందర్నీ పిలుస్తూ అరుస్తూనే వారిని కొట్టాలని ప్రయత్నిస్తోంది.

ఇంతలో ఎవరో ఇనుపరాడ్‌తో నా తల మీద కొట్టారు. స్పృహ తప్పింది!

కళ్ళు తెరిచేసరికి ఆసుపత్రి బెడ్ మీదున్నాను.

పక్కనే కన్నీళ్ళతో శిరీషా మిత్రులూ.

"నీకేం కాలేదు కదా? "

తల అడ్డంగా వూపింది "నేనే పాపిష్ఠిదాన్ని. అనవసరంగా నిన్నక్కడికి తీసుకెళ్ళాను"

"ఇటువంటి ఘటనలు ఇంకా ఇంకా జరుగుతాయి. రోజూ వస్తున్న బెదిరింపు కాల్సే అందుకు సాక్ష్యం"





"బెదిరింపులా? మాకు చెప్పలేదేం?" కూమార్ అడిగాడు.

"ప్రతి యాక్షన్‌కీ రియాక్షన్ వుండి తీరుతుందని మనం చదువుకున్నాం కదా. మన వల్ల ఎక్స్‌పోజ్ అయిన వాళ్ళూ నష్టపోయిన వాళ్ళూ చేతులు ముడుచుక్కూర్చోరు కదా. దైహికంగా హింసించాలని చూస్తారు. వీలు కాకపోతే శాల్తీనే గల్లంతు చెయ్యడానికి ప్రయత్నిస్తారు. కానీ ఈ ఉద్యమం ఒక ప్రవాహమనీ దీన్నెవరూ ఆపలేరనీ గ్రహించనివ్వదు వాళ్ళ మూర్ఖత్వం. వాళ్ళకి జనమే జవాబు చెబుతార్లే"

"బయట వందలాది జనం నిన్ను చూడాలని వచ్చారు గాంధీ. నీమీద దాడిచేసిందెవరో తెలిస్తే వాళ్ళని నామరూపాల్లేకుండా చేసేట్టున్నారు" అన్నాడు షాజహాన్.

"నువ్విప్పుడిలా వున్నావూ అంటే దానిక్కారణమూ జనమే" కళ్ళు తుడుచుకుంటూ చెప్పింది శిరీష.

నా నుదురు ముడిపడింది.

"పార్కులో నిన్ను కొట్టేక దుండగులు పారిపోయారు. నేను, మరి కొందరం కలిసి ఆసుపత్రికి చేర్చాం. మెడికో లీగల్ కేసు అనీ పోలీసు రిపోర్టిస్తే తప్ప వైద్యం చెయ్యమన్నారు. పోలీసులకి తెలియజేస్తాం, ఒంటిమీద స్పృహ లేకుండా చావు బతుకుల్లో వున్నావని చెప్పినా సరే వాళ్ళు కదలి రాలేదు. ఈ లోగా వార్త తెలిసి జనం ప్రోగయ్యారు. నీ గురించి ఆందోళన పడుతూ ఆసుపత్రిమీద, సిబ్బంది మీదా దాడికి సిద్ధమయ్యారు. పోలీసులు దిగిరాక తప్పలేదు. ఒక అరగంట ఆలస్యమై వుంటే ఏం జరిగి వుండేదో తలచుకుంటేనే గుండెలు జారిపోతున్నాయి"

"ధర్మో రక్షతి రక్షితః అన్నారు. జనమో రక్షతి రక్షితః అంటాన్నేను"

"ఒక్కసారి బయటికొచ్చి కన్పించు గురూ. నీ గురించి జనం కన్నీళ్ళు పెట్టుకుంటున్నారు" అన్నాడు కుమార్ వచ్చి.

శిరీష సాయంతో ఆసుపత్రి బాల్కనీలో కెళ్ళి చెయ్యి వూపాను. అప్పుడు వేలునీ మధ్య వేలునీ వి ఆకారంలో చూపాను.

హర్షధ్వానాలు చేశారు.

వారి అభిమానాన్ని కళ్ళారా చూస్తోంటే నా కళ్లనుంచి ఆనందబాష్పాలు జలజల రాలిపోసాగాయి.

"నీమీద దాడి చేసింది రామనారాయణ మనుషులు గురూ" చెవిలో చెప్పాడు గోపాల్.



"ఒక ముఖ్యమైన విషయం గురించి చర్చించి నిర్ణయం తీసుకోవాలన్నానుకదా. ఎక్కడికెళ్ళావు శిరీషా" కించిత్తు కోపంగానే ప్రశ్నించాను.

విధినిర్వహణలో బాధ్యతా రాహిత్యాన్ని భరించలేను.

"మీ అమ్మగారు కబురంపేరు"

కదిలిపోయాను. అభిమానపూర్వకంగా చూశాను.

"నువ్వు హాస్పటల్ పాలయ్యావని తెలిసినప్పట్నుంచి నీ కోసం తల్లడిల్లిపోతున్నారు. నిన్ను చూడాలని తపిస్తున్నారు"

"హాస్పటల్‌కి వస్తుందని ఎక్స్‌పెక్ట్ చేశాను"

"రావటానికి గట్టిగా ప్రయత్నించారట. కాని నువ్వెళ్తే నేను చచ్చినంత ఒట్టు అన్నార్ట మీ డాడీ. అందుకని రాలేకపోయానని ఎంతగానో బాధపడ్డారు"

"మమ్మీ సంగతి నాకు తెలుసు. చిన్నప్పట్నుంచి కూడా నేనంటే ప్రత్యేకమైన ఇష్టం. నీకు చెప్పానా? నా చిన్నప్పుడు డాడీ మమ్మీమీద కోప్పడ్డా తిట్టినా వచ్చి నాకు చెప్పి బాధపడేది. నాకేమీ అర్థం కాకపోయినా అమ్మ కన్నీళ్లు తుడిచేవాణ్ణి. ఎంచేతో రాత్రి మమ్మీ నా కలలోకి కూడా వచ్చింది శిరీషా. ఏదో చెబుతోందిగాని నాకేమీ వినబళ్లేదు. ఏదో హెచ్చరిక చేసినట్టుగా అన్పించింది"

"నీకేంగాదు గాంధీ. ఆ తల్లిదీవెన నీకు శ్రీరామరక్ష"

"ఓకే. లెటజ్ స్టార్ట్ అవర్ బిజినెస్... వున్నవాళ్ళందర్నీ రమ్మను..."

వందేమాతరంలో ప్రముఖపాత్ర వహిస్తున్న యువకులంతా వచ్చారు.

ఒక యువకుడు పరుగున వచ్చి, "మీ డాడీకి వ్యతిరేకంగా వచ్చిన ఫిర్యాదుల గురించి అందరికీ తెలిసిందే. ఏసీబీవారి ద్వారా వలపన్నినా దొరకలేదు. ఆదాయాన్ని మించిన ఆస్తులున్నాయని చెప్పి ఆధారసహితంగా ప్రభుత్వానికి తెలియజేసిన సంగతి తెలుసు. ఇప్పుడాయన్ని ప్రభుత్వం సస్పెండ్ చేసింది. దర్యాప్తు పూర్తయ్యాక తగిన చర్య తీసుకుంటారని ఆశిస్తున్నాను"

ఎవరూ ప్రతిస్పందించలేదు.

"ఎందుకలా వున్నారు? మా డాడీ అనా. హే- కమాన్‌యార్. బీహేపీ. ఒక అవినీతి పరుడికి శిక్ష పడిందని సంతోషించండి. ఇక పోతే మనం ఇప్పుడు మరో అస్త్రం ప్రయోగించాలని నా అభిప్రాయం. మీరంతా అంగీకరిస్తే అమలు చేద్దాం"

"నువ్వేం చెప్పినా అది సరైందే అవుతుంది. ఎలాంటి సంకోచమూ లేకుండా చెప్పు చేసేస్తాం" అన్నాడు గోపాల్.

"రామనారాయణ కబ్జా చేసిన ప్రభుత్వ భూముల గురించి, దొంగ పవరాఫ్ అటార్నీలతో అమ్మిన రైతుల పొలాల గురించి, చిట్‌ఫండ్ మోసాల గురించి మనం వివరాలు సేకరించి పత్రికలకి రిలీజ్ చేశాం. అది చూసి రెచ్చిపోయి నామీద దాడి చేయించాడు. ఆయన కూతుర్ని మా అన్నయ్యకిచ్చి పెళ్లిచేసి సులోచన కన్యాయం చెయ్యాలని వచ్చేవారం ముహూర్తం పెట్టారు. దానికి మా డాడీ వత్తాసు కూడా వుంది. నామీద దాడిని క్షమించినా దీన్ని సహించకూడదు. అందుకే అవినీతికి ప్రతిరూపాలుగా నిలిచిన రామనారాయణకీ మా డాడీకి సాంఘిక బహిష్కరణకి పిలుపునిద్దాం. మన ఈ అస్త్రాన్ని మొదట మా ఇంటిమీదే ప్రయోగిద్దాం"

"ఇంతకంటే బడానేరస్తులూ కోట్లు కాజేసిన లంచగొండులూ వున్నారుకదా" చటుక్కున అంది శిరీష.

"వాళ్ళకిది గుణపాఠం అవుతుంది"

"మరోసారి ఆలోచిస్తే బావుంటుందేమో..." కుమార్ అన్నాడు.

"మీరంతా నన్ను బలపరుస్తామని ముందుగానే మాట ఇచ్చారు"

"మేం నీ వెన్నంటి వున్నాం. నీ వెంటే నడుస్తాం"

★ ★ ★

మా ఇంటిదగ్గరికెళ్ళాం.

ఒకళ్ళం ఇద్దరం కాదు సుమారు రెండొందల మందిమి.

ధర్మయుద్ధాని కొచ్చినట్టుగా కదిలివచ్చాం. పరిసరాల్లోని జనమేకాదు మొత్తం కాలనీలోని జనమంతా గుమిగూడారు. ఏమిటేమిటన్నారు. ఏం జరిగింది ఏం జరగబోతోందని ప్రశ్నించారు.

హేండ్‌మైక్ అందుకున్నాను.

మా డాడీ కథ చెప్పాను. ఆయన అవి




నీతి లీలలు చెప్పాను. ఆయనకి లంచాలిచ్చిన వాళ్ళచేత చెప్పించాను. ఆయన కోరినంత ఇవ్వనివాళ్ళని ఎలా హింస పెట్టిందీ వివరించాను. అక్రమంగా సంపాదించిన ఆస్తుల గురించి చెప్పాను. ప్రభుత్వం సస్పెండ్ చేసి, డిపార్ట్‌మెంటల్ ఎంక్వైరీకి ఆదేశించిన విషయమూ బయటపెట్టాను.

"అలాంటి అవినీతిపరుడ్ని లంచగొండిని గౌరవిస్తారా? " అని సూటిగా ప్రశ్నించాను.

"లేదులేదు" అన్నారంతా ముక్తకంఠంతో.

"అలాంటివాళ్ళు సమాజపు వృక్షానికి పట్టిన చీడపురుగులు. వాళ్ళని పురుగుల్లా చూద్దాం. హీనంగా చూద్దాం. గేలిచేద్దాం. అవమానిద్దాం. మాటల్తో చూపుల్తో చిత్రవధ చేద్దాం. నువ్వు దోషివి, ద్రోహివి అంటూ వేలెత్తి చూపుదాం. ఆయన్ని సపోర్టు చేసినవారిని సహదొంగలుగా పరిగణిద్దాం. ఆయన మారేవరకూ తన తప్పుని ఒప్పుకునేవరకూ సాంఘిక బహిష్కరణకి గురిచేద్దాం. ఇది చూసి, దీని గురించి విని పరువు ప్రతిష్టల కోసం పాకులాడేవారెవరైనా మంచిగా మనిషిగా మారతారని మా వందేమాతరం నమ్మకం. మీరేమంటారు? "

"మాకు నమ్మకముంది"

"అయితే ఇంటింటికి వెళ్లి ఈయన అవినీతి చరిత్ర గురించి చెప్పండి. నవ్వులపాలు చెయ్యండి"

పొలోమంటూ కదిలారు జనం.

డాడీ ఇంట్లోనే వున్నారని తెలుసు. నా మాటలు విన్పిస్తాయని తెలుసు.

ఆయనెంత మథనపడుతుంటారో, కోపావేశంతో వూగిపోతుంటారో వూహించగలను. అమ్మ సత్యబోధ చేస్తుందని చెప్పగలను. నామీది కోపాన్నీ కసినీ ఆమెమీద ప్రయోగిస్తారనీ ఊహించగలను.

కనీసం ఇప్పుడైనా ఆయన మారితే ఎంతో బావుణ్ణు.

లేకపోతే రేపు జనానికి ముఖం చూపించగల ధైర్యం వుండదుగాక వుండదు.

ప్రచారం వూపందుకుంది. ఇంటింటికి చెప్పడమే కాదు దారినపోయేవాళ్ళని ఆపి మరీ చెప్పారు. పిల్లలు బొమ్మలు గీసి రకరకాల వ్యాఖ్యానాలు జోడించారు. ఒకరు ఎక్కడ్నుంచో గాడిదని తీసుకొచ్చి "నేను అవినీతిపరుణ్ణి. అడ్డగాడిదని" అని రాసిన తెల్లగుడ్డ కట్టి వూరేగించారు. ఎవరో అత్యుత్సాహంతో డప్పులు తెచ్చి వాయించి డాన్సే చేశారు. కొందరు బయటికొచ్చి నీ మొహం చూపరా అంటూ అరిచారు. నవ్వారు.

ఈ వినూత్న శిక్ష గురించి తెలిసిన మీడియా వారంతా విచ్చేశారు. ఫొటోల్లూ, వీడియో కెమేరాలూ తళుక్కుమన్నాయి.

మేమెవరం ఊహించని రీతిలో పోలీసు బలగం వచ్చిపడింది.

మా ఇంటిచుట్టూ రక్షణ వలయంగా ఏర్పడ్డారు.

"మీరంతా తక్షణం పారిపోండి. లేకపోతే లాఠీఛార్జీ చేయాల్సివుంటుంది" ఏసిపి హెచ్చరించాడు. ఎవరూ కదల్లేదు.

నేను ముందుకెళ్ళాను. "మేం అహింసా పద్ధతుల్లో నిరసనని, ఆక్షేపణనీ తెలియజేస్తున్నాం. దయచేసి జనాన్ని రెచ్చగొట్టకండి..."

"కన్నతండ్రిని జనంచేత తిట్టించడానికి సిగ్గులేదుట్రా. నేనే నీ బాబునైవుంటే కాల్చి పారేద్దున్రా"

"హద్దుమీరి మాట్లాడుతున్నారు"

"ఏంటిబే. నువ్వు పెద్ద హీరోననుకుంటున్నావా? " నా కాలర్ పట్టుకుని గుంజాడు.

జనం పిడికిళ్ళు బిగిసి పైకి లేచాయి.

"మీరంతా వెళ్తారా లాఠీఛార్జీ చెయ్యనా? " హుంకరించాడు.

అంతా ఎక్కడివారక్కడ నేలమీద చతికిలబడిపోయారు.

వారి సమయస్ఫూర్తికి అభినందిస్తూ చూశాను.

"ఊఁ... వీడేమైనా పెద్ద గాంధీ అనుకున్నారా? " అరుస్తున్నట్టుగా ప్రశ్నించాడు.

"గాంధీయే" ఏకకంఠంతో జవాబిచ్చారు.

"కొంపతీసి నీ పేరు గాంధీ ఏంట్రా?"

అవునంటూ తలాడించాను.

"చచ్చే చావొచ్చిపడింది కదురా నాకూ. నిన్నేమైనా చేస్తే నన్ను గాడ్సే అంటారేమో ఖర్మ!" టోపీతీసి గుండు గోక్కున్నాడు.

ఏసీపీ అవస్థ చూసేసరికి నవ్వొచ్చింది.

"నవ్వుతావేంటి. పిల్లికి చెలగాటం, ఎలక్కి ప్రాణసంకటం అంటే ఇదే. ఏమైనా చేస్తే రేపు నన్ను విలన్ని చేస్తాయి పత్రికలు. ఏమీ చెయ్యకపోతే పైవాళ్ళు తిట్టిపోస్తారు. ఎలా చావాలి చెప్పు? కడాఖరికి మీరూ మీరూ బాగానే వుంటారు. మధ్యన నన్ను గిన్నీపిగ్‌ని చేస్తారు. ఈ చిక్కుముడి ఎలా విప్పాలిరా"

"మా డాడీని బయటికొచ్చి లెంపలేసుకో మనండి. అక్రమంగా ఆర్జించిన ఆస్తిని అనాధశరణాలయానికి రాసిస్తానని చెప్పమనండి. సులోచనని కోడలిగా స్వీకరిస్తానని చెప్పమనండి చాలు. తిట్టిన నోటితో ఆయనని అభినందిస్తామని చెప్పండి"

"ఇదేదో బాగానే వున్నట్టుంది. ఆయన వింటాడా అని. అయినా చెప్పిచూస్తే పోలే. తన గురించి గాకపోయినా నా గురించైనా వస్తే బావుణ్ణు" అనుకుంటూ.

ఏసిపి మా ఇంట్లోకెళ్ళాడు.

అంతా ఉత్కంఠతో ఎదురుచూస్తూ కూర్చున్నాం.

మా డిమాండ్స్‌ని డాడీ మన్నిస్తారా?

మన్నిస్తే సుఖాంతమే.

త్రోసిరాజంటే? ఏమిటి చెయ్యడం?

నిమిషాలు దొర్లుతున్నాయి.

"లోపలికెళ్ళినవాడు లోపలే వుండిపోయా డేవిట్రా" ఒకరన్నారు.

"ఇతగాడ్నీ ఆయన కొనేశాడేమో" ఎవరో వ్యాఖ్యానించారు.

"అదీ పాయింటే. పచ్చనోటు కళ్ళజూస్తే చాలామందికి కళ్లు మూసుకుపోతాయి"

ఇంకెవరో అన్న మాటలకి నవ్వేరంతా.

లోపలేం జరుగుతూండి వుండచ్చోనని తీవ్రంగా ఆలోచిస్తూండిపోయాను.

పెదవి కొరుక్కుంటూ సీరియస్‌గా వుండే సరికి శిరీష కేమన్పించిందో ఏమో "నేను లోపలికెళ్ళి కనుక్కురానా" అనడిగింది.

"వద్దొద్దు. మన పట్టు సడలనివ్వొద్దు"

"నేవెళ్తే పలచనెందుకవుతుంది?"

"మా మమ్మీ నీతో మాట్లాడొచ్చు అర్థం చవచ్చు. మనం వజ్రమనుష్యులం గాక పోతే అవినీతిని ఎదుర్కోలేం"

తలపంకించి వూరుకుండిపోయింది.

మరి నాలుగు నిమిషాలకి ఏసీపీ బయటికొచ్చాడు.

"ఒప్పుకున్నారా?"

"ఇలా చెప్పగానే అలా ఒప్పేసుకోవడానికి అవేమైనా చిన్న చిన్న సంగతులా ఏంటి, చాలా పెద్ద విషయాలు. బాగా ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాల్సిన సంగతులు. రేపటిదాకా టైము కావాలన్నారు. సరేనని మీ తరఫున చెప్పేసి వచ్చాను"

ఏసీపీ వంక సూటిగా చూశాను.

తడబడ్డాడు.

వెళ్ళినప్పటికి, తిరిగి వచ్చినప్పటికి ఆయనలో ఏదో మార్పు గోచరించింది.

ఎత్తుగా వున్న అతడి పాంటుజేబుమీద పడింది నా దృష్టి.

క్షణంలో సగం సేపట్లో అది గమనించేశాడతడు.

"వెళ్ళండెళ్లండి. రేపు తేల్చుకుందాం" అంటూ వెళ్ళి జీపు ఎక్కేశాడు.

మరుక్షణం జీపు పరుగందుకుంది.

"ఇప్పుడేం చేద్దాం?" శిరీష అడిగింది.

"రేపటిదాకా వెయిట్‌చేద్దాం. మార్పు వస్తుందేమో చూద్దాం"

★ ★ ★

పడుకున్నానన్నమాటేగాని నిద్ర రావటం లేదు.

డాడీ గురించిన ఆలోచనలు నిద్రని తరిమేశాయనడం సబబు.





డాడీ ఏం చేస్తున్నారో! మా ఉద్యమానికి ఎలా ప్రతిస్పందిస్తున్నారో!

ఒకపక్క సస్పెన్షన్. మరోపక్క సాంఘిక బహిష్కరణ.

అడకత్తెరలో పోకలా వుందాయన పరిస్థితి.

తన గురించి ఊరూ వాడా, ఇంటా బయటా అందరికీ తెలిసిపోయింది గనుక ఇప్పుడైనా తన తప్పు తెలుసుకుంటే బావుణ్ణు. పశ్చాత్తాపాగ్నిలో కాలి పరిశుద్ధుడైతే బావుణ్ణు!

కానీ డాడీ మనస్తత్వం చిత్రమైంది. కోపంతో రెచ్చిపోతారు, పగబట్టి తిరగబడతారు తప్ప స్థిమితంగా ఆలోచించరు. తనది తప్పని ఒప్పుకోరు.

తనమాటే చెల్లాలి. తనదే పైచేయి కావాలి.

అహంకారం, దర్పం, ఆధిక్యతాభావం ఆయన అణువణువునా నిండివున్నాయి.

జరిగిందానికి కించపడి త్రాచులా తోక మీద లేచి కాటు వెయ్యడానికి ప్రయత్నించినా ఆశ్చర్యపోనక్కర్లేదు.

తలుపు చప్పుడయ్యింది.

చటుక్కున లేచి కూర్చున్నాను.

దబదబ బాదారు.

అర్ధరాత్రివేళ నా కోసం ఎవరు వచ్చివుంటారు? ఎందుకొచ్చివుంటారు?

మళ్ళీ మళ్ళీ బాదారు. తలుపులు విరగ్గొట్టేసేలా వున్నారనిపించి గబుక్కునెళ్ళి తలుపు తీశాను.

ఎస్సై, ఇద్దరు కానిస్టేబుళ్లూ లోపలికి నన్ను తోసుకుంటూ వచ్చారు.

"క్యాబే డోర్ తియ్యడానికి ఇంత లేటా? లోపలేం జేస్తున్నావు? బాంబులు తయారు చేస్తున్నావా ఏంది? జర వెదకండి"

ఎస్సై మాటలకి గదంతా వెదకసాగారు కానిస్టేబుళ్ళు.

"హింసమీద నాకు నమ్మకంలేదు"

"ఒహో... గాంధీ మహాత్ముడివా"

"కాదు. గాంధీని మాత్రమే"

"యాదొచ్చింది. నీ పేరు గాంధీకదూ. నీకేవయిందిరా. బిర్యాని తిని ఇంట్లో చల్లగా పడుకోక పెద్దోళ్లని పరేశాన్ చేస్తున్నావేందిరా"

"నేవెళ్ళింది అవినీతిపరుల జోలికి మాత్రమే"

"గట్లనా. ఇయాల, రేపు నీతీ గీతీ అంటూ మడిగట్టుకున్నోడ్ని ఒక్కడ్ని చూపరా సాగిలపడి మొక్కుతాను" ఎకసెక్కంగా నవ్వాడు.

పొట్ట కదిలేలా శృతికలిపారు కానిస్టేబుళ్ళు.

"రంగుటద్దాల కళ్లజోడు తీసి లోకాన్ని చూడండి. ఎన్ని కార్యాలయాల్లో ఎందరు నిజాయితీపరులున్నారో కనబడుతుంది"

"వాళ్ళు బతకడం చేతకానివాళ్ళు" అని ఒకరంటే, "పిరికివాళ్ళు" అన్నాడు రెండో కానిస్టేబులు.

"పైసలిచ్చేటోళ్ళు లేక ముత్తయిదు కబుర్లు చెబుతారు. వాళ్ళ చేతుల్లో పైసలు పెట్టి చూడు చిటికెలో మాయం చెయ్యకపోతే నన్ను నోటికొచ్చినట్టు తిట్టు పడతాను"

"మీ అభిప్రాయంతో నేను ఏకీభవించను. సమాజం మీరు చెప్పినంతగా కుళ్ళిపోలేదు. జనంలో నీతీ నిజాయితీ కొడిగట్టిపోలేదు"

"నీతో నాకేంటి గట్లనే అనుకోపో. నీ సంగజ్జెప్పు. ఈ వందేమాతరాలూ, ధర్నాలూ బంద్ చేస్తవా లేదా? "

"చెయ్యను"

"జర ఆలోచించి చెప్పుమరి. పోలీసోళ్లకి పుల్‌పవర్లు, పులిపవర్లున్నాయి" గర్వంగా నవ్వాడు.

"మీరు నన్నేమీ చెయ్యలేరు"

"విన్నారేంట్రా. మనం ఏవీ చెయ్యలేవంట" గట్టిగా నవ్వి అన్నాడు.

"ఒరేబేటా. బాంబులు తెచ్చి నీరూంలో

పెట్టి ఫాక్షనిస్టు వస్నెప్పి బొక్కలో తోసెయ్యగలం. సిటీరోడ్లమీద పరుగెట్టించి, కాల్చి చంపి నక్సలైటనగలం..."

"మా అమ్మ నాకు ఉగ్గుపాలు పోసింది గాని పిరికిపాలు పొయ్యలేదు"

"గట్లనా... నడు... ఛలో..."

"ఎక్కడికి? "

"ఇన్‌స్పెక్టర్ సార్ పిలుస్తున్నాడు. ఎందుకో ఏంటో ఆయనే చెబుతాడు"

"రేపొచ్చి కలుస్తాను"

"తీస్కపోడానికొస్తే రేపొస్తనంట వేంట్రా? "

"అరెస్టువారెంటు వుందా? "

"కానూన్ మాట్లాడుతున్నావేందిరా" నా డొక్కలో పొడిచాడు.

సుళ్ళు తిరిగి పోతూనే గర్జించాను. "ఇన్‌స్పెక్టర్! ఏవిటీ దౌర్జన్యం? "

"నోర్మూయ్యరా- లాక్కెళ్ళి జీపెక్కించండి..."

నా రెక్కలు విరిచి పట్టుకుని లాక్కెళ్ళారు. కనీసం చొక్కా తొడుక్కునే అవకాశం కూడా ఇవ్వలేదు.

"మీరింత రూడ్‌గా ప్రవర్తించడం ఏంబాగోలేదు. నా ప్రాథమిక హక్కుల్ని కాలరాస్తున్నారు. నేను ఒంటరివాడ్నని అపోహపడుతున్నట్టున్నారు. రేపటికి నేనేమిటో తెలుస్తుంది. ఇంతకి రెట్టింపు అనుభవించాల్సి వస్తుంది" జీపు కదుల్తోంటే అన్నాను.

"దానికంటే ముందు మేమేంటో తెలుసుకుందువుగాన్లే"

పోలీస్‌స్టేషన్‌కి తీసుకెళ్ళారు.

నా మాటలు విన్పించుకోకుండా రెండో అంతస్థులోకి తీసుకెళ్ళారు. లాకప్ సెల్ పక్కనే వున్న చిన్నరూంలో కూర్చోమన్నారు.

"సిఐని కలవాలి" దృఢస్వరంతో అన్నాను.

"నువ్వు కలవాలనగానే కలుసుకోడానికి ఆయనకి పనీపాటా లేవనుకున్నావా? ఆయనొచ్చినప్పుడు పిలుస్తాన్లే కూర్చో" కసురుకున్నట్టుగా అన్నాడు హెడ్‌కానిస్టేబుల్.

"నన్నిప్పుడెందుకు తీసుకొచ్చారు? నేను చేసిన నేరమేమిటి? "

"నాకు తెలీదు"

"ఇదన్యాయం. పర్మిషనిస్తే నా ఫ్రెండ్‌కో, ప్లీడర్‌కో ఫోన్ చేసుకుంటాను"

"ఇది నీ బాబుగాడి ఇల్లు కాదు పోలీస్ స్టేషన్" అంటూ తలుపులేసేసి వెళ్ళిపోయాడు.

నిస్సహాయంగా మిగిలిపోయాను.

ఆ గదిలో ఒక చెక్కబల్ల తప్ప ఏమీలేవు.

తెల్లవారేదాకా తప్పదన్పించి దానిమీద చతికిలబడ్డాను.

అతికష్టంమీద తెల్లవారింది. బాత్‌రూం కెళ్లాను. భరించరాని దుర్గంధం. ఎప్పుడో తిన్నది కూడా వాంతి అయిపోయింది.

"నన్నెందుకు తీసుకొచ్చారు? " తిన్నగా రైటర్ దగ్గరికెళ్ళి అడిగాను.

"తీసుకొచ్చిన వాళ్ళనడుగు" రెక్లెస్‌గా సమాధానం ఇచ్చాడు.

"సిఐ ఎప్పుడొస్తారు? "

"ఎప్పుడైనా రావొచ్చు రాకపోనూవచ్చు"

"సబ్ ఇన్‌స్పెక్టర్? "

"పదింటికొస్తాడు"

"నువ్విక్కడికొచ్చావేంటి. ఆఫీసరు చూశాడంటే మధ్యన మాకు చావొచ్చిపడుతుంది. వెళ్ళెళ్లు" గది చూపిస్తూ అన్నాడో కానిస్టేబులు.

నా వెనుకే వచ్చి "పైసలున్నయా చాయ్ తెప్పిస్తాను" అన్నాడు.

"లుంగీ బనీన్లతో తీసుకొచ్చారుగా"

సానుభూతిగా చూశాడు. గదిలోకెళ్ళి బెంచీమీద కూలబడ్డాను.

నన్నెందుకు స్టేషన్లో నిర్బంధించినట్టు?

నేనెలాటి నేరమూ చెయ్యలేదు. ఆ సంగతి అరెస్టు చేసిన వారికి తెలుసు. అందుకే యఫ్ఐఆర్ రాయలేదు. అరెస్టు వారంటు తయారుచేయించనూ లేదు.





చూస్తోంటే నన్ను బెదిరించడానికో, భయపెట్టడానికో తీసుకొచ్చినట్టున్నారు.

అదే నిజమైతే వారినందుకు పురిగొల్పిందెవరు?

డాడీయా?

ఛా... ఆయనైవుండరు. కన్నకొడుకుమీద కత్తి కట్టేంతగా దిగజారతారనుకోను.

మరి?

మేం పట్టించిన అవినీతి అధికారుల్లో ఎవరైనానా? లేక తమ గురించి మా సంస్థకి తెలిసిందని ముందుజాగ్రత్తగా కొందరు హెచ్చరించదలిచారా?

అయితే వాళ్ళెవరైవుండొచ్చు?

ఆలోచన తెగలేదు. శిరీషావాళ్ళూ వస్తే బావుణ్ణు. వాళ్ళకి నేనిక్కడున్నట్టు తెలిసిందో లేదోమరి! నా ఆచూకీ తెలీక ఎంతగా తల్లడిల్లిపోతున్నారో ఏమో!

ఎన్నోరకాల స్వేచ్ఛల్ని హామీ ఇచ్చింది రాజ్యాంగం. అయినా ఆచరణలో వాటిని వారిస్తూనే వున్నారు. రక్షించాల్సిన వారే అతిక్రమిస్తున్నారు. వీరిని, ఈ వ్యవస్థని సంస్కరించడానికి ఎంత కాలం పడుతుందో!

చాయ్‌కుర్రాడొచ్చి టీ గ్లాసు అందివ్వబోయాడు.

"ఎవరు పంపారు?"

హెడ్‌కానిస్టేబుల్ని చూపించాడు.

"వద్దు"

"మంచిగనే వుందిలే తాగు. సాబ్ ఎప్పుడొస్తడో ఏమో" అన్నాడు హెచ్.సి.

"నన్ను అకారణంగా అరెస్టు చేశారు. అక్రమంగా నిర్బంధించారు. నన్ను విడిచిపెట్టే వరకూ పచ్చిగంగ ముట్టను"

బొజ్జ అదిరేలా నవ్వాడు. "గట్లనా అయితే కూచో"

పదయ్యింది. పన్నెండయింది. నాలుగయింది.

సిఐ రాలేదు. ఎస్‌ఐ వచ్చాడుగాని నన్ను కలుసుకోనివ్వలేదు.

ఆకలి నమిలేస్తోంది. మరోపక్క స్నానమైనా చెయ్యలేదేమో ఒళ్లంతా చీదరగా వుంది.

అడ్డొచ్చినవాళ్ళందర్నీ తోసేస్తూ ఈ బందిఖానా నుంచి బయట పడాలన్నంత ఆవేశం వచ్చింది. కాని వెంటనే నిగ్రహించుకున్నాను.

ఎట్టి పరిస్థితుల్లోనూ సహనం కోల్పోకూడదు.

నాకిది పరీక్షా సమయం.

ఎలాంటి క్లిష్టపరిస్థితుల్లోనూ నేనూ నా సిద్ధాంతాలూ ఓడిపోకూడదుగాక ఓడిపోకూడదు.

"సిఐ వచ్చిండు" కానిస్టేబులొచ్చి మెల్లగా చెప్పాడు.

వరండాలో కెళ్ళాను.

సిఐ, ఆయన వెంట అన్నయ్యా, రామనారాయణా వచ్చారు.

నన్ను విడిపించడానికొచ్చారనుకున్నాను. కానీ వచ్చి పదినిమిషాలైనా నన్ను పిలవలేదు. నా దగ్గరకి రానూలేదు.

సిఐతో కరచాలనం చేసి వెళ్ళిపోయారు.

నా ఈ నిర్బంధం వెనుక ఎవరి హస్తముందో అర్థమయింది.

"నన్ను 'మూసేస్తే' కనీసం కొన్ని రోజుల పాటు 'మూసేస్తే' డాడీ అవినీతి ఆరోపణల్ని కడిగేసుకుని బయటపడొచ్చు రామనారాయణ కూతురితో అన్నయ్య పెళ్ళి నిర్విఘ్నంగా జరిపించొచ్చు

అందుకని ఈ 'ముగ్గు' పెట్టారన్నమాట.

వారి ఎత్తుని చిత్తు చెయ్యడం ఎలాగా అని ఆలోచిస్తోంటే సిఐ నుంచి పిలుపొచ్చింది.

"నువ్వేనా గాంధీ అంటే. ఇంకా ఎలాగో వుంటావనుకున్నానే. మామూలు మనిషిలానే వున్నావు" అదేదో జోక్ అయినట్టు నవ్వేడు సిఐ.

"నన్నెందుకు అరెస్టు చేశారో తెలుసుకోవచ్చా సార్?"

"నిన్ను మేం అరెస్టు చెయ్యలేదే. ప్రశ్నిం చడానికి తీసుకొచ్చామంతే. మా పనయ్యాక వదిలేస్తాం"

"ఏమడుగుతారో అడగండి. నాకు చాలా పనులున్నాయి. నేను కన్పించలేదని మా వాళ్ళూ కంగారుపడుతుంటారు"

"రామనారాయణగార్తోగాని ఆయన సంబంధీకులతోగాని పెట్టుకోనని రాసియ్యి అప్పుడే వదిలేస్తాను"

"అది నా కంఠంలో ప్రాణం వుండగా జరగదు"

"ఏంట్రా నీ బోడిగొప్ప! పెద్ద హీరోనను కుంటున్నావా ఫోజులు కొడుతున్నావు? నేను తలుచుకుంటే నిన్నేమైనా చెయ్యగ లను తెలుసా? "

"నేను నిర్దోషిని. నన్నేమీ చెయ్యలేరు..."

"సత్యహరిశ్చంద్రుడి తమ్ముడివా..." అంటూ ఆవేశంగా లేవబోయి తమాయించు కున్నాడు.

"వీడ్ని తీసుకుపోండి. తిక్క కుదిరేవరకూ అక్కడే వుండనీండి. జాగ్రత్త. విషయం బయటికి పొక్కకూడదు..."

మళ్ళీ గదిలో బల్లమీద చతికిలబడ్డాను.

రాత్రి తొమ్మిదిగంటలవేళ ఓ కానిస్టే బులు ఓ పొట్లం తెచ్చి "తిను" అన్నాడు.

"ఏంటది? "

"బిర్యానీ"

"వద్దు"

"మంచిదే. ఏం కలపలేదు. నేను రుచి చూశాగా"

"వద్దు"

"ఎవడో సెల్‌లో వున్నవాడి కోసం తెస్తే నీ కోసం ఇంకోటి తెప్పించాను. పొద్దు ట్నుంచి ఏం తినలేదు. తినుతిను"

"థాంక్యూ. నన్నిక్కడ్నుంచి పంపేవరకూ నేనేమీ తిననని చెప్పానుగా"

"నీ ఖర్మ"

అతడెళ్ళి చెప్పాడు కాబోలు మరికాస్సేప టికి యస్సై వచ్చాడు. వస్తూనే "ఏంటి ఏం తినటంలేదంట. సత్యాగ్రహం చేస్తున్నావా? " అన్నాడు దూకుడుగా.

"నన్నెందుకు అరెస్టు చేశారు? "

"నువ్వున్నది నీ ఇంట్లో కాదు పోలీస్‌స్టే షన్లో. ఇక్కడ ప్రశ్నించే అధికారం మాకొక్క రికే వుంది. సమ్జే"

"మీరు రక్షకభటులనుకుంటున్నాను"

"తెలివిగానే మాట్లాడుతున్నావు. మేం రక్షకభటులమే. ఎవర్ని రక్షించడానికున్నా మన్నది నీకు తెలీదు. మా ఆఫీసరుదంతా లాగుడు పీకుడు వ్యవహారం. థర్డ్‌డిగ్రీ మెథడ్స్ ఉపయోగించొద్దంటాడు. లేకపోతే ఈపాటికి నువ్వేంటి నీ తల్లోని జేజమ్మ కూడా దిగివచ్చేది..."

"మీ శాఖలో కొందరైనా నీతిమంతులు న్నందుకు సంతోషంగా వుంది"

"నువ్వూ అలా వుండొచ్చుగా. గాంధీగారి మూడు కోతుల్లా కళ్ళూ, చెవులూ, నోరూ మూసుకో. రామనారాయణావాళ్ళూ ఏంచేస్తే నీకూ నాకూ ఎందుకు? "

"అవినీతినీ అన్యాయాన్నీ సహించం. రామనారాయణే కాదు. ఎవరూ నన్నేమీ చెయ్యలేరు"

"నీ అంత మొండి వెధవని ఎక్కడా చూళ్ళేదు. కన్నతండ్రిమీదే ధ్వజంఎత్తి అల్ల రిచేసివాడివి కదూ. నీలాంటివాళ్ళు ఎక్కువ కాలం మనలేరు జాగ్రత్త"

అతడెళ్ళిపోయాడు.

గది, చెక్కబల్ల, మసక వెలుతురు, బూట్ల శబ్దాలు, దోమల సంగీతం, ఆకలి, నీరసం, నిద్రరానితనం.

ముడుచుకుని పడుకున్నానన్నమాటేగాని ఆలోచనలు నన్ను తిన్నగా వుండనివ్వట్లేదు.

రామనారాయణ నా మీదెందుకు కక్ష కట్టినట్టు? ఆయన కూతుర్తో అన్నయ్య పెళ్ళి జరగనివ్వనన్నాననా? లేక డాడీకి వ్యతిరేకంగా ఉద్యమించేసరికి దాన్ని చల్లా ర్చడానికి రంగంలోకి దిగాడా? లేక డాడీయే ఆయన్ని పురిగొల్పి...




పరిపరివిధాల ఆలోచిస్తూనే నిద్రలోకి జారుకున్నాను.

ఎవరివో మాటలు గట్టిగా విన్పించేసరికి మెలకువ వచ్చింది.

సంభాషణని బట్టి నా గురించి ఒక ప్లీడరు ప్రశ్నిస్తున్నట్టు అర్థమైంది. లేచి వెళ్ళి తలుపు తీశాను. చుట్టూ కలియజూస్తోన్న శిరీష, షాజహాన్ నన్ను చూసి గబగబా సమీపించారు. ఒక కానిస్టేబులు అడ్డగించినా ఆగలేదు.

"ఎలా వున్నావు? నిన్నేమీ చెయ్యలేదు కదా? " కళ్ళనీళ్లు పెట్టుకుంది శిరీష.

"సినిమాల్లో చూపించినంత ఘోరంగా లేదులే వీళ్ళ ప్రవర్తన" చిన్నగా నవ్వాను.

"నువ్వు వీళ్ళకి సర్టిఫికెట్ ఇస్తున్నావా? బాగుంది. నీ ఆచూకి తెలీక మేం ఎంత ఆందోళన పడుతున్నామో నీకు తెలుసా? ఏ స్టేషన్లో అడిగినా మాకు తెలీదు. మాకు తెలీదనేవాళ్ళే. అవునూ మీ డాడీ నీమీద కేసు పెట్టారా? "

"ఎవరూ పెట్టలేదు. వరస చూస్తోంటే బెదిరించడానికి తీసుకొచ్చినట్టుంది..."

ఇంతలో హెచ్‌సి వచ్చి శిరీషావాళ్ళని తీసుకెళ్లిపోయాడు.

"మేం వచ్చేశాంకదా. ధైర్యంగా వుండు" అన్నాడు వెళ్తూ షాజహాన్.

పోలీసు అధికారుల్తో మాట్లాడి వెళ్ళిపోయారంతా. వెళ్తూ వెళ్తూ మళ్లీ వస్తామన్నట్టు సైగ చేసింది శిరీష.

"ఏమైంది" ఒక పి.సి. హెచ్.సి.ని మెల్లగా అడిగాడు.

"వదలమనేసరికి హైకోర్టులో హెబియస్ కార్పస్ పిటీషన్ వేస్తానని వెళ్ళారు"

"మనల్ని తప్పు బడతారేమో"

"ఇవన్నీ మామూలే. హైకోర్టునుంచి మెసేజ్ వచ్చిందనుకో అంత క్రితమే అరెస్టు చేసినట్టు రాసేస్తాం" చిత్రంగా నవ్వాడు.

వీడేమీ తినకుండా కూర్చున్నాడుకదా. కొంపతీసి వీడికేమైనా అయితే మధ్యన మనల్ని సస్పెండ్ చేస్తారు"

"అందుకనే ఆఫీసరు భయపడుతున్నాడు. పత్రికలకెక్కితే అప్రతిష్ట పాలవ్వాలని ఆయన భయం"

"వదిలిపెట్టేస్తే మంచిది కదా"

"రామనాయణకి పెద్ద బేకింగ్ వుంది. రియల్ ఎస్టేట్ బిజినెస్ వాళ్ళంతా ఏకమైనా అవుతారు"

వారి సంభాషణ విని నవ్వుకున్నాను.

మరి గంటకి వాతావరణం హఠాత్తుగా మారిపోయింది.

స్టేషన్లో హడావిడి తిష్టవేసింది. టీవీ పత్రికా విలేఖర్లు చుట్టుముట్టేశారు. నన్ను గదిలో వుంచి బయట తాళం వేసేశారు.

ప్రశ్నలు, బుకాయింపులు, ఫొటోలు గందరగోళం.

స్టేషన్ బయట పోగై ఉత్కంఠగా చూస్తున్న జనం.

ఊహించని పరిణామానికి పోలీసు అధికార్లు గంగవెర్రులెత్తిపోయారు. ఫోన్లూ రహస్యచర్చలూ అయ్యాక విలేఖర్లందర్నీ తరిమేశాక నన్ను స్టేషన్ వెనుకనుంచి రహస్యంగా తీసుకెళ్లారు. వ్యాన్లో ఊరవతలకి తీసుకెళ్లి వదిలి వెళ్ళిపోయారు.

వందేమాతరం ఆఫీసులో పత్రికా విలేఖర్లకి జరిగిందంతా వివరిస్తోంటే కరుణానందం హడావిడిగా వచ్చి "మీ నాన్నని ఉద్యోగంనుంచి తొలగించారు. క్రిమినల్ కేసుపెట్టాలని నిర్ణయించుకున్నారట" అని చెప్పాడు.

★ ★ ★

అమ్మ వచ్చింది. పాతికలంఖణాలు చేసిందాన్లా వుంది.

"మమ్మీ"

"ఎలా వున్నావురా. పోలీసులు నిన్నేమీ చెయ్యలేదుకదా" ఒళ్ళంతా తడిమిచూస్తూ అశ్రునయనాలతో అడిగింది.

"నా ఒంటిమీద చెయ్యి వెయ్యలేదుకాని

డాడీ ఎలా వున్నారు మమ్మీ"

"ఇంకెలా వుంటారు? నిప్పులు కక్కుతున్నారు. అగ్నికి గాలితోడైనట్టు ఆనంద్ తోడయ్యాడు. ప్రతిదాన్ని ఎగదోసి ఏదేదో చేసేద్దామంటున్నాడు. ఆ రామనారాయణ వత్తాసు చూసుకుని మరీ పేట్రేగిపోతున్నాడనుకో"

"డాడీని అప్రూవర్‌గా మారిపొమ్మని చెప్పు మమ్మీ. ఆలస్యం చేస్తే అన్నయ్య కూడా కొన్ని కేసుల్లో ఇరుక్కుపోతాడు"

"నా మాట ఎన్నడైనా వింటేకదా అనుకోడానికి. తను పట్టిన కుందేటికి మూడేకాళ్ళంటారు తప్ప మనమాట వినరు. వింటే ఇంతదాకా వచ్చేదేకాదు"

"ఇంత జరిగాక కూడా ఆయన మారలేదా? "

"నల్లరాళ్లు మారవురా. తనకి తెలిసిన పరిచయాల్నీ, సంబంధాలని ఉపయోగిస్తున్నారు. పొలిటీషియన్లని ఆశ్రయిస్తున్నారు. డబ్బు మంచి నీళ్ళలా ఖర్చుపెడుతున్నారు. పనవ్వదని స్పష్టమవుతున్నా విశ్వప్రయత్నం చేస్తున్నారు. ఎలావోలా తనది పైచెయ్యి అని నిరూపించుకోడానికి సర్వాన్నీ ఒడ్డడానికి సిద్ధపడుతున్నారు" వేదనగా చెప్పింది.

"ఎన్ని చేసినా ఎంత యత్నించినా అధర్మం, అన్యాయం ఓడక తప్పదు. నీతి రీతి గెలుపొందకా తప్పదు"

"అన్నిటికీ ఆ భగవంతుడే వున్నాడు. ఇక వస్తాన్రా. జాగ్రత్తగా వుండు. అసలే రోజులు బాగాలేవు" వెళ్ళడానికుద్యుక్తురాలవుతూ అంది.

"నా గురించేమీ దిగులుపడకు మమ్మీ. మనం ఆలోచించాల్సింది డాడీ గురించే. ఆయన మారితే బావుణ్ణు. తాతయ్యాని పిలిస్తే ఫలితం వుంటుందేమో"

"ఇద్దరూ ఎదురుపడ్డా మాట్లాడుకోరు. దారులు వేరవడంతోనే మాటలూ వేరైపోయాయి"

కారెక్కబోతూ ఆగి "మీ తండ్రీకొడుకుల యుద్ధం ఎక్కడికి దారి తీస్తుందోనని భయంగా వుందిరా" అంది మమ్మీ.

"సత్యమేవ జయతే"

నా కళ్ళల్లోకి సూటిగా చూసి మరేమీ మాట్లాడకుండా కారెక్కేసింది.

కారు కన్పిస్తున్నంతసేపూ చూస్తూ నిలబడిపోయాను.



"గాంధీ ఏమైందిరా, అలా వున్నావేంటి? ఫోన్ ఎక్కడ్నుంచొచ్చింది? " కంగారు పడ్డారు ఫ్రెండ్స్.

బదులివ్వలేకపోయాను. నోరు తెరిస్తే దుఃఖం వరదై పొంగుతుందేమోనని భయపడ్డాను.

అమ్మ రూపం కళ్ళముందు కదిలింది.

కన్నీటిబొట్లు వురికి వచ్చాయి.

"వాట్ హేపెన్డ్? " ఆదుర్దాపడింది శిరీష.

"మా డాడీ... సూసైడ్ చేసుకున్నార్ట..."

"మైగాడ్! మనం అతిగా ప్రవర్తించామేమో. మనవల్లే..."

"నో... మనం నిమిత్తమాత్రులం. అవి నీతిపరుల మరణాలిలాగే వుంటాయి. వారి

జీవితాలు అర్థాంతరంగానో, అనారోగ్యం తోనో ముగిసి పోతూంటాయి. చేసిన పాపాలకి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో శిక్ష అనుభవించి తీరతారు. నేను డాడీ గురించి ఆలోచించట్లేదు. మమ్మీ... మమ్మీ గురించే... తట్టుకోడానికి ఎంతగా అలమటి స్తోందో"

"ఇటువంటప్పుడు అవేశకావేషాలు పక్కన పెట్టి అయినవారికి అండగా నిలవాలి. వెళ్దాం పద"

మౌనంగా లేచాను.

ఇంటికెళ్ళాం.

పాడుబడినట్టుగా వుంది ఇల్లు. శ్మశాన శాంతి తాండవిస్తోంది. ఇంట్లో శవం వున్న ట్టుగానే లేదు. ఒకళ్ళిద్దరు తప్ప ఇరుగుపొ రుగు కూడా రాలేదు.

ఇంట్లో అడుగుపెడుతోంటే "ఆగు" అంటూ గర్జించాడు అన్నయ్య.

తుళ్ళిపడి చూశాను.

నిప్పులు కక్కుతూ వచ్చాడన్నయ్య.

"ఎందుకొచ్చావు? ఏ మొఖం పెట్టుకునొ చ్చావు? వెళ్ళిఫో... నీకీ ఇంటితో, ఇంటివా ళ్ళతో ఎలాంటి సంబంధబాంధవ్యమూ లేదు. వెళ్ళిపోరా. నీ ఇష్టమొచ్చినచోటుకి ఫో. ఇన్నాళ్ళూ ఎవర్ని వెంటేసుకుని తిరి గావో వాళ్ళతోనే ఊరేగు. ఇల్లూ, అయిన వాళ్ళూ లేని బైరాగిలా బతుకు ఫోరా"

"అన్నయ్యా!"

"నేను అన్నయ్యనీ కాదు, నువ్వు తమ్ము డివీ కాదు. ఈ ఇంటి గడపదాటి వెళ్ళినప్పుడే ఆ బంధం పలచనైతే ఇప్పుడి దిగో ఈ సంఘటనతో పూర్తిగా తెగిపో యింది. నీవల్ల, నువ్వు చేసిన అవమానంవ ల్లకాదూ డాడీ ఆత్మహత్య చేసుకుంది? ఇంకా ఎవర్ని మింగాలని వచ్చావురా? సిగ్గూ శరం మంచీ, మర్యాదా, చీమూ, నెత్తురూ అనేవి ఏమైనా వుంటే తక్షణం వెళ్ళిఫో..."

"వెళ్లడు. వెళ్ళాల్సిన అవసరం, అగత్యం గాంధీకి లేవు"

భ్రమాన్పడి చూశాం.

సులోచన ఇదివరకటిలా బేలలా లేదు. ఎంతో ధైర్యంగా వుంది. ధీమాగా వుంది. ఏదో శక్తి చేయూత లభించినట్టుగా లోపలి కొస్తూ అంది.

"నువ్వా? ! నువ్వెందుకొచ్చావు? " దిమ్మెర బోతూ ప్రశ్నించాడు అన్నయ్య.

"ఇది నా ఇల్లు గనుక, మీరూ మీ నాన్నా కలిసి చెప్పిన మాయమాటలకీ మీరు చేసిన అకృత్యాలకీ సాక్ష్యాలు నా దగ్గరున్నాయి. నన్ను లోనికి రానివ్వకపోతే మీరు జైల్లోప లకి వెళ్ళాల్సి వుంటుంది. రా గాంధీ"

"వాడు రావడానికి వీల్లేదు. వాడివల్లే మా డాడీ ఆత్మహత్య చేసుకున్నారు సులోచనా"

"అది అబద్ధం" అంది అమ్మ హాల్లోకి వచ్చి

మూర్తీభవించిన విషాదంలా శోకమూ ర్తిలా వుంటుందనుకున్నాను. కాని ఏదో పీడ విరగడైనట్టుగా వుంది. సంవత్సరాల అశాంతినుంచి ఆందోళననుంచి రిలీఫ్ పొందినట్టుగా వుంది. ఇన్నాళ్ళూ బంధిం చిన సంకెళ్ళు తెగినట్టూ పంజరం విరిగిన ట్టుగానూ వుంది అమ్మ!

"మమ్మీ!" అన్నయ్యా నేనూ ఇద్దరం ఒకే సారన్నాం, విభిన్నంగా ఫీలవుతూ అన్నాం.

"రా గాంధీ, రా సులోచనా..."

"మమ్మీ. నీకు మతిపోయిందా. వీడు ఇంట్లోకొస్తే నలుగురూ నోట్లో వూస్తారు. పోలీసు కేసవ్వకుండా చెయ్యడానికి చూస్తు న్నాను. వీడుంటే అన్నిటికీ అడ్డుతగుల్తాడు"

"పోలీస్‌కి ఇన్ఫార్మ్ చేసే వచ్చాను. అబ ద్ధపు బతుకొద్దు అన్నయ్యా"

"అఘోరించావులే. సూసైడ్ అని తెలిస్తే ఇన్సూరెన్సూ రాదూ. ఇంకా చాలా బెని ఫిట్లు పోతాయి తెలుసా? "

"అక్రమ సొమ్ము మనకొద్దు. నీతిగా వచ్చింది ఏముంటే అదే వుండనీ. ఏం మిగిల్తే అదే మిగల్నీ" అంది అమ్మ.

"అప్పుడిహ బూడిద తప్ప ఏమీ మిగలదు" వ్యంగ్యంగా అన్నాడు అన్నయ్య.

"అంతే ప్రాప్తమనుకుందాం"

"నేననుకోను. నాకు డబ్బు కావాలి. ఆస్తి కావాలి. మీ కక్కర్లేకపోతే వెళ్ళిపోండి. ఇదంతా నాది. వీటిని ఎట్టి పరిస్థితుల్లోనూ వదులుకోను"

"ఇంట్లో శవాన్ని పెట్టుకుని ఆస్తుల గొడవలేంటి, వూరుకోండి" సులోచన మాటలకంతా మౌనాన్నాశ్రయించాం.

శిరీషా ఫ్రెండ్సూ వెంటరాగా గదిలోకెళ్ళాను.

కటికనేలమీద పడుకోబెట్టి వుంది శవం. ఫాన్‌కి ఉరిబోసుకుని చనిపోయారేమో నాలిక, కనుగుడ్లూ బయటికొచ్చి చాలా వికృతంగా వుంది. భయంకరంగా వుంది.

లంచాల సొమ్ముతో ఎంత సుఖం జుర్రుకున్నారో తెలీదుగాని ఆఖరి క్షణాల్లో మాత్రం నరకయాతన అనుభవించి వుంటారనడానికి ప్రత్యక్ష నిదర్శనంగా వుంది శవాకారం!

కళ్ళు చెమర్చలేదు. కాని జాలేసింది.

ఇటువంటి మరణం రాసిపెట్టివుందని గాని జీవితం ఇలా ముగియబోతోందనిగాని ఏమాత్రం తెలిసినా డాడీ అవినీతి మార్గం తొక్కేవారు కాదేమో.

కనీసం ఇప్పుడైనా ఆయన బతుకు ఆయన్లాంటి వారికి కనువిప్పు అయితే బావుణ్ణు!

గదిలోంచొచ్చి హాల్లో అమ్మ పక్కన చతికిలపడ్డాను.

సులోచన ప్రమిదలో నూనెపోసి వత్తి వేసి వెలిగించి శవం తలదగ్గర పెట్టింది.

ఆ దృశ్యం చూసి కాబోలు అమ్మ బావురుమంది.

"ఊరుకోండి... గుండె రాయిచేసుకోవాలి... తప్పదు..." శిరీష ఓదార్చింది.

"ఆయన గురించి కాదు. సులోచన... ఈ ఇంటికి దీపంగా రావాల్సిన పిల్ల. రాకుండా కాలు అడ్డంపెట్టారాయన. ఇప్పుడాయన తల దగ్గర దీపం పెట్టడానికి ఆమే దిక్కయ్యింది చూడండి"

"సులోచన ఈ ఇంటి కోడలైపోయినట్టు మాట్లాడతారేంటి. నేనొప్పుకోను" బింకంగా అన్నాడు అన్నయ్య.

"నోర్ముయ్యరా వెధవా. ఇంకోసారలా కూశావంటే నీ నాలిక చీరేస్తాను. ఇన్నాళ్ళూ మీరు వేసిన వేషాలు చాలు. ఇకనైనా బుద్ధిగా వుండు" ఎన్నడూ లేనిది ఆగ్రహంతో వూగిపోతూ అంది అమ్మ.

గమ్మునుండిపోయాడు అన్నయ్య.

"జరగాల్సిన కార్యక్రమం చూస్తే మంచిది" ఒక పెద్దాయనన్నాడు.

"పోలీసులొస్తుంటారు, పోస్టుమార్టం తతంగం పూర్తవ్వనీండి" అన్నాను.

నావంక అదోలా చూసి వెళ్ళిపోయాడాయన.

"బంధుమిత్రులకి తెలియజేస్తాం. ఫోన్ నెంబర్లవీ ఇస్తే..." కరుణానందం అన్నాడు.

"ఎవరికీ తెలియజెయ్యక్కర్లేదు. ఒక కన్నీటి బొట్టు ఖర్చుచేయదగ్గ వారేమీ కాదు"

"మమ్మీ!" అమ్మ ధోరణి జీర్ణించుకోలేకుండా వున్నాను.

"మీ డాడీకి నిజమైన బంధువులూ మిత్రులూ ఎవరో తెలుసా? అక్రమవ్యాపారులూ బ్రోకర్లూ లంచగొండులూ అవినీతిపరులూనూ. ఆయన ఉద్యోగం వెలగబెట్టిన రోజుల్లో ఆయన చుట్టూ ఉపగ్రహాల్లా తిరుగుతూ పొగిడేవారు. పార్టీలిచ్చేవారు. సన్మానాలు చేస్తామనేవారు. వాళ్ళల్లో ఒక్కరంటే ఒక్కరైనా వచ్చి తొంగిచూశారేమో చూడు. అందుకే మనిషెలాటివాడో మరణమందు చూడమన్నారు"

"నీకూ వీడి పిచ్చి ఎక్కినట్టుంది. అంతా ఏమైనా అనుకుంటారేమోనన్న ఇదైనా లేకుండా ఆ మాటలేంటి?" అన్నయ్య అన్నాడు. తిరిగి తనే "రామనారాయణగా




రికి ఫోన్ చేస్తాను. అన్నీ చక్కబెడతారు" అన్నాడు.

"వద్దు... అలాటి వాళ్ళ నీడసైతం ఈ ఇంటిమీద పడకూడదు"

"మమ్మీ!"

"ఇది నామాట కాదు. మీ డాడీ మాట కూడా"

"ఏమిటి మమ్మీ నువ్వంటున్నదీ" ఆశ్చర్య బోతూ అడిగాను.

"తలకొరివి సైతం నువ్వే పెట్టాలన్నారు. నువ్వు పెడితేనే పుణ్యగతులు దక్కుతాయ న్నార్రా"

"నేన్నమ్మను. డాడీ ఎప్పుడూ అలా అనరు. డాడీకి నేనంటేనే ఎక్కువ ఇష్టం. పైగా పెద్దకొడుకుని" అన్నాడు అన్నయ్య.

"నువ్వే కాదు ఎవరూ నమ్మరనే తన అంతర్మథనాన్ని కాగితంమీద పెట్టారు. ఈ లెటర్ చూడండి మీకే తెలుస్తుంది. దీన్ని కూడా గాంధీ పేరనే రాశారు"

వణుకుతున్న చేతుల్తో లెటర్ అందుకు న్నాను.

"గాంధీ!

ఇది ఒక అవినీతిపరుడి గుండెఘోష. మృత్యువుని కౌగలించుకోబోయేముందు రాస్తున్న ఒప్పుకోలు పత్రం.

ఒకప్పుడు- అంటే నేన్నీవయస్సులో వున్న ప్పుడు నీలాగే నీతీనిజాయితీ అంటూ కబుర్లు చెప్పినవాడ్నే. ఆవేశంతో కవితలు కూడా అల్లాను.

ఉద్యోగం వచ్చాక అది కూడా అవినీతికి మారుపేరైన డిపార్ట్‌మెంట్లో వచ్చినప్పటికీ బురద అంటకుండా చాన్నాళ్ళు గడిపాను. హేళనకీ అధికారుల అలక్ష్యానికీ గుర య్యాను.

నా కళ్ళముందు నాకంటే వెనుక చేరినవాళ్ళూ చిన్న ఉద్యోగులూ ఎదిగిపో తోంటే విలాసాల్లో తేలియాడుతోంటే నాలో నాకు తెలీకుండానే పరివర్తన వచ్చింది.

"అంతా చేస్తున్న పనే కదా తప్పేంటిలే" అనుకున్నాను. 'నలుగుర్తో నారాయణ అన మన్నారు కదా' అని సమర్థించుకున్నాను. "అంతా సజావుగా గుట్టుచప్పుడు కాకుండా జరిగిపోతున్నప్పుడు భయంతో మడికట్టు క్కూర్చోవడం చేతకాని తనం" అనుకు న్నాను. బంధుమిత్రుల్లో గొప్పగా వుండా లనీ మెచ్చుకోబడాలనీ తలంచాను.

మెల్లమెల్లగా బల్లకింద చేతులు చాచడం మొదలెట్టాను.

చిత్రంగా అతికొద్దికాలంలోనే డిమాండ్ చేసి తీసుకునేస్థాయికి ఎదిగిపోయాను. ఇంకా ఇంకా డబ్బు కూడబెట్టాలని ఇళ్ళూ తోటలూ బంగారం కొనాలని విలాసవంత మైన జీవితం గడపాలని భార్యాబిడ్డలకి సుఖప్రదమైన జీవితం ఇవ్వాలని ధనిక వర్గంలో చేరిపోవాలని అర్రులుచాచాను. ఆశపడ్డాను. పథకాలేశాను. పరిస్థితుల్ని అనుకూలంగా మలచుకున్నాను. చాలావరకు సాధించాను కూడా.

తినడం తినిపించడం నిత్యకృత్యమైపో యింది. పై అధికారులూ కింది ఉద్యో గులూ వ్యాపారులూ అంతా మెచ్చుకునే స్థితికి చేరుకున్నాను.

అయినప్పటికీ అప్పుడప్పుడూ లోలోన భయంగా వుండేది. ఏసీబీ వాళ్ళో, సిఐడీలో మరొకళ్ళో వల వేస్తారేమో నన్ను పట్టుకుం టారేమో నన్న భయం వెంటాడుతూండేది. నిద్రలో ఉలిక్కిపడి లేచిన రోజులూ నిద్రప ట్టక డాబా మీద పచార్లు చేసిన రోజులూ ఎన్నో ఎన్నో వున్నాయి.

అటువంటప్పుడెంతో పశ్చాత్తాపపడేవాడ్ని. ఈదారి వదిలెయ్యాలన్పించేది. సంపాదిం చిందానితో తృప్తిపడి ఇక బుద్ధిగా, జాగ్ర త్తగా వుండాలన్పించేది. కానది కొన్ని గంట లసేపే. మళ్ళీ దుస్తులు ధరించి కార్యెక్కేస రికి మునుపటి మనిషినైపోయేవాడ్ని.

మీ తాతయ్య గురించి నాకు తెలుసు. ఆయనకి నా గురించి తెలిసి వుంటుంది

## సచిత్ర విచిత్రం



### ఆటాడుకుందాం

డబ్బుంటే కొండమీది కోతి కూడా దిగివస్తుందంటారు. హాలీవుడ్ నటి ఎలిజబెత్ టేలర్ డబ్బుకి థాయలాండ్‌నుంచి ఓ ఏనుగు అమెరికాకి విమానం దిగి వచ్చింది. తన మునిమనవడు, మనవరాలు ఆడుకోడానికి ఏనుగు కావాలని మారాంచేస్తే దీన్ని వాళ్లకామె కొనిచ్చింది. 14 ఏళ్ల వయసుగల ఈ ఏనుగు సర్కస్ కంపెనీలో శిక్షణ పొందింది. అనేక రకాల ట్రిక్స్ చెయ్యగలదీ ఏనుగు. పిల్లలంటే దీనికి మక్కువ ఎక్కువ. సర్కస్ ఆట అయ్యాక పిల్లలు దీనిచుట్టూ మూగడం, తొమ్మిదేళ్లల్లో ఇది పిల్లల్ని ప్రేమించడం నేర్చుకుంది. కారణం వాళ్లంతా తినడానికేదో పెడుతూ వుండే వారు.

లాస్ ఏంజెలస్‌లోని ఎలిజబెత్ టేలర్ కూతురింట్లో 'ఫిజి' పేరుగల ఈ ఏనుగుతో ఆడుకుంటున్న టేలర్ మనుమడు, మనమరాల్ని చిత్రంలో చూడవచ్చు.

గనుక ఎక్కడివన్నీ తవ్వుతారోనని భయపడే వాడ్ని. తప్పించుకు తిరిగేవాడ్ని.

ఆయన తర్వాత నేను భయపడింది నీకేరా గాంధీ. ఇది పచ్చి నిజం. నువ్వన్నా నీ నిజాయితీ అన్నా నీ నిక్కచ్చితనం అన్నా నాకెంతో భయంగా వుండేది. అందుకనే అది కప్పిపుచ్చుకోడానికే నిన్ను కసిరే వాడ్ని. హీనంగా తీసిపారేసేవాడ్ని. కొండొకచో దూరంగా వుండేవాడ్ని.

ఏమైతేనేం మన దారులు వేరయ్యాయి. మనం విడిపోయాం. కయ్యానికి సిద్ధపడ్డాం, ఒకరి అంతం ఒకరం చూడాలనుకునేదాకా వెళ్లాం. యస్. ఇది పచ్చినిజం.

నువ్వు నాలోని అవినీతిపరుడి అంతం చూడాలనుకున్నావు. కాని నేను నీ అడ్డు తొలగించుకోవాలని చూశాను. రామనారాయణకి చెప్పి కిరాయి గూండాలని వినియోగించమన్నాను. సిగ్గు విడిచి మరీ చెబుతున్నాను. కన్నకొడుకుని సైతం హత్యచేయించడానికి సిద్ధపడ్డ కసాయి తండ్రిని నేను.

ఎందుకింతగా దిగజారిపోయాను?

కేవలం నా ప్రెస్టేజ్ కాపాడుకోడానికి. అది ఫాల్స్ ప్రెస్టేజ్ అని తెలుసు. అంతా పైకి నన్నో పెద్ద మనిషిగా చూస్తున్నా లోలోపల అల్పుడిగా అధమాధముడిగా చూస్తుంటారని తెలుసు. అయినా మేకపోతు గాంభీర్యంతో నా పరువూ, మర్యాదా నిలబడాలని విశ్వప్రయత్నం చేశాను.

నా మీద చేయబడ్డ ఆరోపణలు ఋజువు కాకుండా చూడాలనెంతో ప్రయత్నించాను. ఎంక్వైరీ అధికారులకీ ఉన్నతాధికారులకీ రాజకీయనాయకులకీ బోల్డంత డబ్బు ఇచ్చాను. అదంతా తీసుకుని కూడా నన్ను షీల్డ్ చేస్తే వాళ్ళకి చెడ్డ పేరొస్తుందనీ వాళ్ళ లోగుట్టూ బయట పడుతుందనీ భయపడ్డారు. నన్ను బలిపశువుని చేసేశారు. నేను తీసుకున్న లంచాల్లో లయన్ షేర్ తీసుకున్నవాళ్ళే నాకు సమాధి సిద్ధం చేశారు.

రామనారాయణ కూడా ఫెయిలయ్యాడు. గూండాలకన్నా పోలీసులు బెటరనుకున్నాడు. వాళ్ళలో ఏమూలో మిగిలి వున్న కాస్తంత మంచితనం నిన్ను కాపాడింది. నా అహం మీద చావు దెబ్బకొట్టింది.

ఒక్కసారిగా అన్ని దారులూ మూసుకుపోయినట్టూ నవరంధ్రాలనీ బంధించినట్టూ అన్పించి విలవిల్లాడాను. ఏడ్చాను.

బతికితే క్రిమినల్ కేసులూ శిక్షలూ జైలు బతుకూ రాళ్ళు కొట్టడాలూ చిప్పకూడూ తప్పవు.

ఆ బతుకు ఊహిస్తేనే ప్రాణం గిలగిల్లాడుతోంది. అందుకనే చావే శరణ్యమనుకున్నాను. అది తప్ప మరో మార్గం నాకు మిగల్లేదని స్పష్టమయింది.

నాకు బతకాలని, ఎన్నో ఏళ్ళు సుఖించాలని వుంది. కాని తప్పదు. చస్తూ బతికేకన్నా చచ్చి బతికిపోవడం బెటర్.

ఒక్కసారి సింహావలోకనం చేసుకుంటే నేనెందుకోసం, ఎవరికోసం ఏం బావుకోవాలని అడ్డదార్లు తొక్కానో మననం చేసుకుంటే వాల్మీకికి ఎదురైన ప్రశ్నే నాకూ ఎదురయ్యింది.

ఎందుకు ఏం బావుకోవాలని లంచగొండినయ్యాను? కడకి నేను బావుకుందేమిటి? నేను సాధించిందేమిటి? నాకు మిగిలిందేమిటి? అనుక్షణం భయంతో బతికాను. నా వాళ్ళని సుఖపెడుతున్నానని ఆత్మవంచన చేసుకున్నాను. కడకి నా వాళ్ళే నాకు ఎదురు తిరిగే పరిస్థితి చేజేతులా కొనితెచ్చుకున్నాను.

చివరికి అవినీతిపరుడన్న ముద్ర మోస్తూ అర్థాంతరంగా జీవిత రంగస్థలంనుంచి నిష్క్రమిస్తున్నాను. విలపిస్తూ అయిష్టంగా, బలవంతంగా శలవు తీసుకుంటున్నాను.

నన్ను క్షమించమని కోరను. ఎందుకంటే నాకా అర్హతలేదు. కాని నాదో చిన్న మనవిరా గాంధీ. నా గురించి పదిమందికీ చెప్పు. లంచగొండులందరికీ చెప్పు. అందుకోసం నా యావదాస్తినీ వెచ్చించు. వారిలో ఒక్కరైనా మారితే నాకు క్షమ లభించినట్టు భావిస్తాను.



ఈ అభాగ్య తండ్రి గురించి రెండు కన్నీటిబొట్లు జార్చమని నేను కోరను కాని నాకు తల కొరవిపెట్టగలవా గాంధీ? నీ ద్వారా అగ్ని సంస్కారం పొందితే నా పాపం కొంతైనా ప్రక్షాళన మవుతుందేమోనని పేరాశరా. అన్నట్టు ఆనంద్‌ని సరైన మార్గంలో నువ్వే పెట్టాలిరా... చేతినిండా గల డబ్బు వాణ్ని పాడుజేసింది. సులోచనని నా కోడలిగా మనస్ఫూర్తిగా అంగీకరిస్తున్నాను. ఆనంద్‌తో కూడా చెప్పు.

మీ అమ్మని జాగ్రత్తగా చూసుకుంటారని నాకు తెలుసు. ఆమె అమాయకురాలు. ఆమె కేకష్టమూ రానివ్వకండి.

మరి శలవు రా నా కోరిక తీర్చరా గాంధీ...ప్లీజ్...

ఇట్లు

ఒక పాపిష్ఠి తండ్రి"

నా కళ్ళనుండి కన్నీళ్ళు ధారలు కట్టాయి.

"ఏం రాశారు? ఆస్తి పంపకాల గురించా? " అన్నయ్య అడిగాడు.

మౌనంగా లెటర్ని అందిచ్చాను.



పోలీసులొచ్చారు.

ప్రాథమిక ప్రశ్నలూ, ఫొటోలూ అయ్యాయి. శవాన్ని పోస్టుమార్టంకి తీసుకెళ్లారు.

ఆ తతంగమయ్యాక వేన్లో శ్మశానవాటికకి తీసుకెళ్ళాం.

మా వెంట అన్నయ్య, కరుణానందం, షాజహాన్ మరి నలుగురు మిత్రులు మాత్రమే వున్నారు.

డాడీ కోరిక ప్రకారం నేనే తలకొరివి పెట్టాను.

అగ్ని వేయి నాల్కలు జాపి శవాన్ని కబళించేసింది. బూడిదగా మారిపోయింది!

నిన్నటిదాకా మనిషి. కొద్దిసేపటిక్రితం వరకూ శవం, ఇప్పుడు గుప్పెడు బూడిద.

'కారే రాజులు రాజ్యముల్ గల్గవే గర్వోన్నతిన్ చెందరే వారేరి? సిరిన్ మూటగట్టుకుని పోవంజాలరే...' చిన్నప్పుడెప్పుడో చదివిన పద్యం గుర్తొచ్చింది.

ధనవంతులూ పరాక్రమవంతులు, విజ్ఞానమూర్తులు, కళాకారులు, శ్రమజీవులు అంతా ఏదో ఒకరోజున జన్మ చాలించాల్సిందే. బూడిదగా మారి మట్టిలో కలసిపోవాల్సిందే.

అయినా ఈ మూన్నాళ్ళముచ్చటకోసం మనిషి కసాయిగా, మోసగాడిగా, అవినీతిపరుడిగా, రాక్షసుడిగా మారుతూంటాడు. తనూ, డబ్బూ, అధికారం శాశ్వతం అనుకుంటాడు.

అవన్నీ బుద్బుదప్రాయాలనీ కేవలం తను చేసిన మంచి, తాను పంచిన మమత, ఆర్జించిన కీర్తి ప్రతిష్ఠలే శాశ్వతంగా మిగిలి మనిషికి అమరత్వం చేకూరుస్తాయని గ్రహిస్తే ఎంత బావుణ్ణు. అలా గ్రహించిననాడు భూమ్మీద ఎందరో "డాడీ"లు డాడీలా బతకరు. డాడీలా చనిపోరు!

నిట్టూర్చి కదిలాను.

స్నానం చేసి ఇంటికెళ్ళాం.

ఇల్లంతా కడిగించి సులోచనా, శిరీషల చేత గంగాజలంతో శుద్ధిచేయిస్తోంది అమ్మ.

కొత్త వ్యక్తిలావున్న అమ్మని చూసేసరికి నా గుండె పట్టేసింది.





"మమ్మీ!"

"వచ్చేరా. ఇదిగో సులోచనా బాత్ రూంలో గంగాజలం చిలకరించు. మళ్ళీ స్నానం చేస్తారు" అంది అమ్మ.

"మళ్ళీ స్నానం ఎందుకు మమ్మీ" అయోమయంగా చూస్తూ అడిగాడు అన్నయ్య.

"కొత్త జీవితం ప్రారంభిద్దురుగానిరా. నిన్నూ సులోచననీ, గాంధీని శిరీషనీ కలిపేస్తే నా బాధ్యత పూర్తవుతుంది"

నివ్వెరబోయి చూశాను. మమ్మీ మతి స్థిరం తప్పడంలేదుకదా? లేకపోతే ఇంటి పెద్ద చనిపోయి కొన్ని గంటలు కాలేదు ఇప్పుడు పెళ్ళి ఊసెత్తుతుందా?

"అలా చూస్తావేంట్రా. నేనేదో కాని మాట అన్నట్టూ"

"డాడీ చనిపోయారు. ఆ సంగతి నీకు గుర్తుందా? గుర్తుండివుంటే ఓ మూలన విలపిస్తూ కూర్చునే దానివిగాని ఇలా మాట్లాడేదానివి కాదు" కటువుగా అన్నాడు అన్నయ్య.

"చనిపోయింది మీ డాడీ కాదు. ఓ అవినీతిపరుడు. నీతితప్పి అక్రమ సంపాదనకి ఊడిగంచెయ్యడం మొదలెట్టిన రోజునే మీ డాడీ చనిపోయారు"

"మమ్మీ!"

"నన్ను మాట్లాడనీయండిరా. ఇన్నాళ్ళూ గొంతున్నా మూగబోయాను. కనీసం ఇప్పుడైనా స్వేచ్ఛగా మాట్లాడనివ్వండి. నరకాసురుడు చనిపోయాడని పండగ చేసుకుంటాం. రావణాసురుడు చనిపోయాడని ఉత్తర భారతదేశంలో పండగ చేసుకుంటారు. అలాగే ఒక అవినీతిపరుడు చనిపోయిన రోజు గనుక దీన్ని పర్వదినంగా భావించి మీ జంటల్ని కలపాలనుకుంటున్నాను"

"డాడీ గురించి అంత దారుణంగా మాట్లాట్టం బావోలేదు" నిరసనగా అన్నాడు అన్నయ్య.

"ఒరే ఆనంద్! పక్షి ఒకే గూడు కట్టుకుంటుందిరా. రెండోదాన్నీ మూడోదాన్నీ ఆశించదు. కాని మనిషి దురాశతో అక్రమాస్తుల కోసం ప్రాకులాడుతున్నాడు. చీమ తన జాతి జీవనం కోసం ఒక్కొక్క గింజ మోసుకుపోయి నిలవచేస్తుంది. కాని మనిషి తన జాతిని దోచి దాచుకోడానికి అర్రులు చాస్తున్నాడు. మనిషిలోని దురాశనీ విపరీత ధనాకాంక్షనీ దుర్మార్గాన్నీ పచ్చి స్వార్థాన్నీ అరికట్టకోపోతే నరుడు అసురుడవుతాడు. సమాజం భ్రష్టుపట్టిపోతుంది. అలా జరక్కూడదంటే గాంధీలాగానే మీరంతా నడుం కట్టాలి. దోషిని దోషిగా, ద్రోహిని ద్రోహిగా, లంచగొండిని లంచగొండిగా చూడటం నేర్చుకోవాలి. నువ్వు లుచ్ఛావని పబ్లిగ్గా చెప్పగలగాలి. అప్పుడే అవినీతిపరుల్లో మార్పు వస్తుంది. మీ డాడీ దుర్మార్గమూ -కర్మకాండకి కూడా నోచుకోని తనమూ ఆయన్లాంటి వారికి గుణపాఠం కావాలి. కనువిప్పు కలిగించాలి"

అమ్మ ఆవేశం చూసి నిర్విణ్ణుడ్నయ్యాను. ఇన్నాళ్ళూ లోలోన రగుల్తోన్న లావా కాస్తా ఇప్పుడు బయటపడుతున్నట్టుగా వుంది!

"అంటే ఏంటి నీ ఉద్దేశం? డాడీకి కర్మకాండలు చెయ్యడం లేదా? "

అన్నయ్య ప్రశ్నకి తల అడ్డంగా వూపింది అమ్మ.

"స్వర్గపుణ్యగతులు వున్నాయో లేవో నాకు తెలీదు. ఉంటే మాత్రం అవి ఆయనకి దక్కకూడదు"

"అన్యాయం మమ్మీ. నలుగురూ మన మొఖాన నవ్వుతారు, ఉమ్మేస్తారు"

"మీ డాడీ అక్రమార్జన చేస్తున్నారని తెలిసినప్పుడు నీకు అన్యాయం అన్న పదం గుర్తురాలేదుట్రా? కట్టుకున్న భర్త గనుక నోర్మూసుకుని పడున్నాను. నీకేం అడ్డమొచ్చిందిరా. గాంధీలా నువ్వూ ఎందుకు ప్రశ్నించలేకపోయావురా? నలుగురూ మన చేష్టల్ని అసహ్యించుకోర్రా. అభినందిస్తారు. ఇదో కొత్త మార్పుకి శ్రీకారం చుడుతుం

దిరా"

"నువ్వన్నది కరక్టే మమ్మీ. నీ ఇష్టప్రకారమే కానిస్తాం" అన్నాను.

ప్రేమగా నా తల నిమిరింది అమ్మ.

"తన దేశాన్ని చూసి గర్వించే మనిషంటే నాకిష్టం రా గాంధీ. తన దేశానికి గర్వకారణంగా వుండే నీలాంటి మనిషంటే మరీమరీ ఇష్టంరా. నువ్వు నా కడుపున పుట్టడం నా పూర్వజన్మ సుకృతంరా. అరె అలా దూరంగా నిలబడ్డారేమర్రా. సులోచనా, శిరీషా రండి రండి"

అన్నయ్య చేతుల్నీ సులోచన చేతుల్నీ కలిపింది.

అలాగే నన్నూ శిరీషనీ.

"మీరు నూరేళ్ళు తోడునీడై చల్లగా వర్ధిల్లాలి!"

అమ్మ మాటలకి "నీ పద్ధతి చూస్తోంటే ఏవో అప్పగింతలు పెడుతున్నట్టుగా వుంది మమ్మీ" అన్నాను.

"అప్పగింతలేరా. ఇన్నేళ్ళూ మీ నాన్న చేష్టల్ని మౌనంగా భరించినందుకు పాప ప్రక్షాళనం చేసుకోవాలనుకుంటున్నాను. మా నాన్న దగ్గరికెళ్ళి అనాథ బాలలకి సేవచేస్తూ శేషజీవితాన్ని గడిపెయ్యదలిచాను"

"లేదు మమ్మీ. నువ్వెక్కడికీ వెళ్ళడానికి వీల్లేదు"

శిరీషా సులోచనా వంతపాడారు.

"పేటకో గాడ్సే ఊరికో గాంధారి కొడుకూ వున్నార్రా. కనీసం జిల్లాకో గాంధీ అయినా వుండొద్దూ. నిన్ను కన్నాను. మరి కొందర్ని తీర్చిదిద్దుతాను"

మేం ఏదో అనేలోగా ఒక చిన్న సూట్‌కేస్ తీసుకుని వెళ్ళిపోడానికి తయారై వచ్చింది అమ్మ.

"మమ్మీ... ఇప్పుడే వెళ్ళాలా? "

"ఇంకొక్కక్షణం కూడా ఈ ఇంట్లో వుండలేను. పాత జ్ఞాపకాలని భరించలేను. నన్నా పాలని చూడకండి. నాకోసం ఆలోచించకండి. మీరు ముందుకు సాగిపొండి. గాంధీ! అందరిలా చుట్టూ ఆవరించిన అవినీతి చీకటిని తిడుతూ కూర్చోక ప్రయత్నించి చిరుదీపం వెలిగించావు. దానికి ఉద్యమ రూపం ఇచ్చావు. ఒక మహత్తర ఆశయం కోసం, సమాజ కళ్యాణంకోసం నువ్వు చేబట్టిన ఈ ఉద్యమం నేల నాలుగు చెరగులా వ్యాపించాలిరా. అవినీతి అన్న పదాన్ని నిఘంటువునుంచి తుడిచెయ్యాలిరా"

"మీరు మాకు అండగా స్ఫూర్తిగా వుండాలి ఆంటీ" శిరీష అంది.

"లేదమ్మా నేను వెళ్ళాలి. గాంధీని, నిన్నూ, సులోచననీ ఇక్కడి కొచ్చిన ఈ యువకుల్నీ చూస్తోంటే నా గుండె ఆనందంతో ఉప్పొంగుతోంది. మీకు శక్తీ, సత్తా సంపూర్ణంగా లేకపోవచ్చు అనుభవం చాలకపోవచ్చు ప్రామాణికత్వమూ పట్టకపోవచ్చు కానీ సాహసమెప్పుడూ యువతదే. ఉద్యమ విజయానికైనా యువతే ముఖ్యం. ఎంతో శక్తివంతులూ, ఉత్సాహవంతులూ, నిస్వార్థహృదయులూ అయిన మీరు చేపట్టిన అవినీతి వ్యతిరేకోద్యమం నూరుశాతం విజయం సాధించి తీరుతుంది. దేశం మాకేమిచ్చిందని కాదు దేశానికి మేమేమిచ్చామని ప్రశ్నించుకునే మీ భావోద్వేగాలకీ, త్యాగభావాలకీ జనం హారతులు పట్టి తీరతారు. వందేమాతరం!"

అందరం ఉద్విగ్నులమై ఉద్వేగంతో వూగిపోతూ "వందేమాతరం వందేమాతరం"

అంటూ దిక్కులు పిక్కటిల్లేలా నినదించాం.

వందేమాతరం అంటే తల్లికి నమస్కరిస్తున్నానని అర్థమని గుర్తొచ్చి నా కళ్ళు చెమర్చాయి.

సంతృప్తి నిండిన కళ్ళతో మమ్మల్ని చూస్తూ ముందుకి సాగిపోయింది అమ్మ.

సరిగ్గా అప్పుడు దూరాన్నుంచి గీతాశ్లోకం విన్పించింది.

"కర్మణ్యే వాధి కారస్తే మాఫలేషు కదాచన"







# చతుర కతలు

## పదోవంతు

పన్నెండేళ్ల కిరణ్, పదేళ్ల గౌతమి అన్నాచెల్లెళ్లు. ఇద్దరూ ఎప్పుడూ తగువులాడుకుంటూ కీచులాడుకుంటూ తల్లికి తలనెప్పి తెప్పిస్తుంటారు.

అన్నయ్య దగ్గర ఏమున్నా బలవంతంగా లాగేసుకోవడం గౌతమికి వెన్నతో పెట్టిన విద్య.

"చూడమ్మా! చెల్లి నా చాక్లెట్ లాక్కుని తినేసిందనో, నా బిస్కెట్ పాకెట్ కొట్టేసిందనో" కంప్లెయింట్ చేస్తుంటాడు కిరణ్ తల్లికి.

"చెల్లే కదరా! ఏమైపోయింది. అసలు నీ దగ్గరేమున్నా చెల్లికి అందులో భాగం పెట్టాలి తెల్సా! నువ్వు కాకపోతే ఇంకెవరు చూస్తారు దాన్ని? నీ దగ్గర వందరూపాయలున్నాయనుకో. దాన్లో పదోవంతు చెల్లికిస్తుండాలి. అప్పుడే నిన్ను అది ప్రేమగా చూసుకుంటుంది" అని హితబోధ చేసిందోసారి కిరణ్‌కి తల్లి.

ఓసారి వాళ్ళ మావయ్య ఇంటికి వచ్చి తిరిగి వెళ్ళిపోతున్నప్పుడు కిరణ్‌కి, గౌతమికి చెరో వందరూపాయలు ఇచ్చి వెళ్ళాడు.

ఆ మరునాడు "అమ్మా! ఇరవైరూపాయలివ్వవా పెన్ను కొనుక్కోవాలి" అనడిగాడు కిరణ్.

"అదేమిట్రా! నిన్ననేకదా మావయ్య వంద రూపాయలిచ్చాడు. దాన్లో కొనుక్కో" అంది తల్లి.

"ఇంకెక్కడి వందరూపాయలు? చెల్లి లాగేసుకుందికదా" అన్నాడు కిరణ్.

"ఒరి పిచ్చి వెధవా! వంద రూపాయలూ దానికిచ్చేవా? నేను నీకేం చెప్పాను? నీ దగ్గరున్నదాంట్లో పదోవంతేకదా ఇమ్మన్నాను దానికి" అంది తల్లి.

"అలాగే ఇచ్చేనమ్మా! నా వందలో పది రూపాయలిచ్చానా! నీ దగ్గర ఇంకా తొంభైరూపాయలున్నాయికదా అందులో పదోభాగం తొమ్మిది రూపాయలు నావి అని, ఆ మిగిలిన ఎనభైఒక్క రూపాయల్లో పదోవంతు



ఎనిమిది రూపాయలు నావి అని, ఆ మిగిలిన డెబ్బైమూడు రూపాయల్లో ఏడు రూపాయలు నావి అని, ఆ మిగిలిన అర్వై రూపాయల్లో పదోవంతు ఆరు రూపాయలు నావి అని ఇలా లెక్కచెప్పి మొత్తం వందరూపాయలూ అదే లాగుసుకుందమ్మా" అని చెప్పాడు కిరణ్ బిక్క ముఖంతో.

కొడుకు అమాయకత్వానికి విచారించాలో, కూతురు గడుసుతనానికి సంతోషించాలో అర్థం కాలేదాతల్లికి.

—కోనే నాగవెంకట ఆంజనేయులు

# ఆటలో అరటిపండు

ఢిల్లీ వెళ్ళే సూపర్ ఫాస్ట్ ఎక్స్‌ప్రెస్ ప్లాట్ ఫాంమీద సిద్ధంగా వుంది. ఫస్ట్‌క్లాస్‌లో ఎక్కాను. పైబెర్త్‌మీద ఎవరిదో లగేజ్ మాత్రం కూపేలో వుంది. ట్రెయిన్ కదలడానికింకా వ్యవధి వున్న కారణంగా పాసింజర్లు ప్లాట్‌ఫాంమీద బంధుమిత్రులతో కబుర్లు చెప్పుకుంటున్నారు.

పైనున్న సఫారీ సూట్‌కేస్ పక్కనే నా సూట్‌కేస్‌నీ వుంచాను. దొరబాబులా వుండే నన్ను ఓ 'దొంగ' అని అనుమానించడం ఎవరికీ సాధ్యం కాదు. ఎక్స్‌ప్రెస్ ట్రెయిన్స్‌లో తిరుగుతూ అప్పర్‌క్లాస్ ప్రయాణీకుల సూట్‌కేసులలోని వాల్యుబుల్స్‌ని మాయం చేయడం నా వృత్తి. అయిదేళ్లుగా ఆ దొంగాట ఆడుతూవున్నా ఒక్కసారీ పట్టుపడకపోవడం నా ఆత్మవిశ్వాసాన్ని పెంచింది.

జేబులోంచి 'మాస్టర్‌కీ'ని తీసి బెర్త్‌మీదున్న సఫారీని తెరవడానికుపక్రమించాను. దాని యజమాని లోపలికి వచ్చేలోపున నా పని పూర్తికావాలి. నా చేతివేళ్లు వేగంగా కదులుతున్నాయి.

గుమ్మంవద్ద అలికిడవడంతో చటుక్కున తలతిప్పి చూశాను. ఓ పాతికేళ్ల యువతి! మాడర్న్ డ్రెస్సూ, ఆకర్షణీయమైన రూపమూను. నావంకా, సఫారీ వంకా మార్చి మార్చి చూసింది.

తత్తరపాటును కప్పిపుచ్చుకోవడానికి ప్రయత్నిస్తూ ఆమెవంక చూసి ఓ వెర్రినవ్వు నవ్వాను. "సారీ! నాదనుకుని పొరపాటున మీ సూట్‌కేస్ తెరవబోయాను" అన్నాను ఎపాలజెటిక్‌గా.

నా వంక తీక్షణంగా చూసిందామె. తరువాత నన్ను తప్పించుకుని లోపలికొచ్చి సఫారీని అందుకుంది. దాన్ని కిందకు దింపడంలో ఆమెకు సాయంచేశాను అడక్కుండానే. థాంక్సయినా చెప్పకుండా సూట్‌కేస్ తీసుకుని బయటకు దారితీసింది.




"కంపార్ట్‌మెంట్ మారుతున్నారా? " అన్నాను ఏమనాలో తోచక.

జవాబివ్వలేదామె. నావంక ఓ సీరియస్ లుక్ వేసింది అంతే!

ఇక ఆ కూపేలో నాకు పనేముంది? మరో క్యాబిన్ చూసుకోవాలి. వెంటనే దిగిపోతే ఎవరికైనా అనుమానం కలగవచ్చునని అయిదు నిమిషాలు కూర్చుని లేచాను.

అంతలోనే ట్రెయిన్ కదలడమూ, ఓ భారీ వ్యక్తి కూపేలో ప్రవేశించడమూ జరిగాయి. పైబెర్త్‌మీద దృష్టి సారించిన అతను ఉలిక్కిపడి "పైన నా సూట్‌కేస్ వుండాలి. ఏమయింది? " అన్నాడు కంగారుగా.

తెల్లబోయాను నేను. "ఏం సూట్‌కేసూ? "

"సఫారీ. బ్రౌన్‌కలర్ కవరుంటుంది. ఇక్కడే పెట్టాను" అంటూ కూపేలో వెదకసాగాడు.

"అది మీదా? !" అన్న పలుకులు అప్రయత్నంగా నా నోటినుంచి వెలువడడంతో, "ఎస్ నాదే. ఏమయింది? " అని ఆత్రంగా అడిగాడు.

"ఇంతక్రితమే ఓ యువతి వచ్చి తీసుకుపోయిందే!" అంటూ ఆశ్చర్యంతో నోరు వెళ్ళబెట్టాను నేను.

చటుక్కున నా షర్ట్ కాలర్ పట్టుకున్నాడతను. "చెప్పు, ఎవరామె? నా సూట్ కేస్ ఏమయింది? " అంటూ పెద్దగా కేకలు వేశాడు.

ఆ అరుపులకు పక్క క్యాబిన్సులోని ప్రయాణికులు వచ్చి మూగారక్కడ.

"సూట్ కేస్ ఎత్తుకుపోయిన మనిషి వీడి తాలూకే అయివుంటుంది. పోలీసులకి అప్పగించండి" అని ఒకరంటే-

"పోలీసులదాకా ఎందుకు చితగ్గొడితే వీడే చెబుతాడు తన పార్ట్నర్ సంగతీ, సూట్ కేస్ ఆచూకీను" అన్నారు ఇంకొకరు.

"ప్లీజ్! నాకేం తెలీదు. ఆవిడ ఎవరో వచ్చి ఘరానాగా సూట్ కేస్ తీసుకుపోతూంటే అది తనదేననుకోవడం నా తప్పు కాదు..." సిన్సియర్‌గా మొత్తుకున్నాను నేను.

నా అనుభవంలో ఎన్నడూ అలా జరగలేదు. ఆ యువతి కూడా నా బాపతేనని ఊహించలేకపోయాను. సఫారీని చేజేతులా ఆమెకందించాను. ఆ దొంగాటలో పావునయిపోయాను. ఆటలో అరటిపండునయ్యాను. ఇప్పుడు నేరం ఒకరిది, శిక్ష మరొకరికీను! వీళ్ల చేతుల్లో తన్నులు తినడంమాట ఎలా వున్నా, పోలీసులవరకూ వెళితే డొంకంతా కదులుతుంది. నా జేబులో వున్న మాస్టర్ కీస్ గుత్తి సులభంగా పట్టించేస్తుంది నా వృత్తిని.

'సఫారీ' యజమాని ఆవేశంగా నామీదకొస్తూంటే నా మెదడు మొద్దుబారిపోయింది. బలమైన అతని చేయి గాలిలోకి లేచింది నన్ను కొట్టడానికి. కాని ఆ దెబ్బ ఎక్కడ తగిలిందో, ఎంత బలంగా తగిలిందో నాకు తెలియదు. ఎందుకంటే అప్పటికే మూర్ఛబోయాను నేను భయంతో!

**-తిరుమలశ్రీ**

---

## కల్తీ

పెద్ద పెద్ద కంకులతో విరగ కాసి, చేలోదిగి చేళ్లు వేయడానికి కూడా అవకాశం లేనట్టుగా వుంది వరిచేను.

"ఈసారి పంటలతో అప్పులన్నీ తీరిపోయి మిగిలిన డబ్బులతో మంగమ్మకు చెవికమ్మలు చేయించాలి. కాపరానికి వచ్చాక దానికి కానీ ఎత్తు బంగారం కూడా కొనలేదు. పిలగాడికి రెండు జతలబట్టలు కొనాలి. తను కూడా ఓ మంచి చొక్కా, ఓ బొచ్చుతుండు కొనుక్కోవాలి" అనుకున్నాడు చేనుగట్టున కూర్చున్న చిన్నయ్య. "ఏంటి చిన్నయ్యా ఈసారి పంట బాగున్నట్టుంది" నాయుడుగారి పొలాలు చూడటానికి అటుగా వస్తున్న వ్యవసాయాధికారి చిన్నయ్యను పలకరించాడు.

ఊహల్లో విహరిస్తున్న చిన్నయ్య కంగారు పడుతూ లేచి, "దండాలయ్యగారూ... ఈసారి పంట బాగానే వుందండి. కంకులింకా తోడుకుంటున్నాయి. రెండు వారాల్లో కోతకొస్తాది" అన్నాడు వినయంగా.

వ్యవసాయాధికారి చేనును పరీక్షగా చూసి, "చిన్నయ్యా నేనో మందు రాసిస్తాను. ముందుజాగ్రత్తగా ఓసారి స్ప్రే చేయించు. ఇక నీకు ఏ భయం వుండదు" అన్నాడు.

"అలాగే బాబూ" అంటూ చీటీ తీసుకుని జేబులో పెట్టుకున్నాడు. వ్యవసాయాధికారి నాయుడుగారి పొలాలకేసి వెళ్ళిపోయాడు.

"దేవుళ్ళా వచ్చాడు అయ్యగారు" ముందు జాగ్రత్తగా మందు కొడితేనే మంచిది అనుకున్నాడు చిన్నయ్య.

మర్నాడు ధాన్యం కమీషన్‌దారు దగ్గర అప్పు తీసుకుని పట్నం వెళ్ళి పురుగుమందు తీసుకొచ్చి స్ప్రే చేసి ప్రశాంతంగా గాలి పీల్చుకున్నాడు చిన్నయ్య.

కోతలు మొదలైతే ఇహ ఎక్కడికి వెళ్ళ టమూ కుదరదని మంగమ్మను తీసుకుని అత్తవారింటికి వెళ్ళాడు అమ్మవారి జాతర కని.

నాలుగురోజుల తరువాత తిరిగొచ్చిన చిన్నయ్య పొలం వెళ్ళేసరికి పసిడివర్ణంతో మిసమిసలాడవలసిన చేను దోమపట్టి, పిడు గుపడి మాడిపోయినట్లుగా పడివుంది.



నోటమాట కోల్పోయాడు చిన్నయ్య. పిచ్చి చూపు పడినట్లయింది.

మోసం జరిగిపోయింది. పురుగుమందు అసలు పనిచేయలేదు. కల్తీమందు. మందు స్ప్రే చేశానుకదా అన్న ధీమాతో ఉంటే పంటంతా సర్వనాశనమైపోయింది.

పాతబాకీలు, కొత్త అప్పులు కలిసి కొండంత అయ్యాయి. అప్పులబాధ తట్టుకో లేక మిగిలిన డబ్బాడు పురుగుమందూ తాగేసి ఆత్మహత్యకు పాల్పడ్డాడు చిన్నయ్య.

మంగమ్మ గొల్లుమని ఏడుస్తోంది.

"ఎందుకయ్యా ఇంతపని చేశావ్? కష్టప డితే ఈ అప్పులు తీర్చుకోలేకపోయేవా ళ్ళమా" అని పక్కనే నిలబడి కొడుకు ఏడు స్తున్నాడు.

పెళ్లాన్ని, కొడుకుని చూసి "ఆవేశంలో పురుగుమందు తాగి తప్పు చేశానా? " అని పించింది చిన్నయ్యకు. బతుకుమీద ఆశ కలి గింది. కాని పురుగుమందు తాగి బతకట మంటే మాటలా! ఇక ఈ జన్మకు ఇంతే!" అనుకుని కళ్లు మూసుకున్నాడు.

ఊళ్లోవాళ్ళు కొంందరు హాస్పటల్‌కు తీసు కువెళ్దాం అన్నారు. నాలుగుమైళ్లు బండి మీద వెళ్ళేవరకూ బతుకుతాడేంటి అన్నారు కొందరు.

"బతికితే బతుకు తాడు కొబ్బరినీళ్ళు పట్టించండి" అన్నారు ఫైనల్‌గా. మంగమ్మ చొరవ చేయలేకపోయింది. చేతిలో డబ్బుల్లేక దేవుడిమీదే భారం వేసింది. చిన్నయ్య శ్వాస ఆగిపోయింది.

సాయంత్రం అయ్యేసరికి పాడేకట్టేశారు. శవాన్ని లేవదీసి పాడెమీదికెక్కిద్దామనుకుం టూండగా నిద్ర లేచినట్లు లేచికూర్చున్నాడు చిన్నయ్య.

"బ్రతికాను భగవంతుడా! కల్తీమందు కారణంగా బతికాను కాని లేకపోతే? అమ్మో" అనుకుని కొడుకుని ఆప్యాయంగా దగ్గరకు తీసుకుని కల్తీవ్యాపారులకు మనసు లోనే దణ్ణం పెట్టుకున్నాడు చిన్నయ్య.

– హైమవతీ సత్య







# ఏరిన ముత్యాలు

★ నిన్నటివరకు చదివి ఈరోజు చదవడం మానేసిన యువకుడు రేపటి చదువురాని వాడు.

-నెహ్రూ

★ ఎప్పుడూ తాగేవారికి రుచి తెలియదు. ఎక్కువ మాట్లాడేవారికి ఆలోచన ఉండదు.

-మాచ్పు

★ కష్టించి పనిచేసేవానికే విశ్రాంతి యొక్క ఆనందం తెలుస్తుంది.

-గాంధీజీ

★ ఉపాధ్యాయుడే విద్యార్థికి విలువైన పాఠ్యగ్రంథం.

-గాంధీజీ

★ పఠనం పూర్ణపురుషుడుగా, లేఖనం ఖచ్చితమైన మనిషిగా, ఉపన్యాసం సంసిద్ధత గల వ్యక్తిగా రూపొందిస్తుంది.

-ఫ్రాన్సిస్‌బేకన్

★ నేను చదవడం కోసం బతుకుతా, బతకడం కోసం చదవను.

-ఫ్రాన్సిస్‌బేకన్

★ ఆలోచన వికసించే పుష్పం, ఆలాపన దానికి అంకురం, ఆచరణ ఫలం.

-ఎమర్సన్

★ విమర్శలకు భయపడకు, ఎదురుగాలిలోనే గాలిపటం పైకి లేస్తుంది.

-ఫ్లెమింగ్

★ ఆలోచించలేనివాడు మూర్ఖుడు, ఆలోచించగోరనివాడు అంధవిశ్వాసి, ఆలోచించ సాహసించనివాడు బానిస.

-కార్నెగి

★ కష్టాలను మించిన పాఠశాల లేదు.

-ఠాగూర్

★ బానిసకు బాధలెక్కువ, స్వతంత్రుడికి బాధ్యతలెక్కువ.

-గాంధీజీ

★ గంధపు చెక్కలా సమాజసేవలో అరిగిపో కానీ ఇనుములా తుప్పు పట్టకు.

-విశ్వేశ్వరయ్య

★ ప్రపంచంలోని అన్ని పుస్తకాలకన్నా జీవితచరిత్ర చాలా విలువైన గ్రంథం.

-కార్లయిల్

★ ఎవరికీ హాని కలిగించక ప్రతిప్రాణినీ నీతో సమంగా చూసుకో.

-మహావీరుడు

★ ఏ పాలనావిధానమైతే ప్రజల నిత్యజీవితంతో తక్కువ ప్రమేయం పెట్టుకుంటుందో అదే మంచి ప్రభుత్వం.

-థోరా

సేకరణ: పి.వి.రమణకుమార్

# 'దూదిపూలు' పై సమీక్షలు

మే చతురలో ప్రచురితమైన గోపరాజు నాగేశ్వరరావు రచన 'దూదిపూలు' పై మాకందిన ఉత్తమ సమీక్షలను ఈ దిగువ ప్రచురిస్తున్నాం.

## మేకు గా మారే ఏకు

*(ప్రథమ బహుమతి రూ. 100/– పొందిన సమీక్ష)*

ప్రస్తుత సమాజంలో మున్నూట అరవైఆరు రోజులూ జరుగుతున్న నిత్యసత్యాలను, అత్యాచారాలను, స్త్రీకి జరుగుతున్న అన్యాయాలను, సమాజమే స్త్రీని ఒళ్ళు అమ్ముకునేలా చేస్తున్న పరిస్థితులను, రక్షకులే భక్షకులవడం, కంచే చేనుమేయడం, 'రోజా', 'దిల్ ఖుష్'లాంటి దూదిపూలు సుధీర్‌లాంటివాళ్ళు ఊదించిన గాలికి ఎగిరిపోవటం, వాళ్ళను ఆపాలని, ఆలంబననివ్వాలని అనుకున్న 'చైతన్య', 'పానకాలు'లాంటి వాళ్ళకి కల్గిన ఇబ్బందులు, పడిన బాధలు, వగైరా కళ్ళకు కట్టినట్లుగా మన ఎదురుగా జరుగుతున్నట్లుగా చక్కగా చిత్రించారు రచయిత.

లాకప్‌లోకి ఆడవాళ్లను రప్పించి, ఇళ్ళకి తీసికెళ్ళి 'ఇంటరాగేషన్' చేసే పెద్దపులులు, నక్కలు, తోడేళ్ళు ఈ రోజుల్లో కోకొల్లలు. అలాగే తొలిరోజే డ్యూటీలో జాయిన్ అయి కొత్తగా ఆ రాత్రే "మొదటి రాత్రికి" బలి అయి, వ్యవస్థతో రాజీపడిన రత్తమ్మలూ కోకొల్లలు! అందులోనే 'నేరేడు', 'గూనోడు'లాంటి వాళ్లు కూడా తారసిల్లుతారు.

అన్నింటికంటే తన పతనానికి మూలకారకుడయిన సుధీర్‌మీద సినిమాఫక్కీలో కక్షసాధించిన వైనం బాగా చిత్రీకరించబడింది. 'ఏకు' కూడా 'మేకు'గా మారగలదన్పించిన 'పానకాలు' పాత్ర, నవల ముగింపూ బాగులేదు. మొత్తంమీద నవల బాగుంది.

–వి. లలితాంబ
సీతంపేట-532 443

## పడగనీడ

*(ద్వితీయ బహుమతి రూ. 75/– పొందిన సమీక్ష)*

గతి తప్పిన పోలీసు వ్యవస్థపై గురి చూచి సంధించి వదలిన బాణంలాంటి గోపరాజు నాగేశ్వరరావుగారి 'దూదిపూలు' వైవిధ్యంగా, సహజంగా వుంది. సామాన్యునికి రక్షణ కల్పించాల్సిన పోలీసు డిపార్టుమెంటు కంచే చేనుమేసిన చందంగా చట్టాలను తమ నీచాతినీచమైన పనులకు, స్వప్రయోజనాలకు దుర్వినియోగం చేస్తూ, సంఘ వ్యతిరేకశక్తులతో చేతులు కలిపి ఎంతగా దుష్టపాత్రను పోషిస్తున్నారో నవలలోని పోలీసు పాత్రల ద్వారా చక్కగా చూపించారు. పోలీసు డిపార్టుమెంటులో కూడా గంజాయి వనంలో తులసిమొక్కలాంటి వారు లేకపోలేదు. ప్రభుత్వం పోలీసులకు కొన్ని శిక్షణా కార్యక్రమాలు నిర్వహించినా, మైత్రీ సంఘాలు నెలకొల్పినా ఇవి నేతిబీరకాయలోని నేయి మాదిరిగానే మిగిలిపోతుంటాయి. రాజకీయనాయకులకు సలాములు కొట్టడం, గూండాలకు వంగివంగి దండాలు పెట్టడం అందరికీ తెలిసిన విషయమే. వీళ్ళ ప్రతాపమంతా రిక్షావాళ్ళపైన, రికార్డు డ్యాన్సర్లపైన, బతుకు తెరువుకోసం వీధుల్లో సరుకులు అమ్ముకు బతికే వాళ్ళపైన చూపించడం, మనం చూస్తున్నదే. నలుగురికి మంచి చేయాలనే చైతన్య, పానకాలులాంటి యువకులను హింసించి తీవ్రవాదంవైపు





మొగ్గ చూపించేందుకు కొంతవరకు ఈ పోలీసు వ్యవస్థే కారణమవటంలో సందేహం లేదు. ఈ విషయాన్నే రచయిత పరోక్షంగా ముగింపులో చెప్పడం జరిగింది. వీటికి సాక్ష్యాలు లాకప్ డెత్‌లు, మహిళలపై అత్యాచారాలు దినపత్రికలలో తాటికాయంత అక్షరాల్తో వస్తున్నవే. దొంగల్లోనూ మానవత్వం ఉందనేందుకు, గూనోడు పాత్ర సజీవ సాక్ష్యం. పాము పడగనీడన చేరితే ఏమవుతుందో సుధీర్ పోలీసుల్తో చేసిన స్నేహమే ఉదాహరణ. మొత్తానికి నవల బావుంది.

–జలగం శ్రీనివాసులు
చిత్తూరు-51700

## పోలీసులకు ఓ విమర్శనాస్త్రం

*(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

విధిధర్మాన్ని మరచి, రాక్షసప్రవృత్తి కంటే హీనంగా ప్రవర్తిస్తూ, అమాయక పేదప్రజలను పట్టిపీడిస్తున్న నేటి పోలీసు వ్యవస్థపై సమూల ప్రక్షాళనా ప్రయత్నమే గోపరాజు నాగేశ్వరరావుగారి నవల 'దూదిపూలు'. వేరే దారిలేక తమ పొట్టకూటికోసం డ్యాన్సుల్నే వృత్తిగా చేపట్టిన రికార్డు డ్యాన్సర్‌ల సాధక బాధకాల, కష్టసుఖాల ఇతివృత్తమే 'దూదిపూలు'! ప్రేమ, సెంటిమెంట్, శృంగారం, హాస్యం మొదలైన ఇతివృత్తాలను కాదని 'చీడపురుగు'లాంటి పోలీసు వ్యవస్థనే సబ్జెక్టుగా తీసుకొని పోలీసుల దౌర్జన్యాలు, అక్రమాలు, అరాచకాలను వివిధ పోలీసు పాత్రల ద్వారా తెలియజేస్తూ పాఠకులను ఆలోచింపజేసేదిగా నవలను తీర్చిదిద్దటంలో రచయిత సఫలీకృతులయ్యారు. జులాయిగా తిరిగే సుధీర్, అన్యాయాన్ని చూసి సహించలేని చైతన్య, పిరికివాడయిన పానకాలు, దారిద్ర్యాన్ని అనుభవించే రోజా, తన శీలాన్నే అర్పించి, తెలివిగా సుధీర్‌ను చట్టానికి అప్పగించిన దిల్‌ఖుష్, సోడాలమ్మే చలాకీపిల్లగా నేరేడు, పోలీసులకన్నా దొంగలే నయమని పించే పాత్రలో గూనోడు మొదలైన పాత్రలను కళ్ళకు కట్టినట్లుగా చిత్రీకరించారు. ముఖ్యంగా చైతన్య పాత్రను నిజంగానే చైతన్యవంతంగా తీర్చిదిద్దారు. చదువుతున్న పాఠకులలో కూడా చైతన్యం తెచ్చేదిగా ఉందా పాత్ర.

హత్యలు, అత్యాచారాలు చేసినవారిని శిక్షించాల్సిన రక్షకభటులే 'భక్షకభటులై' ధన దాహంతో కామాంధకారంతో అత్యాచారాలకు పాల్పడితే ఇక ఈ దేశం పరిస్థితి ఏమిటి? దొంగతనాలు చేసిన వారిని పట్టుకోవాల్సింది పోయి అమాయక ప్రజలను పట్టుకొని పీడిస్తుంటే పేదప్రజలకు దిక్కెవరు? దెబ్బతగిలిన ఆవు గాయానికి ముక్కుతో మందు రాస్తున్నానని చెపుతూ రక్తాన్ని పీల్చే కాకిలాంటిది ఈ పోలీసువ్యవస్థ. న్యాయంకోసం తమ దగ్గరికొచ్చిన పేదవారికి న్యాయం చేస్తున్నామంటూ లంచాలతో వారిని పీల్చిపిప్పిచేసేది ఈ ఖాకీ వ్యవస్థ. పోలీస్‌స్టేషన్ లకెళ్లేబదులు గుళ్ళోకెళ్ళి మన కష్టాలను దేవునితో చెప్పుకుంటే తీరుతాయేమోగాని పోలీసులతో చెప్పుకుంటే ఫలితం శూన్యం.

రోజా, దిల్‌ఖుష్‌లు పోలీసుల కామాగ్నికి బలయ్యారు. తమ దౌర్జన్యాలకు ఎదురుతిరిగిన చైతన్యను పోలీసులు ఉగ్రవాది పేరుతో అరెస్టు చేశారు. అశ్లీలం పేరుతో రికార్డు డ్యాన్సర్‌ల బతుకులపై బురదజల్లి వారు అంతకంటే హీనమైన వేశ్యావృత్తిని ఆశ్రయించేటట్లుగా చేశారు. "నేటి సమాజంలోని కుళ్ళిపోయిన ఈ పోలీసు వ్యవస్థ మారనంత కాలం ప్రజల జీవితాలు సుఖాంతం కావు. అన్యాయాలతో, అక్రమాలతో, హింసలతో భారతావని అగ్నిగుండంలా రగులుతూనే ఉంటుంది" అని ప్రబోధించే ఈ నవల ఓ గొప్ప 'విమర్శనాస్త్రం'.

–వి. నరసింహనాయుడు
కర్నూలు- 518 002.

## యువకులు కరువైపోతారు

*(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

మే నెలలో ప్రచురితమయిన గోపరాజు నాగేశ్వరరావుగారి 'దూదిపూలు' ఆధునిక సమాజానికి దర్పణంగా సమాజంలోని వైవిధ్యభరితమైన జీవితంతోపాటు నేటి చట్టానికి నిలువెత్తుసాక్ష్యంలా ఉంది. ఇంటర్‌దాకా చదివి సోడాలు అమ్ముకునే నేరేడు మగవాడితోడు లేకుండా ఒంటరిగా తన తల్లిని పోషించుకోవటం నేటి సమాజంలోని నిరుద్యోగులకు ఒక గుణపాఠంలా రచయిత నవలలో అందించాడు. సుధీర్‌లాంటి వ్యక్తులు పోలీసులను తమ అవసరాలకు వాడుకుంటూ వారితో కుమ్మక్కయి చివరికి వాళ్ళే అతనిని దిల్ ఖుష్ సాక్ష్యంతో ముద్దాయిగా నిలబెట్టడం రచయిత రచనాశక్తికి నిదర్శనంగా తోస్తుంది. కాలేజీలలో జరిగే ర్యాగింగులూ, జల్సాచేసే విద్యార్థుల చేతలూ అప్పోసప్పో చేసి కొండంత ఆశతో కాలేజీలలో చేరిన పేద మధ్యతరగతి వర్గాల పిల్లలలో నిరుత్సాహాన్నే పెంచుతాయి. వారు ట్యూషన్లను ఆశ్రయించవలసిరావటం బాధాకరంగా తోస్తుంది. దిల్ ఖుష్, రోజాలాంటి డ్యాన్సర్లపైనా, అమాయకులపైనా జరిగే దౌర్జన్యాలకి వ్యతిరేకంగా పోరాడిన చైతన్యలాంటి యువకులు జైలుపాలవ్వాల్సిందేనా? అలా జరిగితే అన్యాయాన్ని ఎదిరించటానికి యువకులే కరువైపోతారు. ఈ నవలలోని పాత్రలన్నింటికి రచయిత తగిన న్యాయం చేకూర్చాడా? అన్న సందేహం కలుగుతుంది. రోజా, దిల్ ఖుష్‌ల బతుకులు దౌర్జన్యానికి బలైపోవటం ఒక ఉదాహరణ. ఏది ఏమైనప్పటికీ నవలను ఎక్కడా అనవసరంగా పొడిగించకుండా, వ్యర్థ ప్రస్తావనలు లేకుండా రూపొందించిన గోపరాజు నాగేశ్వరరావుగారికి, ప్రచురించిన 'చతుర'కు ధన్యవాదాలు.

–మామిళ్ళ అచ్యుతరావు,
భూపాలపల్లి 506168

## న్యాయానికి జైలు

*(అయిదవ బహుమతి రూ: 50/– పొందిన సమీక్ష)*

మనదేశంలో న్యాయం, ధర్మం అనేవి ఏనాడో అడుగంటినవనీ, కేవలం దుర్మార్గం, దౌర్జన్యం, కుట్రలు రాజ్యం ఏలుతున్నవని నిరూపించే నవల దూదిపూలు.

మనది పోలీసు రాజ్యం. పోలీసులు ఉన్నది కేవలం ధనవంతులకోసం, నాయకుల కోసం, అధికారం ఉన్న వారికోసం మాత్రమే. ఎంత వద్దనుకున్నా తప్పని శాఖ ఇది. ఇట్ ఈజ్ ఎ నెససరీ ఈవిల్.

ఈ నవలలో ఏ సంఘటనా కృత్రిమంగా లేదు. కాలేజీల పరిస్థితి, సుధీర్‌లాంటి డబ్బున్న కుర్రవాళ్ళ విచ్చలవిడితనం, రికార్డు డ్యాన్సర్ల నికృష్ట జీవితం, చిల్లర వ్యాపారస్థుల దురవస్థ, పోలీసుల దౌర్జన్యం కళ్ళకి కట్టినట్లు రాశారు. న్యాయంకోసం పోరాడిన చైతన్య జైలు పాలయ్యాడు. పానకాలు హింసలపాలై చివరకి ముల్లుని ముల్లుతోనే తీయాలనే సిద్ధాంతానికి వచ్చాడు. ఈనాటి యువత పెడదారి పట్టడానికి పోలీసులు, రాజకీయనాయకులు అనటంలో సందేహంలేదు. ఆద్యంతం విడువక చదివించే నవల.

–కె. రామారావు
హైదరాబాద్-500 038.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060; Cuddapah: 70011: Tadepalligudem: 28881; Warangal: 59933.

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78